# సోమరితనముగా నుండుటకు ఇది సమయముకాదు

**స్త్రీల సహాయక దళములో** (ఇండియా) ఉద్యోగములకు ప్రస్తుతము అనేకవేలమంది స్త్రీలు అవసరము. ఈ ఉద్యోగములలో పని అత్యంత ఉత్సాహకరముగా నుండును. మంచి జీతము రాగలదు. వయస్సు 17 సం.లకు 50 సంవత్సరములకు మధ్యవుండి, ఇంగ్లీషును ధారాళముగా మాట్లాడుట, వ్రాయుట తెలిసినవారు మాత్రమే దరఖాస్తు చేయవలెను.

**సౌకర్యములుగల వసతి గృహములు:** డబ్ల్యు. ఏ. సి. (ఐ) లోని జనరల్ సర్వీసులో చేరువారు సౌకర్యములుగల వసతిగృహములలో నుంచబడుదురు. ఈ దళములోనివారే అగు బాధ్యులైన స్త్రీలు వాటిని పరిశీలించుచుందురు.

**విజయము:** బెదరతుగా శత్రువులు లొంగిపోవుటకు ఈ యుద్ధములో తమపాత్రను నిర్వహించునట్టి భారత స్త్రీలు విజయము వచ్చిన పిమ్మట శాంతి సౌఖ్యములను అనుభవించుటలో ఎక్కువ అధికారము కలిగియుందురు.

**మున్ముందు ఉద్యోగము:** వాణిజ్యములోను, పరిశ్రమలలోను ఇండియా త్వరితగతిని అభివృద్ధిచెందుచున్నది. శాంతి యేర్పడిన తరువాత సివిల్ ఉద్యోగములకు అనేకమంది సుశిక్షితులు (స్త్రీలు, పురుషులు) అవసరమగుట నిశ్చయము. డబ్ల్యు ఏ. సి. (ఐ) లో యివ్వబడు శిక్షణ, ఈ దళములో పనిచేయుకాలమున కలుగు అనుభవములవలన, యుద్ధానంతర జీవితములో అనేకమంది స్త్రీలు మంచి అర్హతలు, అఫీసు నిర్వహణదక్షత కలిగియుందురు.

**దరఖాస్తుచేయుట ఎట్లు:** ఈ ఉద్యోగములో చేరు షరతులు మొదలగునవి నిర్మొగమాటముగా డబ్ల్యు.ఏ.సి.(ఐ) లోని ఏ. టి. ఆర్. ఓ. ల నుంచి పొందవచ్చును. వారుకూడా ఈ దళములోనివారే. మీరు కోరిన, డబ్ల్యు. ఏ. సి. (ఐ) గురించిన ఏ సమాచారమునయిననూ వారు సంతోషముగా తెల్పుదురు.




ఏ. టి. ఆర్. ఓ. డబ్ల్యు ఏ. సి. (ఐ) అడ్రసులు.

**బొంబాయి:** ఏ ఎఫ్.ఐ. బిల్డింగు, హాస్పిటల్ లేన్, దోభీతలావ్. **కలకత్తా:** c/o డి.టి ఆర్.ఓ. 28, థియేటర్‌రోడ్. **లక్నో:** c/o టి ఆర్ ఓ. ఈస్టర్న్, హజరత్‌గంజ్. **పాట్నా:** c/o డి.టి.ఆర్.ఓ.ఎగ్జిబిషన్‌రోడ్డు **రావల్పిండి:** గ్విన్ థామస్ రోడ్డు. **బెంగుళూరు** (కాంటోన్‌మెంటు): కబ్బన్‌రోడ్డు **లాహోరు:** 22, డేవిస్ రోడ్డు. **పూనా:** స్టాన్‌టన్‌రోడ్డు. **మెద్రాస్:** 3/18, మౌంటురోడ్డు. లేదా, మీకు దగ్గరలోవున్న డబ్ల్యు ఏ సి (ఐ) ప్లాటూన్ కమాండరుకు దరఖాస్తు పెట్టుడు.

# స్త్రీల సహాయక దళము (ఇండియా) లో చేరుడు

AAA-1593-A-TG



# విషయానుక్రమణిక

**1945, ఏప్రె**



త్రివర్ణచిత్రము: మధులీల.



మధులీల

— చిత్రకారుడు : శ్రీ ఎ. పైడిరాజు —





సంపుటము 22 | ఏప్రెల్, 1945 | సంచిక 4

పార్థివ - చైత్రము


# చంపకమాల

శ్రీ హనుమచ్ఛాస్త్రి =

నగవుల పూలగుత్తి వయినాడవురా సఖ! ఎంత దాచినన్
మొగలుల పండుపొత్తుల గుబుల్కొను కమ్మని తావివోలె నీ
మొగమున తీయనైన యనుభూతులు సిగ్గుల దేలి వెల్గు; నే
సొగసుల రాణి యౌవనరుచుల్ చవిగొంటివిరా సుహృత్తమా?

ఇక తెరచాటు లేటికి? సుహృద్వర! నల్లని కన్నుఱేకు పొం
దికల జపాసుమప్రభల దిద్దిన వే శుభయామినుల్? రసో
త్సుకత చెలంగు నీయమృతచుంబనముద్రలు మేలుకొన్న వే
సకి జడలోని మల్లెల పసందులు నీమెడలోని వాసనల్ ?

# భారతి - పార్థివ చైత్రము

పొలపొల గాలి కౌగిళుల పొంపిరివోయెడు సన్నజాజితీ
గల నునుమొగ్గలట్లు పులకల్ నెలకొన్నవి మేని నిండ; నీ
తలపుల తీయనైన కవితల్ ఫలియింపగ నెట్టకేల కే
కలల వెలుంగు        సి ముఖాముఖి ముద్దుల నిన్ వరించెరా!

అరవిడు నల్లకల్వజత యందము చిందెడు కన్నుదోయి ని
ద్దురల తెరల్ తెమల్చుకొని దూరపు మేరల స్వర్గఖండముల్
దరిసిన రాత్రి కమ్మని తలంపుల దోగెడునేమొ యింకనుం
బరపదు చూడ్కి యొక్కటియు మానవమాత్రులమైన మాపయిన్.

ఇవురుకటారిజోదు సవరించెను తీయని విల్లు; తోటలన్
నవమధులక్ష్మి మంజుపద నర్తన నిస్వనముల్ చెలంగె, నీ
పువుఁబెడదన్ విదల్చుకొని పొంగిన భావమధుస్రవంతికా
కవితలు పల్కరా! యరుత కాన్కగ చంపకమాల వైచెదన్.

5 మార్చి '45.

# ప్రభావతీ ప్రద్యుమ్నము

## కొన్ని విశేషాలు



= శ్రీ మొదలి వెంకటరామయ్య

ప్రభావతీప్రద్యుమ్నాన్ని సావధానంగా పఠించినట్లయితే కొన్ని విశేషాంశాలు గోచరిస్తాయి. ప్రబంధవస్తువు వేరైనప్పటికిన్ని తెలుగులోని ప్రబంధాలు చాలావరకు ఒకేమార్గాన్ని అనుసరించాయి. ప్రబంధకథాప్రారంభమైన పద్యంతోనే పురవర్ణనను మొదలుపెట్టి తరువాత క్రమంగా చతుర్వర్ణములను వర్ణించడం, పుష్పలావికాదివర్ణనము—ఇవి ప్రబంధ సంప్రదాయాన్ని సూచిస్తాయి.

ఎందువల్లనో యీపద్ధతి నచ్చక పింగళిసూరన్న తన కావ్యంలో కొంత నవ్యతను కనబరచడానికి పూనుకొన్నట్లు గోచరిస్తుంది. ప్రబంధాలన్నీ ఒకే పంథా ననుసరిస్తే పాఠకులకు వానియందు అభిరుచి కలగ దనే భావమే అతన్ని యిలాంటి నూత్న సృష్టికి పురికొల్పి ఉంటుంది. పూర్వసంప్రదాయాన్ని పూర్తిగా విసర్జించకుండా దాన్ని హృదయంగమమైన రీతిని తన ప్రభావతీప్రద్యుమ్నంలో నిర్వహించాడు.

"శ్రియఃపతి శ్శ్రీమతి శాసితుం జగ
జ్జగన్నివాసో వసుదేవసద్మని
వసన్ దదర్శావతరంత మంబరా
ద్ధిరణ్యగర్భాంగభవం మునిం హరిః"

అని మాఘకవి తన కావ్యాన్ని ప్రారంభించినట్టు-

"శ్రీరమణీరమణీయమ
హోరస్థలుఁ డచ్యుతుఁడు సముజ్జ్వలమహిమన్
ద్వారక నుండఁగ నొకనాఁ
డారూఢాదరత నింద్రుఁ డవ్విభుకడకున్."

"లోకహితకార్యపర్యాలోచనంబునకై చను దెంచువాఁడు నాకంబు వెడలి యాకసంబున నడ తెంచుచున్న సమయంబున".

అని ప్రారంభించి పాఠకునిగూడా యింద్రునితో వియత్పథవిహారానికి తీసికొనిపోయి, అచ్చటనుండి—తాను స్వయంగా గాకుండా—యింద్రమాతలుల ముఖంగా ద్వారకానగరసౌందర్యాన్ని చవిచూపించాడు. ఉన్నతస్థలంనుంచి ప్రకృతి నంతా ఒక్కమారుగా చూడవచ్చు. భూమిమీద నిలిచి చూడడంలోనూ, వియత్పథంనించి చూడడంలోనూ భేదంవుంది. భూమిమీద నున్న మనుష్యుని దృష్టి దూరంగా ప్రసరించదు- మధ్య యెన్నో ఆటంకా లుంటాయి. ఉన్నతప్రదేశంనుంచీ క్రిందికి చూచే మనుష్యునికి ఒక విశాలమైన ప్రకృతిచిత్రాలన్నీ ఒకేమారు గోచరిస్తాయి—మనోహరములుగానూ వుంటాయి. అదీగాక పాఠకుడు తానుగూడా వియత్పథవిహారాన్ని ఊహించుకొని క్రింద వుండే సృష్టిచిత్రాలను గురించి కావ్యంలోని ఒకానొక పాత్ర తనకే వివరించి చెపుతూ ఉన్నట్టు భావించి ఆనందాన్ని అనుభవిస్తాడు. అప్పుడు కావ్యంలోని వర్ణనము విసుగును కలిగించదు. ఈ విషయాన్ని సూరన్న గ్రహించి, తన కావ్యాదిలో మాతలిద్వితీయుడై నాకలోకంనుండి శ్రీకృష్ణదర్శనార్థమై క్రిందికి దిగివస్తూన్న ఇంద్రుని

ప్రవేశపెట్టి, వారు "తత్తద్వస్తుసందర్శనసమయ సముచితవచోరచనల వినోదించుచుఁ గొంతదవ్వన సుర్వికి డిగ్గ"లోపల తన పురవర్ణనాన్ని ముగించి, కథాసందర్భాన్ని అందుకున్నాడు. ప్రబంధప్రారంభంలోనే ఒక నూత్నమార్గాన్ని త్రొక్కాడు.

బ్రాహ్మణవర్ణనమందు గూడా నవ్యత కొన్పిస్తుంది. కేవలం కవే వర్ణించాడనే భావం పాఠకునికి కలగకుండా సమర్థించుకుంటూ, ఆ వర్ణనమును ప్రయుక్తంగా చేసుకోవడంలోనే యీ కవిప్రతిభ యిమిడిఉంది.

వసుదేవుని యాగసమాప్తిసమయంలో భద్రుడను నటుణ్ణి సభలో ప్రవేశపెట్టాడు. అతడు తన అద్భుతవర్తన ప్రవర్తనములవల్ల పరితుష్టులను జేయగా వారందరూ అతనికి పారితోషికము లిచ్చారు. భద్రుడు వాళ్లనందరినీ పొగిడాడు. సభలోని ధూర్తవటువులు కొందరు—"భద్ర! కడు సొంపులుగా బొగడించుకొంజుమీ తలపగ నిప్పు డింత తెగుదారుల మైతిమి." అంటూ "తమ దండపుఁగోలల నున్న మాఱుగోచుల"ను భద్రుని కిచ్చి తమ్మగూడా పొగడమన్నారు. యీ సమయాన్ని పురస్కరించుకొని, కవి, ఔచితికి భంగం లేకుండా—యిది అనవసరవర్ణన మని పాఠకునికి అనిపించనట్లు—భద్రునిచేత బ్రాహ్మణవర్ణనము చేయించాడు. ఘట్టము హాస్యరసపూరిత మైనది. పాఠకునికి ఉత్సాహాన్ని కలిగించేది. అలాంటి ఘట్టంలో వర్ణనము నిముడ్చడం కవిసమయోచితజ్ఞతకు నిదర్శనం.

"వేదసౌరభముల వెదచల్లఁగల శుచి

పరిశుద్ధి పెంపొందు బ్రహ్మవర్చసపావ
కస్ఫూర్జితస్ఫులింగంబులార!
యరయనట్టికసికలంతలయ్యును బింక
మున బ్రహ్మశిఖ ముట్టు ప్రోడలార!
బంటమాటలకు ధౌర్త్యమునకు నానతి
పడిపట్టినట్టి సత్ప్రాజ్ఞులార!"

అని భద్రుడు వటువులను పొగిడాడు. ఆ పొగడ్తకు తృప్తిజెందని వటువులు అంతతో పోక, ఆ ప్రాంతంలో అఘ్జాడుతూంటే వారిని భద్రుడు "ముచ్చు"లన్నాడు ఆ వటువులు కోపించి—

"ఆటవాండ్రని నమ్మి యనుమతింపగ నెట్టి
పురమైన నశ్రమంబునను జొచ్చి
పగలెల్ల నాటల భ్రమయించుచును సందు
గొందులెల్ల నెఱింగికొనుచు రేలు
కన్నగాం డ్రగుచు నగళ్లు ప్రవేశించి
యందు నెంతటివార లడ్డమైన
జక్కడచుచు బేనుగ్రుక్కినపాటిగా
నిష్టమైన యర్థమెల్ల బడసి
బ్రదుకుచునికి మీ స్వభావము"
అని భద్రుని ఆక్షేపించారు.

"ఇంద్రకార్యముదెస నవ్వారిల్లు చిత్తంబుతో నసికి నవ్రజపురంబు జొచ్చుట కుపాయాన్వేషియై యున్కిజేసి నిజాపేక్షకు నుత్తరంబుగ" వటువుల వాక్యాలను జనార్దనుడు గ్రహించి" తదనుసారంబున వజ్రపురప్రవేశమును, వజ్రనాభవినాశంబును నతిసుకరంబులుగా మనంబున నిశ్చయించుకొని తత్ప్రియోజనంబునకు నరుగ నర్హుం డెవ్వడొకో అని విచారించుటకు అవకాశం కలిగింది. కడకు వటువాక్యానుసారమే ప్రద్యుమ్నగదసాంబులు వజ్రనాభపురిని ప్రవేశించి వాని వినాశానికి కారణు లయ్యారు.

భద్రుని బ్రాహ్మణవర్ణనంమూలంగా వటువులు అప్రయత్నంగానూ, అన్యాపదేశంగానూ వజ్రనాభవధకు బీజాన్ని నాటారు. యీ ఘట్టం కావ్యానికి ప్రాణప్రదం. అలాంటిదాన్ని అతికౌశలంతో నిర్వహించాడు సూరన్న. అటు ప్రబంధసంప్రదాయాన్ని కాపాడుకుంటూ, ఇటు వర్ణనమును కావ్యబీజోత్పాదకంగా చేయగలిగాడు.

ఇలాంటి ఘట్టాలు మరికొన్ని కనిపిస్తాయి. బ్రహ్మకూ, సరస్వతికీ ప్రణయకలహం కలిగినట్టు హంసి చెప్పిన సందర్భంలో; బ్రహ్మ మన్మథుణ్ణి నిందిస్తూ—

# ప్రభావతీప్రద్యుమ్నము - కొన్ని విశేషాలు

"ఏలరా! మన్మథుడ! నన్ను నింత యేచు
టేమి మేలు ?రానున్నవి యిట్టి పాట్లు
నీకు నిక బ్రభావతి యను నెలతపై వి
రాళికారణముగ ; వేగిరంబు వలదు."

అనిన మాటలను హంసి తాను విన్నట్లు ప్రభావతితో చెప్పి ఆమెకు ప్రద్యుమ్నునియందు అనురాగాన్ని వృద్ధిచేసింది. యీ మన్మథోపాలంభనమువల్ల ప్రభావతీప్రద్యుమ్నుల సంయోగం నిశ్చయమని ఉత్తరార్థాన్ని గూడా సూచిస్తూంది. తద్ద్వారా యిది కథకు పుష్టిని కలిగించింది.

"కన్నవల కల్కితనంబున బుష్పలావికల్ తలపులు గొల్లలాడి మిగులం భ్రమయించి యువవ్రజంబుచే వెల లధికంబుగా గొనుచు వేడుక నమ్మిరి పువ్వులంగడిన్" అనే పుష్పలావికాప్రసంగంతోపాటు— "ప్రభావతికి నొక్క యతివ విరులుగొనుచు బోవగ నందు నింపున జరించు తేటిగమిలోన" ప్రద్యుమ్నుని గూడా ఒక తేటిగా మార్చి ప్రభావతి అంతఃపురానికి చేర్చాడు కవి. ప్రబంధాదిలో సంప్రదాయరక్షణకై—కథాసందర్భానికి ఉపకరించని—పుష్పలావికావర్ణన మునకూ, కథాసందర్భంలో నాయకుణ్ణి తేనెటీగగా పుష్పాన్నాశ్రయింపజేసి నాయికవద్దకు జేర్చునపుడు చేయబడ్డ పుష్పలావికావర్ణనమునకూ భేదం లేదూ! ఇట్టి వర్ణనము కవియొక్క సమయోచితబుద్ధిని ప్రదర్శిస్తుంది.

ఈ విధంగా తాను ఉద్దేశించిన వర్ణనమును పాఠకునికి హృదయంగమంగా వుండేలాగా తత్తదుచిత సన్నివేశాల్లో ఇమిడ్చి, ఆ వర్ణనములను కావ్యవస్తు పోషకములుగా చేసుకొన్నాడు సూరన.

ప్రబంధకర్త లందరూ స్త్రీపురుషవర్ణనల్లో ఉపయోగించే ఉపమానవస్తువుల ప్రసక్తి యీ కవికి రుచించినట్టు అగపడదు.

"నెత్తమ్మి లనుచు గ్రొన్నెల లంచు వటఫల
శ్రీ లంచు తాబేటిచిప్ప లనుచు
నమ్ముల పొదు లంచు నరటికంబము లంచు
బులిన మంచును సుడిచెలువ మనుచు
హరిమధ్యమం బంచు హైమకుంభము లంచు
నవమృణాళము లంచు జివురు లంచు
మదను శంఖ మటంచు మణిదర్పణము లంచు
బగడ మంచును దిలప్రసవ మనుచు
శఫరు లనుచు సింగిణు లంచు జంద్రఖండ
మనుచు శ్రీకారము లటంచు నళు లటంచు
నిట్టివి గదయ్య చెప్పబోయిన నుపమలు
వీని దడవ సిగ్గొదవు"

అనే పద్యమే పైవిషయాన్ని స్పష్టపరుస్తుంది. సౌందర్యం సహజమయినది. ఒకానొక యువతిని వర్ణించడంలో ఆమెఅవయవాలను వేరువేరుగా తీసికొని కొన్ని వస్తువులతో పోల్చడ మనేది అస్వాభావికతను తెలుపుతుంది. సహజసౌందర్యాన్ని యథాతథంగా వర్ణిస్తేనే దానిలో స్వాభావికత గోచరిస్తుంది. స్త్రీ అవయవాలకు ఉపమానత్వాన్ని పొందే వస్తువుల నన్నిటిని ఒకటిగా చేరిస్తే ఒకానొక వికృతరూపం తయారవుతుంది. అందువల్ల సూరన్న అట్టి వర్ణనములోని కృతకతను గమనించి—

"అటుగా కద్భుతరామణీయకగుణా
ఢ్యంబైన సద్వస్తువున్
బటువాచారసికు ల్బ్రసంగమయినన్
బారంబు ముట్టన్ రసో
త్కటతం జెప్పక మానజాలరను
పక్షం బొందు భావించినన్
ఘటియిల్లున్ వనితాంగవర్ణనకు ని
ర్కంబు నన్యథాసిద్ధియున్."

అని యాథార్థ్యాన్ని వెల్లడించాడు. తత్త్వతః ఆలోచించినట్లయితే స్త్రీ అంగాలను వేరువేరుగా వర్ణించడమనేది స్వభావానికి దూరం. మానుషశరీరం అఖండమైనది. అంగాలన్నీ ఒకటిగా చేరినప్పుడే శరీరానికి సౌందర్యం సిద్ధిస్తుంది. ప్రత్యేకాంగవర్ణనం అఖండ శరీరసౌందర్యమునకు పుష్టిని కలిగించదు. ఈ రహస్యాన్ని గ్రహించాడు కవి.

శరీరవర్ణనములో ఉపమానాలను జొప్పించడం యీయనకు యిష్టం ఉన్నట్లు కనిపించదు. అందువల్లనే—

"సుకవులు క్రిందుమీదరసి
చూడక యీడని యాడుకొన్న హా
టకకదళీవిలాస మక
టా విపరీతముగాక సాటియే
యకలుషరామణీయకస
మంచితకోమలతద్వధూరుల
క్కి సరిగా వదెంత తల
క్రిందయినన్ గరిరాజహస్తముల్."

"..................చం
ద్రాదోప్యపమల్ సూచనా
భంగుల్ గాని, యధస్సహస్రగుణ సౌ
భాగ్యంబు లాయంగముల్."

"......................
..........చంచరీకచం
ద్రాద్యుపమానశోభను స
హస్రగుణంబుగ హెచ్చ గేళవ
క్త్రాద్యఖిలాంగలక్ష్మి."

అని అనేకమార్లు ఉపమానవాచకములను నిరసించాడు. యీ సందర్భంలో భర్తృహరియొక్క—

"నోసత్యేన మృగాంక ఏష వదనీ
భూతో నచేందీవర
ద్వంద్వం లోచనతాం గతం నకనకై
రప్యంగయష్టిః కృతా
కింత్వేవం కవిభిః ప్రతారితమనా
స్తత్త్వం విజానన్నపి
త్వఙ్మాంసాస్థిమయం వపుర్మృగదృశాం
మందో జన స్సేవతే."

అనే శ్లోకం జ్ఞాపకంవస్తుంది.

ఉపమానవస్తువులయందు తనకు గల గాఢనిరాదరాన్ని—

"అమరారికరుల కుంభముల వ్రయ్యగమొత్త
రమణిచన్నులు నఖాగ్రముల నొత్త
సమదరాక్షసరథచక్రంబు లిల గూల్ప
గాంతశ్రోణికి నూడిగంబుసల్ప
నసురేంద్రజయశంఖు మవనిపై వ్రేయింప
గామినికంఠంబు గౌగలింప
వజ్రనాభుని ధనుర్వార్తలు గడతేర్ప
బడతికన్బొమసంజ్ఞ బనులొనర్ప
దైత్యు మెఱుగుదూపులు దళితములుసేయ
దత్తనూజచూపులు ఫలితములుసేయ"

అనే పద్యంలో చూపించాడు. ఈ పద్యంలో వీరశృంగారములతో గూడిన ప్రకృతార్థమేకాకుండా—"కరుల కుంభములు వ్రయ్యగ మొత్తుట", "రథచక్రంబుల గూల్చుట", "శంఖు మవనిపై వ్రేయించుట", "ధనుర్వార్తలు గడతేర్చుట", "మెఱుఁగుదూపులు దళితములుసేయుట" అనేవానివల్ల కలిగే ధ్వనిద్వారా ఆయా ఉపమానవస్తువులయందు కవికి గల గాఢ నిరాదరము అనే అప్రకృతార్థంగూడా స్ఫుటంగా కనిపిస్తుంది. ఆయా వస్తువులను కవి తిరస్కరించాడు గూడాను.

సహజసౌందర్యాన్ని సహజధోరణిలోనే—ఉపమానవస్తునిరపేక్షకంగా—వర్ణించి, తద్వర్ణనమునందు స్వాభావికతను గోచరింపజేయడమే కవి ఆశయం. సౌందర్యవర్ణనానికీ చంద్రమన్మథ మలయమారుతోపాలంభనములకూ ప్రత్యేకంగా ఒకటిరెండు ఆశ్వాసాలు కేటాయించడం యీ కవిమతం గాదు. అలాంటి దీర్ఘవర్ణనములకు తావివ్వడంవల్లనే ప్రబంధాలు పాఠకుని ఆకర్షింపలేకున్నాయి.

ఉపమానవస్తువుల అస్వాభావికతను యీక్రింది పద్యంవల్ల గ్రహింపవచ్చు:

"తరుణి కెంగే లంచు దమిబట్టి కటకటా
చిగురాకె యిది యంచు జిన్నవోయి
వెలదిపాలిండ్లంచు వెస నంటి చెల్లబో
పూగుత్తులే యంచు బొలుపుదఱిగి

చెలువపయ్యెద యంచు జేసాచి యయ్యో ప
రాగోదయమె యంచు రహి దొలంగి
రమణి వేనలి యంచు రతికాంక్ష యొడిసి హా
తేటిమొత్తమె యంచు దెల్లబాటి."

ఇందులో ఆయా ఉపమేయముల సామ్యము కోసం తత్తదుపమానములను గ్రహించడంవల్ల "చిన్నబోవుట, పాలుపుదలుగుట, రహిదొలగుట, తెల్లబాఱుట" అనేవి సంభవిస్తాయని వ్యంగ్యంగా కవి తెలుపుతూ అట్లు గ్రహించేవారిని ఆక్షేపించడానికే పద్యాన్ని ఉద్దేశించినట్లు కనబడుతుంది.

కొన్ని ప్రదేశాల్లో యీ కవి దిక్కాగ్రతంగా వర్ణనములను ప్రవేశపెట్టాడు.

"ఆరయ నింక నేమడిగె
దల్లవె యాతడు శంబరుం డిలో
కారిని ద్రుంచునప్పు డ ప్ర
హారకిణంబు లురంబునందు నా.
హా! రతికంకణాంకములు
నల్లవిగో మెడయందు; వీరశృం
గారకళాఢ్యు నిట్లతని
గట్టిగ నెవ్వ రెఱింగి వ్రాసిరో!"

"శౌర్యయుతుం డతండు భుజ
సత్త్వనిధానము కాంతిరాశి గాం
భీర్యపుబ్రోక సత్కళల
పెన్నని రూపము దాల్చినట్టి యౌ
దార్యము పెక్కు లేటికి సు
దాత్తగుణోదయ మాయపూర్వసౌం
దర్యత కెంత యెంత యుచి
తంబగు నంతయు గల్గి శోభిలున్."

అనేవి ఉదాహరణాలు. అసమాన సౌందర్యానికి యేయేలక్షణా లుండాలో ఆయాలక్షణాలు గల ఒకవ్యక్తిని పాఠకుని మనోవీథిలో నిలిపాడు. కృత్రిమ వస్తువులతో పోల్చి శరీరశోభకు కళంకం ఆపాదించడానికి బదులు ఒకానొక సౌందర్యరాశిని ఊహింప జేయడం ఉచితంగా లేదూ? మరికొన్ని—

"తిర్యగ్వనితను నన్ను స
మర్యాదానందమగ్నమతి జేసె మహా
శ్చర్యముగ దద్వధూసౌం
దర్యం బపు డేమి చెప్ప నళినాక్షసుతా!"

"శృంగగ్రాహిక జెప్ప వేఱె తెరవుల్
సిద్ధింపమిం జేసి చి
త్రాంగశ్రీనిధి నవ్వధూమణిని స్థూ
లారుంధతీన్యాయమా
ర్గాంగీకారమునన్ వచించితిని."

"తెలవా! సందిట సందెడు
నెతివెంట్రుక లాయతములు నీలము లివియే
తెలుగున ముడిచిన నీకున్
గొలుతగలదె? యివియ జట్టిగొను నీవిభునిన్."

అనే వర్ణనములు ఎంత స్వాభావికంగా ఉన్నాయి! సుందరప్రేయసీప్రియులను ఊహాపథంలో నిలపడమే యీ కవి చేసిన పని. పాఠకుడు వారి సౌందర్యాన్ని మనసా భావించి ఆనందిస్తాడు—అప్పుడు వర్ణనము సార్థకమౌతుంది.

ప్రబంధవర్ణనములందు నిరసనభావాన్ని తెలపడానికి సూరన్న తన "శుచిముఖి"కి "ఉపమాతిశయోక్తికామధేనువు" అనే బిరుదమును ప్రసాదింప జేసి ఉంటాడు అనే భావం పాఠకులకు కలగకపోదు. అటు ప్రబంధసంప్రదాయాన్ని విసర్జించకుండా చేయ దలచిన వర్ణనములను హృదయంగమంగా చేస్తూ, వానిని కావ్యవస్తువుకు అంగములుగా నిర్వహించడమే యీ కవిలోని విశేషం.

మరియొక విషయం: విప్రలంభశృంగారవర్ణనమునకు ఒక లలితమైన పద్ధతి ననుసరించా డీయన. అదే "గోత్రస్ఖాలిత్యం" అనేది. ప్రణయకలహంవల్ల నాయికానాయకులకు తాత్కాలికవియోగాన్ని కల్పించడానికి ఒక సుకుమారప్రయోగ మిది. "వనితలకు సవతినామము మారణమంత్రము" అనే సూత్రమే దీనికి మూలం. యీ విషయం సర్వవిదితం—అనుభవజ్ఞులు కూడా అనేకమంది ఉంటారు. స్వాభావికమైన యీ

"గోత్రస్ఖాలిత్యా"న్ని పురస్కరించుకొని, నాయికా నాయకులకు తాత్కాలికవిరహాన్ని కల్పించి, విప్ర లంభవర్ణనకు తరుణాన్ని సంపాదించాడు.

"ప్రద్యుమ్నుండు ప్రభావతీ రతివిహా
రప్రౌఢిసారస్య సం
పద్యుక్తిన్ గడు జొక్కి దక్కి రతీ
మత్ప్రాణమా నీవు."

అని అనగానే "గోత్రస్ఖాలిత్యము" ఓర్వలేని ప్రభావతి "శయ్యాంతరము"ను ఆశ్రయించింది. కవికి విప్రలంభవర్ణనమునకు అవకాశం దొరికింది. శృంగార మునకు పరిపుష్టి కలగగానే—

"రమణీ! యింతాకను దెలి
యము నీయల్కకు నిమిత్త మదియే భవదు
త్తమరతి నే గరగుచు మె
చ్చుమరగ నట్లంటి దాని; నది తప్పగునే?"

అను నాయకునిచే ఊరడింపజేసి ఇరువురినీ ఏక ముఖం చేశాడు. ఇంతకూ "రతి" శబ్దమే విరహానికీ, పునస్సంయోగానికీ కారణ మయింది. ఇలాంటి సుకు మారప్రయోగాన్ని ఊహించి తన కావ్యంలో కనబ రచిన సూరన అభినంద్యుడు. కళాపూర్ణోదయంలోని—

"కళలంటి కలచి తన చె
య్యుల జొక్కుడు తపసిమది చివుక్కురు మనగా
నలకూబర! విడువిడురా
అలసితి నని పల్కె మన్మథాతివివశతన్"

అనేది పురుషపర్యాయంగా ఉన్నా "గోత్ర స్ఖాలిత్యం" అనే శీర్షిక క్రిందికే వస్తుంది.

పై విషయాలను బట్టి చూస్తే ప్రబంధనిర్మా ణంలో సూరన కొన్ని నూత్నమార్గముల నాదేశించా డనడానికి సందేహం లేదు. స్వభావానికి సాధ్య మైనంత సమీపంలో తన కావ్యాన్ని నడిపించడం యితనికి యిష్టం. అమానుషవర్ణనములు, సన్నివేశ ములు—వీని మూలంగా పాఠకునికి విశ్వాసాన్ని గలిగించడం దుర్లభ మని గ్రహించాడు. కావుననే సూరనకావ్యాలు పాఠకుల నాకర్షింపగలిగాయి.



# అష్టదిగ్గజములు



= శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి =

'అష్టదిగ్గజములు' అనునది కృష్ణదేవరాయల యాస్థానమునం దుండిన యెనమండ్రు కవుల యెడల రూఢమైన పదము. దిగ్గజములవంటి కవు లనియు, ఆ కవు లష్టసంఖ్యాకు లగుట అష్టదిగ్గజము లనియు దీని కర్థము చేసికొనఁగూడును. మునిత్రయము, కవిత్రయము అని ప్రాచీనకాలమునను, చిలుకూరిచతుష్టయము, అప్పల్లపంచకము, బొమ్మకంటిషట్కము నని నేఁటికాలమునను వాడుక కలదు. అష్టదిగ్గజము లన్న మాటమాత్ర మట్టిది కాదు. మునిత్రయకవిత్రయము లనుటకుమాఱు త్రిగుణములని, త్రిమూర్తులని, చిలుకూరి చతుష్టయమునకు బదులు చతుస్సాగరము లని, అప్పల్ల పంచకమునకుఁ బ్రాణపంచకమని, బొమ్మకంటిషట్కమునకు షడ్రసము లని వ్యవహరించుట యెట్టిదో యెనమండ్రు కవులనుగుఱించి అష్టదిగ్గజము లనుటయు నట్టిదే. ప్రకృతార్థ మిందు పరిగృహీతము కాదు. "మాణవకుఁడు సింహము" అనుటకు మాఱు 'సింహము' అని విడిచిపెట్టుటవంటిదే యిది.

ఈ తీరున వాడుట కిదియే క్రొత్తగాదు. విక్రమార్కుని సంస్థానమున "నవరత్నములు" ఉండువారఁట. వారు నిజమునకు రత్నములు కారు. రత్నముల వంటి కవులు; లేక పండితులు.

"ధన్వంతరిః క్షపణకో౽మరసింహశంకూ
వేతాలభట్ట ఘటఖర్పర కాళిదాసాః
ఖ్యాతో వరాహమిహిరో నృపతేః సభాయాం
రత్నాని వై వరరుచి ర్నవ విక్రమస్య."

ఈ శ్లోకము దీని కుపష్టంభకము. నవరత్నముల నొక్క విక్రమార్కుఁడు భరించెను. అష్టదిగ్గజముల నొక్క కృష్ణరాయలు పోషించెను. అందులకే యా మహారాజుల చరిత్రములు సంస్కృతాంధ్రసారస్వత చరిత్రమున స్వర్ణాక్షరముల లిఖింపఁబడియున్నవి.

ఆధునికసాహిత్యమున అష్టదిగ్గజముల నన్వేషించితిని. చూడఁ జూడ 'అష్ట'యే కాదు, ద్వ్యష్ట త్ర్యష్ట సంఖ్యలలోనికిఁ జేరువా రగపడుచున్నారు. కారణము ? నేఁడు రాయలు ఒక్కఁడా ? నలుగు రయిదుగురు వెలసిరి. కాశీనాథుని నాగేశ్వరరాయలు, విక్రమదేవవర్మరాయలు, రావు వేంకట మహీపతి సూర్యారాయలు-ఇట్లే మఱొక రాయలు, మఱొక రాయలు-రాయల సంఖ్య పెరిగి యష్టదిగ్గజముల సంఖ్య నధికము చేసినది.

ఇప్పటి నా తీరికనుబట్టి నేఁటికాలమునాఁటి యొక 'యష్టదిగ్గజములను'గూర్చి యుగ్గడింతును. మహాకవుల నుగ్గడించుకొనుట మనకు, మన భాషకు లగ్గగదా ! దిగ్గజముల పని భూభరణము. కవిదిగ్గజముల కార్యము భాషాభరణము. మన మిపుడు ముచ్చటించుకొనువారిలో కవు లున్నారు. వ్యాఖ్యాత లున్నారు. విమర్శకు లున్నారు. చరిత్రకారు లున్నారు.

౧. కందుకూరి వీరేశలింగము ... ౧౮౪౮
౨. వేదము వేంకటరాయశాస్త్రి ... ౧౮౫౩
౩. జయంతి రామయ్యపంతులు ... ౧౮౬౦
౪. గిడుగు వేంకటరామమూర్తి ... ౧౮౬౩
౫. పానుగంటి లక్ష్మీనరసింహరావు ౧౮౬౫
౬. చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి ... ౧౮౭౦
౭. చిలుకూరి వీరభద్రరావు ... ౧౮౭౨
౮. కొమర్రాజు వేంకటలక్ష్మణరావు ౧౮౭౭

ఈ యెనమండ్రును నాధునికాంధ్రసారస్వత మహాభువనమున కెనిమిది దిగ్గజములు. సందేహము లేదు. చరిత్రమునకు నే నని యొకఁడును, వ్యాఖ్యానములకు నే నని మఱియొకఁడును, గ్రాంథికము నావలన నిలిచె నని వేఱొకఁడును, వ్యావహారికమున కే నాధారమని మఱియొకఁడును, గద్యరచనమునకుఁ దండ్రిని నే నని యింకొకఁడును, పద్యమునకు బ్రహ్మను నేనే యని మఱియొకఁడును, ఆంధ్రుల చరిత్రమున కాకారము గల్పించితి నని యింకనొకఁడును, ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము నా యరచేత నున్న దని వేఱొకఁడును గర్వస్ఫూర్తితో సవాలుచేసి చెప్పికొనఁగల దిగ్గజము లీయెనమండుగురు పండితులును. అసంశయముగ నంధ్ర సాహితీవిశ్వంభరకు వీ రష్టదిగ్గజములే. అందు కందుకూరికవి తొలిదిగ్గజము. ఆది నతని నభివర్ణించు కొందము.

## శ్రీ వీరేశలింగము

వీరేశలింగము యుగస్థాపకుఁడు. ఇదివఱకుఁ దెలుఁగులో లేని నవల యతఁడు రచించిచూపినాఁడు. దానినిబట్టి చిలకమర్తి మున్నగువా రెందఱో యతని దాఁటి యద్భుతమైన నవలలు సృష్టించినారు. వీరేశలింగము ఆదినాటకకర్త. అంతకుముందు తెలుఁగున నాటకములు లేనప్పుడు అతఁడు వ్రాసి చూపినాఁడు. అక్కడినుండి యనేకులు శాకుంతలాదు లనువదించుటయ కాక, స్వతంత్రనాటకములు వాటముగ వ్రాసి రూపకలోకమును దేదీప్యమాన మొనరించిరి. వీరేశలింగము మొదటి చరిత్రకారుఁడు. తనకుఁ బూర్వము సరియైన కవిచరిత్రములు లే వని ఆంధ్రకవుల చరిత మతఁడు సంధానించి చూపెను. అవి మొదలు మూలమూలలఁ గల విస్మృతకవిచరిత్రములు విరివిగా వెలసి చరిత్రములు పెరిగినవి. చిలుకూరి వీరభద్రరావుగారి 'ఆంధ్రుల చరిత్ర' యంత యందముగ సిద్ధమగుటకు, కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారి యాంధ్రవిజ్ఞానసేవకు, చివరకు గిడుగువారి వ్యవహారవాదమునకు మూత్రపాతము వీరేశలింగముగారిదే యందును. కందుకూరి కవివలె నాంధ్రి కాధారమైనవాఁడు మఱియొకఁడు లేఁడు. అతని వాఙ్మయపరిశీలనములోఁ బొరపాటులు పాటిల్లె ననుమాట సత్యము. కాని యవి పరిగణనీయములు కావు. అతఁడు నూతనవాఙ్మయావతారమూర్తి. శ్రీకృష్ణునిలో గోపికాంగనావిషయకదోష ముండు ననుకొనుటవంటిది వీరేశలింగముచరిత్రరచనలోఁ బ్రమాదము లున్నవనుట. ఏదో యనుకొందుము గాని, వీరేశలింగము వెలయకున్న మన సారస్వతవృక్షమున కింతలో నింత వివిధశాఖావిస్తృతి తటస్థింప దనుట నిజము!

ప్రహసనములకుఁ బ్రారంభము చేసినాఁడు. శాస్త్రగ్రంథములు తెలుఁగునఁ దొలుత వెలువరించినాఁడు. తర్కశాస్త్రము వ్రాసినాఁడు. వాచకములు వ్రాసినాఁడు. భౌతికశాస్త్రము ప్రచురించినాఁడు. సంఘసంస్కృతి సరేసరి. వీరేశలింగము శ్రీకారము చుట్టని సారస్వతశాఖ లేదు. అన్నింట మిన్న యనిపించుకొన్నాఁడు. మార్గదర్శి యని కొనియాడఁబడినాఁడు. మదరాసునఁ గూరుచుండి పుస్తకశాల గాలించివైచి యహోరాత్రము లదేపనిచేసి యారోగ్యము చెడఁదీసికొని ఆంధ్రకవుల చరిత్రములు సేకరించి వెలువరించిన దీక్షాదక్షుఁడు వీరేశలింగకవి. దరిలేని సేవ చేసి భారతిని పరిపాలించిన యీ మహాశయుఁడు ఆంధ్రసారస్వతభువనమునకుఁ దొట్టతొలి గజము!

## శ్రీ వేంకటరాయశాస్త్రి

ఆముక్తమాల్యద, శృంగారనైషధము తెలుఁగులో హేమాహేమీగ్రంథములు. వీనికి వ్యాఖ్యలు వ్రాయవలయు నన్న మల్లినాథుఁడు కావలయును. లేనిచో, ఒక పండితసంఘము కావలయును. అయినను సాధ్యముకాని కార్య మది. మన వేదముపండితుఁడు ఉద్దండపండితుఁడు. భల్లూకపుఁబట్టు పట్టి యీ రెండు గ్రంథములకు సర్వంకషముగ వ్యాఖ్యలు వ్రాసివైచెను. అపరమల్లినాథుఁ డనిపించుకొనెను. అతని సమన్వయములలో, పాఠములలో, అర్థనిర్ణయ

ములలోఁ బ్రమాదము లున్నవని పండితులు కొందఱు విమర్శములు సాఁగించుచున్నారు. అది మన మను కొనరాదు. వేదముపండితుఁడు వీనికే కాదు, సారంగ ధరకు, విజయవిలాసమునకు, కావ్యాలంకారచూడా మణికి టీకలు వ్రాసి ప్రచురించెను. సంస్కృత కావ్యము లెన్నో టీకలతోఁ బ్రకటించెను. మేఘ దూతము, అమరుకకావ్యము, రఘువంశము, కుమార సంభవము ఇత్యాదులు. క్లిష్టగ్రంథవ్యాఖ్యామూలమున వేంకటరాయశాస్త్రి— రాంధ్రమునకుఁ జేసిన సేవ మఱవరానిది, దరిలేనిది. వేంకటరాయశాస్త్రిగారి యవతారము లేనిచో ఆముక్తమాల్యదానైషధాది వ్యాఖ్యలు ప్రచురితములు కాకపోవుగాని, యింతలోఁ [illegible]

మాల[illegible]

యంతయు వ్రాసెనఁట. ౨౮-౬-౧౯౨౦ నాఁడు ప్రారంభించి ౨౮-౧౦-౧౯౨౦ నాఁటికి పూర్తిచేసె నని చరిత్ర చెప్పుచున్నది. ఆయనపట్టుదల యట్టిది. ఈ వ్రా[illegible] లిట్లు వ్రాయుచు, నీ పెటుకుగ్రంథము లిట్లు బ్రద్దలు గొట్టుకొనుచు శాస్త్రిగారు రసప్లుతములైన ప్రతాప రుద్రీయము, బొబ్బిలి, ఉష నాటకములు సంతరించి మహాకవితాపదముకూడ నధిష్ఠింపఁగలిగిరి. నాటకము లాడించిరి. స్వయముగా నాడిరి. ఆంధ్రికి బహువిధ ములుగ నీయన పెట్టినది యక్షయభిక్ష.

"అంకెకుఁ దార్చె నేరసికు
నంగలభారతి ప్రౌఢనీతి, నా
కింకిరి నాంధ్రి ద్రావిడియుఁ
గేరుచు దైవియుఁ గూడి రెవ్వనిన్
జంకు కళంకు లేని కవి
చంద్రుఁడు తోషితకోవిదేంద్రుఁ డా

వెంగలిమాఁక కెఱుంగ శక్యమే !"

సర్వతంత్రస్వతంత్రుఁడు, మహోపాధ్యాయుఁడు, కళాప్రపూర్ణుఁడు వేంకటరాయశాస్త్రి నేఁటి సాహితీధరిత్రికి రెండవ గజము !

## శ్రీ రామయ్యా పంతులు

"ఆంధ్రసాహిత్య పరిషత్తు" అత్యధిక కీర్తి ార్జించికొనిన మహాసంస్థ. పక్షపాతములు విడిచి యాలోచించిన నీ పరిషత్తు [illegible] వాజ యన్యపరిషత్తు చేయలే దని ఘంటాపథముగఁ జెప్ప వచ్చును. అన్యవాదవాదులు దీనిని గ్రాంథికపరిషత్తని పరిహసించుట నేను వింటిని. వాదముల విషయ మటు లుంచుఁడు ! ఆంధ్రములో నుత్తమములగు గ్రంథముల నేఁబదివఱకు నీ పరిషత్తు ప్రకటించినది. ఈ పరిషత్పక్షమున వెలువడుచున్న పత్త్రిక సంపుటములు సారస్వతసర్వస్వ సంపుటములు ! శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు పరిషత్పక్షముననే బయటఁబడుచున్నది. దానిలో నవి చేరలేదు, ఇవి చేరలేదు అని దూయఁ బట్టుచున్నారు. ఆ యవస్థ యే మహాగ్రంథమునకుఁ దప్పనిదే. ఈ నిఘంటువును మించినది తెలుఁగున నిఁక ముందు వెలయనేర దనుట నాయభిప్రాయము.

ఈ సాహిత్యపరిషత్తునకు, ఈ బృహన్నిఘంటువునకు బీజములు వేసి మొలిపించిన సాహిత్యకృషికుఁడు జయంతి రామయ్యపంతులు. ఆయన నాటిన బీజము లన్నియు మొక్కపోనివి. ఆయన సిద్ధసంకల్పుఁడు. ఆయనజీవితమంతయు రాజకీయోద్యోగము లలోఁ దగుల్కొనినది ; ఆయనమనస్సంతయు సారస్వతోద్యోగములలోఁ జిక్కుకొనినది. ఆయన సంస్థాపించిన ప్రతిసంస్థకు దిట్టమైన పు నా దు లు వేసెను. ఎన్ని గాలివానలు పట్టినను ఆయనసంస్థ లూఁగవు. సాహిత్యపరిషత్తు, నిఘంటువు నిందులకు మంచి తారకాణలు. నేను కేవల గ్రాంథికైకపీరపక్షపాతినిగాను. నవ్యసాహిత్యపరిషత్తుపై నా కభిమాన మున్నది. గౌరవ మున్నది. కాని, యది ఆంధ్ర సాహిత్యపరిషత్తువలె నాంధ్రిని సేవించలేకపోవు చున్నది. గ్రాంథికవ్యావహారికవివాదము లీపాటికి ముగింపవలయును. ముదిరిపోయినది. ఉత్తమజాతి గ్రంథములను వివిధవిషయములను గుఱించినవానిని సృష్టింపఁజేయవలయును. పరిషత్తుల విధి యిది. వివాదములకు వేళగాదు. ప్రతిభానము గల కవులచే

నుత్తమకవిత వ్రాయించి ప్రకటించు బాధ్యత పరిషత్తు లది.

రామయ్యపంతులూ! నీవు ధన్యుఁడవు. నీవు సారస్వతమునకు గొప్పసేవ-చేవగలది చేసితివి. నీపరిషత్తు, నీనిఘంటువు నిన్ను శాశ్వతుని చేసినవి. చేయుచున్నవి. తెలుఁగుబాస పుడమికి నీవు మూఁడవ యేనుఁగవు!

## శ్రీ రామమూర్తి పంతులు

దైవసృష్టి బహువిచిత్రమైనది. ఒక మహాకార్యము నిర్వహించుట కొక మహావ్యక్తిని దైవము సృష్టిచేయుచుండును. మన సారస్వతము వివిధముఖముల విస్తరించుటకై వీరేశలింగ మను మహావ్యక్తిని సృజించిన దేవుఁడు, ఆంధ్రవిజ్ఞానసర్వస్వసముద్ధరణమునకు లక్ష్మణరావును పుట్టించిన దేవుఁడు, ఆంధ్రుల చరిత్ర యభివ్యక్తమగుటకు వీరభద్రరావును వెలయింపఁజేసిన భగవానుఁడు, తెలుఁగుకవిత నాలుగుదెసల నలముకొనుటకుఁ జెళ్లపిళ్లకవిని పొడమించిన భగవానుఁడు, ఆంధ్రభాష యఖిలజనసామాన్యమున కందుబాటులోనికిఁదెచ్చుటకు గిడుగుపండితుని సృజించెను. రామమూర్తిపంతుల జీవిత మద్భుతమైనది. అతని యవతార మంధ్రసారస్వతమునకు గొప్ప మార్పు తెచ్చినది. వీరగ్రాంథికవాదుల బుఱ్ఱల నొక్కమాఱు త్రిప్పివైచినది.

పంతులుగారివలె గట్టిపట్టుదల గల పండితులు తెలుఁగునఁ దక్కువ. ఆంధ్రప్రబంధములలో, చరిత్రపరిశీలనములో, వ్యవహారవాదనిర్మాణములో నీయన బ్రహ్మాండమంత పనిచేసెను. ప్రతివాదుల వాదముల నీయన చెవి కెక్కించుకొనక యొక్క రీతి కృషిచేసెను. శబరభాషకు లిపివ్యాకరణములు కల్పించెను. రామమూర్తిపంతులుగారిది వజ్ర సంకల్పము. ఈయన నూతనవాదమునకు లొంగని ప్రాచ్యపండితులు, ఆంగ్లపండితులు, పత్రికారచయితలు, గ్రంథకర్తలు చాలఁ దక్కువగ నున్నారు. నన్నయ నెఱుఁగని తెలుఁగువాఁ డుండునేమో కాని, గిడుగువారి నెఱుఁగని రచయిత యుండఁడు. ఎనుబదియేండ్ల ముదిమిలో నుండికూడ నిరువదియేండ్ల యువకునివలె రామమూర్తిపంతులు నడుము బిగించి భాషను సేవించెను. ఆయన లేనిచో వ్యావహారికవాదము లేదు. నవకవులకు ధైర్యములేదు. పత్త్రికలకుఁ బ్రచారము లేదు. పర్లాకిమిడి ఒరిస్సారాష్ట్రములో నన్యాయముగఁ గలిపివేయుటను సహింపలేక రాజాగ్రహము దిగదుడిచి రాజమహేంద్రవరము వచ్చి కూరుచుండిన యేకైకవీరుఁడు గిడుగు రామమూర్తిపంతులు! ఈయన సేవ యాంధ్రికి నక్షయమై, యనుస్యూతమై యుండును. అధునాతనభాషావసుంధరకు గిడుగుపండితుఁడు నాలుగవ దిక్కరి.

## శ్రీ పానుగంటి

కందుకూరికవి వచనము వ్రాసెను. చిలకమర్తి నవలలు రచించెను. ఇంకను బెక్కురు గద్యము సంతరించిరి. మఱి, పానుగంటికవివచనరచన మది యొక విలక్షణమైనది. ఆయన 'సాక్షి'కి వచ్చినంత ప్రతిష్ఠ యితర వచనగ్రంథమునకు రాలేదు. 'సాక్షి'లో నెత్తిపొడవని విషయము వసుంధరలో లేదు. ఒకమాఱు మెత్తని యెత్తిపొడుపు; మఱొకమాఱు బల్లెపుఁబోటు; ఇంకొకమాఱు అంపపుఁగోఁత; వేఱొకసారి గొడ్డలివ్రేటు! ఇది యాయనరచనలోని గుణము! తనను బరిపాలించుచున్న మహారాజుదగ్గర నేదైన నెగ్గున్నచో దాని నాయన సాక్షిద్వారా ఉట్టంకించితీరెను. తన జాతిలో, తన శాఖలో, తనవారిలో, చివరకుఁ దనలోఁ దప్పున్న దని తోఁచిన విడిచిపెట్టలేదు. ఆయనకు మొగమోటమి లేదు. ఆయనవద్ద ముఖస్తుతులు లేవు. ఉన్నది యెన్ని చూపెను. ఆచూపుటలో నొకప్పుడు ముదురుఁబాకమునఁ జూపెను; ఒకప్పుడు మృదుపాకమునఁ జూపెను. ఆయన యందఱ తప్పులను గొప్పలుచేసి చీవాట్లుపెట్టెను. మరల నాయన వ్రాఁతలమీఁద నీఁగ వ్రాలినచో సాఁగఁదీసి నలిపి చంపెను. "విమర్శాదర్శ విమర్శాదర్శము" చూచి తీరా! యెంతవ్రాసెనో! ఆయన యెంత వ్రాయ

నిండు, ఏ విషయము వ్రాయనిండు, గుజ్జుపునడకవలెఁ జక్కని శయ్యతో, శబ్దాలంకారములతో, భావ గాంభీర్యముతో నతిమనోహరముగ వ్రాసినాఁడు. ఆ నాఁడు వారి సాక్షివ్యాసములు ఆంధ్రపత్రికలోఁ జదువుకొని, మట్టిద్రోణాచార్యులను బెట్టికొని యేకలవ్యునివలెఁ దెలుఁగువచనరచన నలవాటు చేసికొన్న వారిని నేను జాలమంది నెఱుఁగుదును. గద్యరచనములో హృద్యమైన త్రోవదీసినవారిలో పానుగంటి ఆద్యుఁడు. వచనముమాట సరే. ఆయననాటకముల కెంత ప్రఖ్యాతి వచ్చినది! పానుగంటి "రాధాకృష్ణ" రంగస్థలముమీఁద నెన్నిసారులు చూచినఁ దృప్తితీరును! ఆయనకంఠాభరణము, ఆయనసారంగధర, ఆయన కోకిల యెంత రమ్యములైన నాటకములు! హాస్యరసమున కాయన యవతారపురుషుఁడు. వచనరచనాదివ్యప్రవంతి కాయన భగీరథుఁడు. ఆంధ్రీవసుమతికి పానుగంటికవి యేనుఁగువంటివాఁడు.

## శ్రీ చెళ్లపిళ్లకవి

వేంకటశాస్త్రిగారు కవిత్వపుఁగరడు. ఆయన నిలువెల్లఁ గవిత్వము. కవిత యాయనకతననే పుట్టినదని కొందఱ విశ్వాసము. దానికిఁ దగినటులు, తెలుఁగునేల యీనినట్లు వేంకటశాస్త్రిగారికి వేలకొలఁది శిష్యులు. శిష్యులు పేరునకు శిష్యులుగాని గురువునకుఁ బాఠములు చెప్ప సమర్థులు. కవితలో నాయనను మించి వ్రాయఁగల మన్నవారు, పాండిత్యములో నాయనను దాఁటుదు మన్నవారు వెనుక వెనుక వేంకటశాస్త్రిగారిని మించెద మని చెప్పుదురుగాని, ఆయన యెదుటఁ బడినచో సింహస్వప్నము! వేంకటశాస్త్రిగారి ముఖములో నున్న సారస్వతశక్తి యప్రతిహత మైనది. ఆయన కొన్నిలక్షల పద్యములు సృష్టించెను. తిరుపతివేంకట కవులుగా నున్నప్పుడు చేసిన గ్రంథరచన, తత్ప్రాశస్త్యము ప్రస్తుతించుట పిష్టపేషణము. శాస్త్రిగారి కిప్పుడు డెబ్బదినాలుగు పైఁబడినయీడు. ఈ వయస్సులో నాయనకలము నుండి రోజునకు రెండుమూఁడువందల పద్యములు వెలువడుచుండును. వ్యాసమహర్షివలె వ్రాసినది మరలఁ జెఱుచు నలవా టాయనలో లేదు.

ఆయనజాతకచర్యవైచిత్ర్య మదేమో కాని, యిప్పటికి గజారోహణోత్సవములు జరుగుచునే యున్నవి. దేవదర్శనమునకుఁ బోవునట్లు గడియగడియకు నెవరో యొకరు కుక్కిమంచముమీఁద సగముసగము జాఱుచున్న కౌపీనముతోఁ బరుండిన యావృద్ధమూర్తిని దర్శించిపోవుచున్నారు. మనసు కుదిరినచో నొకసారి మాటాడును. లేదా, వచ్చిన వానిని పలుకరించుట కూడ నుండదు. వచ్చినవాఁడు వచ్చి యాయనపాదము లొకమాఱు ముట్టి చక్కఁ బోవును. అదే యతఁడు పదివే లనుకొనును. మఱి ఆ వేంకటశాస్త్రిగారి మహత్త్వ మేమో- యిటులు సాఁగుచున్నది జీవయాత్ర!

వేంకటశాస్త్రిగారి పేరు నెఱుఁగనివాఁ డొక్కఁడు తెలుఁగులో లేఁడు. 'శతావధానము' అనఁగా వెనుకనే వేంకటశాస్త్రిగారి పేరు చెప్పికొందురు. అక్షరములు రానివాఁడుకూడ శ్రవణానందములోనిదనియో, నానారాజసందర్శనములోనిదనియో యొకపద్యము చదువును. ఒక యధ్వానపు టడవి యూరిలోనికి వెళ్లినపుడు ఒక కుఱ్ఱవానిని నేనడిగితిని: "చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగా రని చెప్పుకొనుట వింటివా!" అని. "మీసము రెండుబాసలకు మేమె కవీంద్రుల" మని యతఁడు చదువ మొదలిడినాఁడు. నే నబ్బురపడినాఁడను. "వానలోఁ దడియనివారు మద్గురువధానమృదూక్తిమరందధారలోఁ గడుగనివారు లే"రని విశ్వనాథ సత్యనారాయణగా రన్నట్లు వేంకటశాస్త్రిగారి పద్యము రానివాఁడు లేఁడు. ఆయన గ్రంథములు పారాయణము చేసికొని, ఆయనమాటల తీరు నేరిచికొని, ఆయననే ఆరాధించుకొనుచు, తిక్కనభారతమైనను దిరుగవేయకుండ పండితులని సన్మానములు చేయించుకొన్నవారు పెక్కురు. వేంకటశాస్త్రిగారి వెనుకఁ దిరుగుటయే గొప్పచదువు. అపురూపముగ నక్కడక్కడ విరళముగా నున్న ఆంధ్రకవితను బజారునఁ బెట్టి పరివ్యాప్తిలోనికిఁ

తెచ్చిన శ్రీవజ్ఞానందమహాకవి శ్రీ
మునకు నాఅవ సజీవదిఙ్నాగము.

## శ్రీ వీరభద్రరావుపంతులు

"ఆంధ్రుల చరిత్రము" మనపూర్వులు సంపాదించిపెట్టిన స్థిరమైన యాస్తి. ఆ యాస్తిని సాఁగుబడిలోనికిఁ దెచ్చి మన కింత భిక్షపెట్టిన వీరభద్రరావుగారి వ్యవసాయము స్తోత్రపాత్రము! ఏ సారస్వతమైనను ఆ సారస్వతపుఁ జరిత్రనుబట్టి ఘనతగాంచును. ఆ చరిత్రయే మఱుఁగుపడిన మనకు భావి యుండదు.

హ ముండదు. హనుమంతుని "ఇంతవాఁడ వంతవాఁడ" వని జాంబవంతుఁడు ఉబ్బఁ జేసినఁ గాని యతఁడు కార్యము నిర్వహింపలేకపోయెను. "నీపూర్వు లిట్టివారు. వారి పేరు నిలఁబెట్టు" అని చెప్పినఁగాని వీని కుత్సాహ ముండదు. అట్టి పని చరిత్రలు చేయును. అందులో, మన యాంధ్రులచరిత్ర మతిపవిత్రమైనది; అతిచిత్ర మైనది. దానిని సేకరించి చక్కని శైలిలో రచించి చిలుకూరివారు మన కందఁ జేసిరి. ఆయనసిద్ధాంతములలోఁ గొన్నిదోషము లున్న వని యెన్నటకంటె 'ఆంధ్రుల చరిత్ర' సమగ్రముగాఁ బండితులు సంస్కరించి పునఃప్రచురణము సేయుట లెస్స.

వీరభద్రరావుగారు చరిత్రరచనమునకు ఆరోగ్యమును,ఆస్తిని,అసువులను విడిచిపెట్టిన మహాశయుఁడు. ఆయన యదేపని చేసెను. చరిత్రమునకుఁ బుట్టెను; చరిత్రమునకు గిట్టెను. సంస్థానప్రభువులు కన్నెఱ్ఱ జేసినను సత్యప్రకటనమునకు జంకలే దాయన.సరియైన రచయిత యొకరికి మొగమోటపడి గాని, ఒకరికొఱకని గాని స్వీయసిద్ధాంతములు మార్చుకొని పరప్రత్యయనేయమతి కానేరఁడు. ఈ సద్గుణము వీరభద్రరావుగారిలో సంపూర్ణముగ నున్నది. అందులకే యీయన యార్థికముగఁ గొన్నిచిక్కులు పడెను. అగుఁగాక! వీరభద్ర చరిత్రచతురాననుఁడు వాఙ్మయక్షోణికి ఏడవ దిశాహస్తి.

## శ్రీ లక్ష్మణరావుపంతులు

లక్ష్మణరావుగారు తెనుఁగునాట విజ్ఞాన చంద్రిక గాయించినారు. ఆయన యారంభించిన 'ఆంధ్రవిజ్ఞానసర్వస్వము' ఆంధ్రుల పెన్నిధి. అది పూర్తికావలయును. కొమఱ్ఱాజుపండితుఁడు తెలుఁగు సారస్వతమునకు జీవకఱ్ఱ. ఆయన యతివేలమైన కళాభిమానము కలవాఁడైనను, శాస్త్రీయగ్రంథప్రకటనమునకే శ్రద్ధచూపెను. శాస్త్రకృతు లున్నఁగాని భాష కాస్తిక్య ముండదని తలఁచి విజ్ఞానచంద్రిక విస్తరిల్లఁజేసిన మహాశయుఁ డాయన. వీరేశలింగముతరువాత నాయనబాధ్యత యంతయు వేంకటలక్ష్మణరావు పంతులుమీఁదఁ బడినది. ఈయనయక్షరములు శిలాక్షరములు. ఏవ్రాఁత వ్రాసినను సప్రమాణ మైనది. ఊరకే యవి చూచి, యివి చూచి యింతగ్రంథము పెంచవలయు నని పంతులుగా రెంచలేదు. వ్రాసినది వేదముగ వ్రాసెను. రచనకూడ నక్నతక మైనది. పత్త్రికలలోఁ బేరుపడుట, ఉపన్యాసవేదికలమీఁద గర్జించుట యీయనకు బొత్తిగా నిష్టములేనిపని. కూరుచుండి నిర్మలముగాఁ దన పని తాను జేసికొనువాఁడు.

ఆయన పెద్దకుటుంబమునఁ బుట్టెను. ౧ద్ర గారు శ్రీ మునగాలరాజుగారి ముత్తవతల్లి గారియొద్ద దివానుగాఁ బనిచేసిన ప్రసిద్ధులు. తండ్రివలెనే పంతులుగారును మునగాలసంస్థానమున ఆంతరంగికకార్యదర్శిగాను, దివానుగాను నుండి రాజకీయముగ మంచి ప్రఖ్యాతి సంపాదించెను. లక్ష్మణరావుగారు స్వతంత్రాశయులు. ఛత్రపతిశివాజీకి జన్మదేశమగు మహారాష్ట్రమున మనుగడ సాఁగించిరి. ఆభాష మాతృభాషవోలె నభ్యసించిరి. అందు పత్రికాసంపాదకులై, గ్రంథరచనము నడపిరి. మధ్యపరగణాలలో బి. ఏ. పట్టము గట్టికొని, వంగకళాపరిషత్తులో ఎమ్. ఏ. అయి, సంస్కృతమున మంచి వ్యుత్పత్తి నార్జించి, మహారాష్ట్రములో మంచి పండితుఁడై తెలుఁగును సముజ్జ్వలముగా సేవించిన మహాశయుఁడు లక్ష్మణరావు

# అష్టదిగ్గజములు

పంతులుగారు. ఆయన నాటిన సారస్వతబీజములు నేఁటికి శాఖోపశాఖలతోఁడి మహావృక్షములై యక్షయముగ నిలిచినవి.

కొమఱ్ఱాజుపండితుఁ డాంధ్రభాషాసర్వంసహాభరణమున నష్టమదిగ్గజము !

ఆధునికత్రిలింగసారస్వతమున కిపుడు మన ముగ్గడించికొనిన యెనమండ్రును ఎనిమిది యేనుఁగు లనుటకు సంశయము లేదు. ఒక్క గజములేకాక, యనేకమహాభూధరములు భరించుచున్నవి భూమిని. అటులే, మనభాష వందలకొలఁది పర్వతములవంటి పండితులపై నిలఁబడినది. ప్రసక్తానుప్రసక్తముగఁ గొందఱఁ జేరుకొంటిని. అందఱు మహాంధ్రరచయితలకీ నా నమోవాకము ఉపలక్షకము !

ఈపేర్కొన్నవారిలో చెళ్లపిళ్లకవిమాత్రము సజీవదిగ్గజము. శేషించినవారు కీర్తిమాత్రావశేషులు. అయినను, అక్షరరూపముగ నిలిచియున్న వారివారి యఖండభాషాసేవాస్వరూపములే ఆధునికసారస్వతప్రపంచనిర్వహణమున కష్టదిగ్గజములవంటి వని "తాత్స్థ్యాత్తాచ్ఛబ్ద్య"న్యాయమున ననుకొని, 'వ్యక్తు లనే యిట ముచ్చటించుట యైనదని పాఠకులకు నా వినతిపీఠిక.

## పండుగ దినములలో











# ఉద్బోధము



= శ్రీ బులుసు వేంకటేశ్వర్లు =

[అష్టావక్రమహర్షి బాల్యముననే జనకచక్రవర్తియాస్థానమున వరుణపుత్రుఁడగు వంది నోడించి జలమజ్జితులైన బ్రాహ్మణోత్తములను, నిజజనకుఁడగు నేకపాదుని విడిపించి విజయధ్వజము ప్రతిష్ఠించినాఁడు. జనకచక్రవర్తి వెంటనే యాతని పాదములకు మ్రొక్కి తన కాత్మజ్ఞానోద్బోధ మొనరింపు మని కోరఁగాఁ గరుణించి శ్రీ యష్టావక్రుఁ డొనర్చిన యుద్బోధవాక్యములలో నీక్రిందివి కొన్ని—]

ఏ ప్రబోధోదయంబున నెల్ల భ్రమలు
స్వప్నమాత్రంబు లైపోవు క్షణములోన
నెది సుఖైకరూపంబు నెయ్యది ప్రశాంత
సత్యతేజంబు దాని కంజలి ఘటింతు.

సర్వసంపత్సమృద్ధియు సర్వభోగ
వితతి నందియు మనుజుఁ డేవేళనైన
సర్వసంగపరిత్యాగశక్తి లేక
సౌఖ్యలవమైనఁ గనఁడు నిశ్చయముగాఁగ.

తలఁపఁ గర్తవ్యదుఃఖ మార్తాండతీవ్ర
కరవిదగ్ధాంతరాత్ముఁడు పరమసుఖముఁ
బ్రశమపీయూషధారాప్రవాహమున నె
కాక కాంచునె యన్యమార్గంబువలన?

పలువిధాధ్యాత్మికాభ్యాసపరత నున్నఁ
దగ నెఱుంగరు శుద్ధబుద్ధప్రపూర్ణ
నిష్ప్రపంచనిరామయనిలయమైన
యాత్మరూపంబు జనుల నేమందు వత్స!

నిజమనోద్భూతసమ్మోహనియతస్వప్న
జాడ్యసంవర్జితుం డయి జ్ఞాని గాంచు
గలితమానసదివ్యసంకలనఁ దనరి
యద్వితీయదశావాప్తి నహరహంబు.

కష్టసుఖములు దైవసంఘటనవలనఁ
గాలమున వచ్చిపోవు సంగతి యెఱింగి
నిత్యతృప్తియు నింద్రియనియమశక్తి
గలుగ వాంఛయు శోకంబు గలుగ దెపుడు.

చింతయే దుఃఖము నొసంగు నెంతయేని
నితరములు గావటంచు గ్రహించి నీవు
దానిఁ ద్యజియించి సుఖము శాంతంబు గాంచి
యెల్లయెడల నిష్కామివై యెసఁగు మోయి!

నిర్వికల్పనిరాయాసనిర్వికార
ఘననిరంజన మా నాత్మ యనుపదంబు
దూర మెన్నఁడు గాదు; విదూరము నగుఁ
బరమసంకోచమానసభరముకతన.

సర్వసంకల్పతీరభాస్వత్ప్రదేశ
విశ్రమస్థాననిరతుఁ డౌ విజ్ఞుఁ డఖిల
మోహదూరగుఁడై నిత్యముదము గాంచు
వీతశోకుండు నై దివ్యవిభవ మందు.

భయదసంసారరహితసంపత్ప్రభుండు
నెపుడు హర్షవిషాదంబు లెఱుఁగకుండు
నమలశాంతాత్మకం బగు నంతరంగ
మమర సతము విదేహసౌఖ్యమున మనును.

"HIS MASTER'S VOICE"

# "హెచ్.ఎం.వి."

శ్రేష్ఠమైన సంగీతము + శ్రేష్ఠమైన రికార్డింగ

## క్రొత్త రికార్డులు

విద్వాన్ మర్ల సూర్యనారాయణ

N. 18761 { ఎటువంటి మోహమో
మగువ తన

మాస్టర్ వి. జే. వర్మ

N. 18762 { లేదా ధర్మము
చనిరో సుమా

"హెచ్. ఎం. వి." హైఫిడెలిటి సూదులు




ది గ్రామఫోన్ కంపెనీ
లిమిటెడ్, మద్రాసు.

"హెచ్. ఎం. వి." గ్రామఫోన్
వ్యాపారులందరివద్ద దొరకును.

వేటూరి-

సుందరశాస్త్రిగారి

# సువర్ణసుందరరసము

## సర్వప్రమేహములకు సంజీవి.

గుణము ప్రత్యక్షము

అనుభవసిద్ధము. ఇన్‌జెక్షన్లు అవసరం లేదు. ఎటువంటి ప్రమేహాలనైనా కుదుర్చును.

**50 మాత్రలు రు. 5.**

ఆర్షరసాయనశాల, ముక్త్యాల.



# డోంగ్రేగారి

బాలామృతము

## బలహీనమైన బిడ్డలకు పుష్టియున్ను, బలమున్ను ఆరోగ్యము నిచ్చును



## ఆపరేషన్

అపాయము, ఇతర జబ్బుల, తర్వాత మీ కేశములు తప్పక రాలిపోవును. తటాలున సంభవించిన అదురుభయము, నీరసింపజేయు దీర్ఘవ్యాధులు ప్రసవము కూడ తమవంతు కేశపదమును కలిగించియే తీరును. ఒక్కొక్కప్పుడు కేశముల పొడవు తగ్గిపోవుట పత్తి పడుటకూడ తటస్థించును.

ఇప్పుడు మీరు కేశవర్ధినితో కేశములు రాలుట ఆపుకొనగల్గినప్పుడు మీ తలచర్మమును కేశహీనమై విరూపముగా ఎందుకు చెందరు? జుట్టు రాలిపోవుట హానికరమైనది. మీ జబ్బురోజులలో కురులను కాపాడుకొనుటకు కేశవర్ధిని యుండగా మీరు పోగొట్టుకొననవసరము లేదు. అమితముగా వెంట్రుకలు రాలినచోట గూడ కేశవర్ధిని నష్టమును తగ్గించును.

# కేశవర్ధిని

**కురులను అందముగా పెంచి బలపర్చును.**

**నేడే మీ కురులకు కేశవర్ధిని వాడుడు**

| | | |
|---|---|---|
| కేశవర్ధిని | అణాలు | 0-12-0 |
| కేశవర్ధిని షాంపూ | ,, | 0-12-0 |
| కేశవర్ధిని క్రీం | ,, | 1- 0-0 |

ప్యాకింగు పోస్టేజి అధికము.

వర్తకులందరివద్దను దొరకును లేక

## సౌత్ యిండియా కెమికల్సు,

**158, తిరువెంకటస్వామి రోడ్డు,**

**ఆర్. యస్. పురము — కోయంబత్తూరు.**

గమనిక :— దీనినిపోలిన యితర యిమిటేషన్ నూనెలనుకొని మోసపోవద్దు. మీరు కొనుటకుముందు, దానిమీద, "కేశవర్ధిని" మరియు "సౌత్ యిండియా కెమికల్సు" అను పేర్లనుచూచి తీసికొనుడు.




[ కథానిక ]

శ్రీ 'జమదగ్ని' =

'ఏమిటిరా! ఈ తగూలు. నే చెప్పినట్టూ వినక, మీ అంతట మీరూ చూచుకోకపోతే ఎల్లా ఈ వ్యవహారం తెమలడం? రాముడూ! నువ్వైనా ఒక దారికి రా' అన్నాడు గ్రామంలో కులపెద్ద ముసలి పుల్లారెడ్డి.

'ఇల్లు అలా పంచితే నే నెందు కొప్పుకుంటాను తాతా! గాలీ, వెల్తురూ వచ్చే దక్షిణపుభాగం వాడు తీసుకుంటే ఈ చీకటికోణంలో నే ఉండాలీ! వాణ్నే ఉత్తరపుభాగం తీసుకోమను' అన్నాడు చిన్నవాడు గోపాలం.

'సరే! ఇంటి విషయంలో వాడు చెప్పినట్టే కానియ్యి తాతా! పొలంమాట గూడా పరిష్కారం చెయ్యి!' అన్నాడు రాముడు.

'పొలానికి పెద్ద పంచేదేమున్నదిరా! ఉన్నవి రెండెకరాలాయె. రెండూ నాలుగుమళ్లుగా ఉండనే ఉన్నాయి. ఇద్దఱూ చెఱో రెండుమళ్లూ తీసుకోండి.'

'మళ్లీ అదేమిటి! ఏఏమళ్లు ఎవ రెవరు తీసుకోవాలో గూడా ఖరాఖండిగా తేల్చేసెయ్యి!'

'అయితే నువ్వు ఎగువ రెండుమళ్లూ తీసుకో! దిగువ రెండుమళ్లూ రాముడు తీసుకుంటాడు.'

'బాగానే! ఉంది. నీరు సమంగా పట్టి ఎక్కువ పంట పండే పల్లపుమళ్లు రెండూ వాడికిచ్చి ఎందుకూ పనికిరాని ఎగువమళ్లు రెండూ నన్ను తీసుకోమంటే నే నేమన్నా బాగుపడాలా!'

'తాతా! ఈ పంపకంతో నాప్రాణం విసిగెత్తిపోతోంది. వా డిష్టమొచ్చినట్లు కానీ ప్రతిదీని'.

'అదేమిటండీ! అంతకాడికి పంపకాలు పెట్టుకోకపోతే ఏం? అంతా ఆయనగార్నే తీసుకోమని ఊరుకోకపోయారూ' అని గదికిటికీలోనుంచి తొంగి చూస్తున్న అన్నపూర్ణ భర్త నుద్దేశించి అన్నది.

రాముడు భార్యమాట వినీవిననట్టుగా ఊరుకున్నాడు. పుల్లారెడ్డి ఆ మాటల్తో కొంచెం కదిలి న్యాయ మాలోచించి 'గోపాలం! నువ్వన్నమాట బాగానే ఉంది. ఎగువమళ్లు రెండూ ఎందుకూ పనికి రావని నువ్వే అంటున్నావు కదా! అవి వాడుమాత్రం ఎట్లా తీసుకుంటాడు చెప్పు' అని మెల్లగా అన్నాడు.

దీంతో గోపాలం మండిపడి 'వ్యవహారాల్లో ఆడవాళ్లుకూడా దిగితే ఇక చెప్పేదేముంది? ఇంట్లో కూర్చుని ఏడవక వీటిల్లో వాళ్ల కెందుకంట' అంటూ ఎదురుగుండా ఉన్న గేదెకట్టుకొయ్యవంక చూస్తూ అన్నాడు.

రాముడు ఈమాట భరించలేకపోయాడు. అతని కాపాదమస్తకమూ శరీరం కోపంతో గజగజలాడింది. 'తమ్ముడి వని ఊరుకున్నానురా వెధవా! ఏదో చిన్నవాడివి- నీ కయిష్టంగా ఎందుకు జరగాలని నేను

సర్దుకుంటూ ఉంటే నోటికి వచ్చినట్లల్లా పేల్తావేం. జాగ్రత్త!' అని అన్నాడు.

'నువ్వు వెధవా గిధవా అంటే ఇక్కడ పడేవా ళ్లెవరూ లేరు. ఈ ముండమోపి బెదిరింపులకు నేనేం భయపడతా ననుకున్నావు కాబోలు. ఒళ్లు దగ్గిర ఉంచుకు మాట్లాడు' అంటూ గోపాలం చొక్కా చేతు లెగదీస్తూ అరుగుమీదినుంచి లేచాడు.

'కొడ్తావా ఏమిట్రా! కొట్టుచూద్దాం ఏమాత్రం కొడ్తావో' అంటూ రాముడు ముందుకు వచ్చాడు.

'కొడ్తానా కొట్టిచూపిస్తానా! నాతో మర్యాదగా ఉండకపోతే చివరికి అంతే అవుతుంది. ఏమనుకుంటున్నావో' అని గోపాలం మరీ మీదికి వచ్చాడు.

పుల్లారెడ్డి చూస్తూ ఊరుకోలేక ఇద్దరి మధ్యకూ వచ్చి గోపాలంవంక చూచి 'ఇంతకాడికి నన్నెందుకురా నువ్వు పిల్చుకువచ్చావు? చేతులు చాలా! నా దుడ్డుకఱ్ఱకూడా తీసుకుంటావా? భూమ్మీద నూకలు తక్కువై ఏడవబోకు' అంటూ కళ్లు పెద్దవిచేశాడు.

గోపాలానికి రెడ్డి అంటే కొంచెం గౌరవం ఉంది. కాని అతనికి ఊరంతా అన్నపక్షమే అవలంబిస్తారని అనుమానం. ఈ అనుమానంతోనే రెడ్డి చెప్పిన దానికి దేనికీ సరాసరి ఒప్పుకోక ఏదో సవరణ తెస్తూ ఉంటాడు. ఈ సమయంలో రెడ్డిముఖం చూచేసరికి అతనికి కొంచెం భయంవేసింది. వెంటనే వెనక్కి తగ్గాడు. ఇది ఆసరాగా తీసుకుని 'అయితే నే నొక విధంగా తేలుస్తాను ఇద్దఱూ వింటార్రా!' అన్నాడు రెడ్డి.

'నీ ఇష్టం వచ్చినట్లు చెయ్యి తాతయ్యా! నాకేమీ అభ్యంతరం లేదు' అన్నాడు రాముడు.

గోపాలం మాట్లాడలేదు.

'ఏరా! గోపాలం! నువ్వేమీ అవుననవు. మఱి నే నేం చెప్పినా ఎదురుచెప్తావాయె. ఎట్లా?'

'నువ్వు చెప్పు—ఏం చెప్తావో. నేనూ మాట్లాడనులే' అని అంటూ అరుగుమీద మళ్లీ కూర్చున్నాడు గోపాలం.

'అయితే ఉత్తరపువైపు ఎగువమడీ, దిగువమడీ ఒకరు తీసుకోండి. దక్షిణపువైపు రెండుమళ్లూ ఇంకోరు తీసుకోండి. మఱి నీ కేవైపుది కావాలో చెప్పు'

'నేను ఉత్తరపుమళ్లే తీసుకుంటాను' అన్నాడు గోపాలం.

రాముడు మాట్లాడలేదు. ఉత్తరపు మడిలోకి నీటికాలవ ఉంది. దక్షిణపు మళ్లల్లోకి నీరు రావాలంటే ఆ మళ్లల్లోంచే రావాలి. ఆ సంగతి అన్నపూర్ణకు తెలుసు. రాముడు ఏమీ మాట్లాడకుండా తల వంచుకు కూర్చున్నాడు. అందుకని ఆవిడ మళ్లీ నోరుచేసుకోవలసివచ్చింది. 'అయితే నీళ్లు ఆ మళ్లల్లో నించి రావలసిందేనా వీటికి' అని ఊరుకున్నది.

రెడ్డి వెంటనే అందుకుని 'దానికేం? ఉత్తరపు మళ్లు తీసుకున్నవాడు దక్షిణపుమడిలోకి కాలవ తీయించియిస్తాడు. ఏరా గోపాలం!' అన్నాడు.

గోపాలం కాదనడానికి వీల్లేకపోయింది. 'సరే అట్లాగే కానియ్యి' అని ఊరుకున్నాడు.

రాముడు ఒప్పుకున్నట్టుగానే గ్రహించి పుల్లారెడ్డి 'ఇక మిగిలిందల్లా వాములదొడ్డీ, ఎకరం బీడూనూ. నా మతం ఏమిటంటే, ఇద్దఱూ చెఱి ఒకటే తీసుకోవడం మంచిదని. రాముడూ! ఈ సారి నువ్వు చెప్పు నీ కేం కావాలో' అని అంటూ గోపాలంవంక చూస్తూ నిలబడ్డాడు.

రాముడు 'నే నేమీ మాట్లాడను తాతయ్యా. ఎందుకొచ్చిన అప్రతిష్ఠ! ఏదో ఒక విధంగా తేల్చెయ్యి' అన్నాడు.

దాంతో గోపాలానికి కొంచెం కోపం వచ్చింది. అయినా కార్యం సానుకూలం అయిందాకా మాట్లాడకూడదని కొంచెం తమాయించుకుని ఊరుకున్నాడు. గోపాలంముఖం చూచి అతని మనోవిషయం గ్రహించాలని ప్రయత్నిస్తున్న పుల్లారెడ్డి 'అయితే గోపాలం! నువ్వు వాములదొడ్డి తీసుకో. వాడి కాబీడు ఇయ్యి. కాని దానికి కోఱడీ గీఱడీ లేదాయె. అందుకని ఈయేటికి మంగళగిరికంప పెట్టించి కంచె వేయించి

ఇయ్యి; ముందునాటి కదే ఆబాజవుతుంది. ఏమంటావ్.' అన్నాడు.

'నాకుమాత్రం బీడు అక్కఱలేదా ఏమిటి!' అంటూ మూతిముడిచాడు గోపాలం.

వెంటనే రెడ్డి 'అదీ ఎకరమే ఇదీ ఎకర మేనాయి. దీనికి చుట్టూ కోటగోడలాంటి కోఅడి ఉండె. దొడ్డినిండా వాములే పెడ్తావా? వామిమేర విడిచి మిగిలింది రెండుచాళ్లు దున్ని విడిచిపెడితే మొలలోతు బీడు సిద్ధమౌతుంది!' అన్నాడు.

'అదిమాత్రం నమ్మకమేమిటి? అది ఎప్పుడో తాతలనాటినుండీ దిక్కూ దివాణా లేక వాములతో ఉడికెత్తిన భూమి గడ్డిపట్టుతుందా ఏడుస్తుందా! అల్లా ఇందులోనూ రెండుభాగాలు చెయ్యి; అందులోనూ రెండుభాగాలు చెయ్యి' అన్నాడు గోపాలం.

'అక్కడో కాస్త అక్కడో కాస్త ఉంటే ఆబాజుచేసుకోవడం కష్టం కాదుట్రా!'

'కష్టం అయితే అయిందిలే. అల్లా చేస్తేనే నేను ఒప్పుకుంటాను.'

'ఎందుకు తాతయ్యా! ఇంత రాద్ధాంతం. వాడిఇష్టం వచ్చినట్లు నిశ్చయంచెయ్యి. నేనేమీ ఎదురు చెప్పనన్నాగా'అన్నాడు రాముడు.

'సరే! అట్లాగే కానివ్వండి. ఇక అయిపోయి నట్టేనా!' అన్నాడు రెడ్డి.

'మఱి పాత్రసామగ్రీ-గొడ్డూ గోదా అసలు ముఖ్యమైన విషయాలు విడిచిపెట్టితే ఎట్లాగా? అవి పంచనక్కఱలేదా ఏమిటి'అంటూ గోపాలం మళ్లీ లేచి నుంచున్నాడు.

దీంతో రాముడికి చిరాకు ఎక్కువైంది. పంపక మన్నాక అన్నీ ఒకసారే తేలిపోతే మంచిదిగదా అని సమాధానపఱుచుకొని పాలేళ్లను కేకవేసి ఉన్న సామగ్రి అంతా దింపమన్నాడు. ఒక్క అరగంటలో చెంబూ తప్పాలా దగ్గఱ్నుంచీ బొట్టుపెట్టెలూభోషాణాలవఱకూ అన్నీ బైటపడవేశారు.

'తాతయ్యా! ఉన్న సామాన్లివి. నీఇష్టం వచ్చినట్లు పంచు'అని దూరంగా కూర్చున్నాడు రాముడు.

'ఇప్పుడు ఇంట్లో వాడకంలో ఉన్న సామాన్లు తనే తీసుకుంటాడా?'అని రెడ్డివంక చూచి అన్నాడు గోపాలం.

తల వంచుకుని అరుగుమీద నెత్తిన చేతులు పెట్టుకు కూర్చున్న రాముడు ఉలిక్కిపడి 'ఏమేవ్! ఆ అంటగిన్నెలతోపాటు ఇంట్లో ఉన్న వస్తువులన్నీ బైటపడెయ్యి'అని భార్య నుద్దేశించి కేకవేశాడు. అన్నపూర్ణ ఒక్కొక్కటే బైటకుజేరవెయ్యడం మొదలు పెట్టింది. ఒక పాలేరు వాటి నందుకుని సామాను లన్నింటిలో చేరుస్తున్నాడు.

ఇంతలో గొడ్లపాకలో పాడిఆవు అరిచింది. దానిముందు మేత అయిపోవడం చూచి మఱొక పాలేరు మేత తేవడానికి వెళ్లాడు. పుల్లారెడ్డి సామాన్లు ఇంకా అన్నీ రాకపోవడం చూచి ముందు పశువుల సంగతి నిర్ణయించేద్దా మనుకున్నాడు. వాళ్లకు రెండావులూ, రెండు గేదెలూ, ఒక ఎడ్లజతా మాత్రం ఉన్నాయి. ఆ ఎడ్లజత వాళ్ల ఇంట పుట్టిపెరిగిందే. ఆ రెండావులూ ఏడాదివిడిచి ఏడాది కోడెదూడల్ని పెడ్తాయి. అయితే అవి వీళ్ల ఇంటికి ఏడాది హెచ్చు తగ్గుగా వచ్చాయి. అందుకని తొలిచూలు కోడెల్ని పెంచి పెద్దవిచేసి వ్యవసాయం చేస్తున్నారు. తర్వాత వాటి నన్నింటి ఒకటి రెండు ఏళ్లు పెంచి చిన్న సంసారం అయిన కారణంచేత అమ్మేసుకునేవారు. ఆవుల్ని, గేదెల్ని పంచడం విషయంలో రెడ్డి కేమీ ఇబ్బందిరాలేదు. ఇద్దఱూ చెఱొక ఆవునీ, చెఱొక గేదెనీ తీసుకునేటట్లు నిశ్చయంచేశాడు. కాని వాటి చిన్నతనంనుండీ తాను ఎఱిగి ఉండడంవల్ల ఆ ఎడ్లజత పంచడం విషయంలోమాత్రం అతని మనస్సు చివుక్కు మన్నది. భూమిమీద పడ్డదిలగాయతు సుఖం వచ్చినా దుఃఖం వచ్చినా అవి రెండూ రామలక్ష్మణులలాగా కలిసి ఉన్నాయేగాని విడివడి ఉండలేదు. వీళ్ల తండ్రి అంకమ్మ బ్రతికి ఉన్నప్పుడు తానుగూడా ఆ ఎడ్లు

కట్టిన బండీ ఎక్కి చాలాసార్లు తిరిగాడు. వాటి చురుకూ, నెమ్మదీ, అన్యోన్యం అన్నీ తనకు బాగా తెలుసు. అటువంటి జతను విడదియ్యడ మేమీ బాగుండ దనిపించి 'ఒరే! గోపాలం! ఈ ఎడ్లజతను మాత్రం విడదియ్యబోకండి. ఎవరో ఒకరు దాన్ని తీసుకుని దానికి బదులు ముదరాఇస్తే రెండోవాళ్లు మరోజత కొనుక్కోవచ్చు' అన్నాడు రెడ్డి.

'ముదరా ఇవ్వడ మంటే సామాన్యమా ఏమిటి? ఇప్పుడు వాటి ఖరీదు ఎంత హీనపక్షమైనా ఎనిమిది వందలకు తక్కువ కావు. ఎక్కడినుంచి ఎత్తుకువస్తాడేమిటి ఎవడుమటుకు' అని విసుక్కున్నాడు గోపాలం.

ఈ మాటలు గోపాలం గట్టిగా అనేటప్పటికి ఎడ్లను పంచడం తప్పదన్న విషయం రాముడి మనస్సులో ముల్లుగుచ్చుకున్నట్టు గుచ్చుకుంది.

రాముడి కీపంపకం బొత్తుగా ఇష్టంలేదు. తండ్రి చనిపోయి ఇంకా నెలరోజులు కాలేదు. పరిస్థితు లిట్లా విషమించడం అతన్ని ఎంతో బాధపెట్టుతోంది. గోపాలం ఇట్లా ప్రవర్తిస్తాడని అతను అనుకోకపోలేదు. కాని ఇంత తొందర్లో ఈ అవసరం వస్తుందని అతను ఎన్నడూ అనుకోలేదు. ఈ పంపకం జరుగుతున్నంత సేపూ అతడు మనస్సులో యమయాతన పడుతున్నాడు. తన తండ్రిమర్యాద, తన కుటుంబంప్రతిష్ఠ అన్నీ గంగలో కలుస్తున్నట్టు అతని కళ్లఎదుట భీకరంగా కనపడుతున్నాయి. భావిజీవితంలో తమ గౌరవహీనమైన బ్రతుకులు అతనికి సాక్షాత్కరిస్తున్నాయి. తన కొక కొడుకున్నాడు. తన భార్య ఈ పంపకానికే పట్టుపడుతోంది. ఈ నెలరోజుల్లోనూ గోపాలం తన్నూ, తన భార్యనూ అన్న మాటలు ఇన్నీ అన్నీ కావు. ఒకప్పుడు సమస్తమూ గోపాలానికి విడిచిపెట్టేసి తాను ఏదో కూలిచేసుకొని బతుకుదామనిగూడా అనుకున్నాడు. కాని భార్య నిలవవేసింది. కొడుకును చూపించింది. ఇటువంటి పరిస్థితుల్లో భార్యను సంతృప్తిపరచి కొడుకును బాగు చేసుకోవడం తన విధి అని తోచింది. అందుచేత ఈ పంపకానికి ఒప్పుకోక తప్పనిసరి అయింది. అయినా ప్రతిదానికీ పేచీలు పడటం అతని స్వభావం కాదు. అందుకనే మొదటినుంచీ ముభావంగా ఉన్నాడు. కాని ఎడ్లజత విషయంలో అట్లా ఉండలేకపోయాడు. వాటిని చిన్నప్పటినుంచీ తన చేతుల్తో బిడ్డలవలె పెంచడమే దానికి కారణం. వాటిని తానే తీసుకోవాలన్న సంకల్పం అతని మనస్సులో గాఢంగా ఉంది. అందుకని రెడ్డి ఇచ్చిన ఈ సలహా అందుకుని 'నేను ముదరా ఇస్తాను. నాకు ఇచ్చెయ్యి' అన్నాడు రాముడు.

'నీ కేమయ్యా! ఏదో తెగనమ్మి ఇస్తావే అనుకో. నీడబ్బు ఎవడికి కావాలి? అటువంటి ఎడ్లు నాకు దొరకద్దూ. ఏదో ఒకటన్నా ఉంటే రెండోది ఎక్కడన్నా సంపాదించుకుని తంటాలు పడవచ్చు' అన్నాడు గోపాలం.

రాముడు ఈ భావానికి తట్టుకోలేకపోయాడు. గొంతు నులిమితే రెక్కలు టపటపా కొట్టుకున్న పిట్టలా గిలగిలలాడింది అతని మనస్సు. కాని ఏం చెయ్యగలడు? ఉపాయ మేమీ తోచక చేతుల్తో తల పట్టుకు కూర్చున్నాడు.

ఈ విషయంలో పుల్లారెడ్డి మనస్సుగూడా బాగా నొచ్చుకుంది. ఏమిటిరా గతి! వీటిని విడదియ్యవలసివచ్చేటట్లే ఉందే అని కాసేపు ఆలోచించాడు. అంతలో అతని కో ఉపాయం తోచింది. 'ఒరే అబ్బాయిలూ! నే నేదో పెద్దవాణ్ని. మీ ఇద్దరి మధ్యా పరిష్కారం చెయ్యడానికి వచ్చాను. ఇందులో నేను బావుకునేది ఏమీ లేదు గదా!' అని ఆగాడు.

ఈ మాటలు వినేటప్పటికి ఈ దుష్టపరిస్థితి తొలిగే ఉపాయం ఏమన్నా రెడ్డి చెప్పతాడేమో అన్న ఆశ రాముడికి కలిగింది. అందుచేత కొంచెం తల ఎత్తి రెడ్డివంక తిరిగి 'అదేమిటి తాతయ్యా అట్లా అంటావు! ఇందులో నీ కేమున్నది- పొద్దుటినుండి మామూలాన పడుతున్న బాధతప్ప' అన్నాడు.

'సరే దాని కేంలే. పెద్దవాళ్లమంటూ ఉన్నాక ఆమాత్రం అంటించుకోకపోతే ఎట్లా? అది కాదు

గాని మీరు ఇద్దరూ ఏమీ అనుకోకుం ఉంటే నా కొకమాట చెప్పాలని ఉంది' అని మళ్లీ ఆగాడు రెడ్డి.

'ఏమిటో చెప్పవయ్యా నసక్క' అన్నాడు గోపాలం విసుగుతో.

'నువ్వు అలా విసుక్కుని కసిరితే నాకు ఎందుకు వచ్చిందీ బెడద. నాదారిని నే పోతాను. మీ ఇష్టం వచ్చినట్లు అఘోరించండి!' అంటూ లేచాడు పుల్లారెడ్డి.

'ఇంతదాకా వచ్చి నువ్వు కోపగించుకుని వెళ్లడం ఏమీ బాగా లేదు తాతయ్యా!' అన్నాడు రాముడు మెల్లగా.

ఈమాట విని రెడ్డి ఆగాడు. 'సరే! ఏమయితే అది అవుతుంది. నేను చెప్పాలిసిన మాట ఏమిటో చెప్పి మరీ వెళ్తాను. ఒరే గోపాలం! నువ్వుకూడా బాగా ఆలోచించు. వాటిని విడదియ్యడం నేనే కాదు- ఊళ్లో ఎవళ్లూకూడా అంగీకరించనివిషయం. అలా విడదీసి ఎవ్వరూ లాభం పొందలేరుసరిగదా దానివల్ల అనర్థాలుగూడా వస్తాయి. అందుకని నామాట విను. నువ్వు వాటిని తీసుకుని వాడికి ముదరా అన్నా ఇయ్యి. వాటిని వాడి కిచ్చి నువ్వన్నా డబ్బుతీసుకో. ఇది కాదంటావూ, నీఇష్టం వచ్చిన ధర చెప్పు. ఆపైకం నే నివాళ ఇస్తాను. ఇద్దరూ చెరిసగం తీసుకుని దానికి కాస్తో కూస్తో కలుపుకుని చెరోజతా చిన్నజతలు కొనుక్కుని కాలక్షేపం చెయ్యండి.'అని సమాధానంకోసం గోపాలం వంక చూచాడు రెడ్డి.

గోపాలం ఛఖ్ఖుమని లేచి 'చాలుచాల్లేవయ్యా! నిన్నేమో పెద్దమనిషివని తీసుకువస్తే మాదగ్గఱ మంచి జత కాజెయ్యాలని చూస్తావు! నువ్వెంత ఇస్తా వేమిటి? మహా ఇస్తే పదివందలు ఇస్తావేమో! పంచుకుంటే ఐదువందలు వచ్చె. తోక ఉంటే గొడ్డు తొంభై పలుకుతున్న ఈరోజుల్లో అయిదువందలికీ అడ్డెడు గింజలు లాగే ఎద్దు రాదు'అంటూ ఎడ్ల దగ్గఱకు పోయి చిన్నఎద్దు మెడతాడు పట్టుకుని ఈవతలకు లాక్కువచ్చి గుంజకు కట్టివేస్తూ 'ఇలా జరగవలసిందేకాని మరోరకంగా అయితే నే నసలు ఒప్పుకోను'అని ఎద్దుమీద చెయ్యివేసి విజయగర్వంతో నిలబడ్డాడు.

వెంటనే పుల్లారెడ్డి 'నే నేం చేస్తాను. మీకర్మం' అంటూ లేచిపోయాడు.

'సామాన్లు [illegible]అయింది'అన్న అన్నపూర్ణమాటలు ఎవరూ వినిపించుకోలేదు.

కుడిచేత్తో రొమ్ము అదుముకొని ఎడంచేత్తో వాలిన తల నొక్కుకుంటూ లోపలికి వెళ్లాడు రాముడు.

౨

రెడ్డి వెళ్లిపోవడం, రాముడు ఇంట్లోకి పోవడం, సామాన్లన్నీ బైట పడిఉండడం చూచి గోపాలం మొదట్లో నిర్ఘాంతపోయాడు. కాసేపు ఉండేటప్పటికి అతనికి తన్ను ఎవ్వరూ ఏమీ చెయ్యలేరన్న ధైర్యం వచ్చింది. వెంటనే గోపాలం సామాన్లదగ్గరికి పోయి తనకు నచ్చిన వన్నీ విడిగా తియ్యడం మొదలు పెట్టాడు. ఈ అలికిడి విని అన్నపూర్ణ భర్తను బైటికి పోయి చూడమన్నది. కాని రాముడు కదల్లేదు. తానే పెరటిగుమ్మంలోకి పోయి నుంచున్నది. ఇంతలో నులకమంచంలో నిద్రపోతున్న పిల్లవాడు లేచి 'అమ్మా' అంటూ ఏడుపు మొదలుపెట్టాడు.

'వా డట్లా ఏడుస్తుంటే నువ్వు అక్కడ నుంచోవడమేమిటి!' అంటూ కేక వేశాడు రాముడు.

'అంతా ఆయన ఇష్టం వచ్చినట్టు అక్కడ తీసుకుంటున్నాడు. మీరిక్కడ మాట్లాడకుండా కూర్చున్నారు'అని విసుక్కుంటూ లోపలికి వచ్చింది అన్నపూర్ణ.

'నాకు చేతకాదు. నీకు చేతయితే వ్యవహారం చేసుకోపో!'అన్నాడు రాముడు కోపంతో.

'ఇంతవఱకూ పంపకం నన్ను ఉద్ధరించడానికే జరిగిం దన్నమాట'అని గొణుక్కుంటూ పిల్లవాణ్ణి ఎత్తుకుంది అన్నపూర్ణ.

రాముడు మాట్లాడకుండా కూర్చున్నాడు.

గోపాలం తనకు కావలసిన సామాన్లన్నీ విడిగా తీసి పాలేళ్లచేత పాకలో ఒకమూల పెట్టించాడు. గొడ్లపాకలో అటకమీద ఉన్న నాగళ్లూ, మేడికోళ్లూ, పలకట్టులూ, మైలారంజల్లలూ అన్నీ దింపించి తనకి కావలసినవి తాను తీసుకున్నాడు. ఆ పూటనుంచే వేఱింటి కాపరానికి ప్రయత్నాలు మాజోరుగా సాగించాడు. పాలేళ్లచేత గొడ్లపాకకు మధ్య కఱ్ఱలు కట్టించాడు. తన ఆవునీ, తన గేదెనీ, తన ఎద్దునీ తన భాగంలో కట్టేశాడు. ఇల్లు రెండుభాగాలయ్యేటట్టుగా మధ్య ప్రస్తుతానికి తడికలు పెట్టించాడు. పాలేళ్లను వెంబడిపెట్టుకుపోయి వాములదొడ్లో గడ్డివామి రెండుభాగాలు చేసి తన వాటా వేఱే వామిగా వేసుకున్నాడు. చొప్పగూడు పగలగొట్టించి తన భాగం వేఱుగా కుప్ప వేయించాడు. ఆసాయంత్రమే బయలుదేఱి భార్యను తీసుకురావడానికి అత్తవారింటికి వెళ్లాడు.

రాముడు వీటన్నింటిలో జోక్యం కలిగించుకోలేదు. తమ్ముడి ఔద్ధత్యం చూచి వాడి ఇష్టంవచ్చినట్లే జరగనిమ్మని ఊరుకున్నాడు! 'తండ్రి చనిపోయి నెలకాలేదు. అప్పుడే సంసారం ఇంత బట్టబయలయింది. ఇకముందు ఎంత యాతన పడాలో' అనే ఆ రాత్రల్లా ఆలోచించాడు. రాముడు కొంచెం పూర్వకాలపు మనిషి. పెద్దమనిషితరహాగా ఉంటాడు. తండ్రి బతికిఉన్నన్నాళ్లూ ఆయనఅడుగుజాడల్లో నడిచాడు. ఇప్పటికీ ఆయనలా బతకాలని అతని అభిలాష. తన తండ్రి ఎంత మంచివాడు! ప్రేమతో గ్రామం అంతా తనవశం చేసుకున్నాడు. తాను పెద్ద ఆస్తిపరుడు కాకపోయినా 'దేహి' అని అడిగిన ప్రతివాడికీ కాస్తో కూస్తో ఇచ్చి సంతృప్తిపఱిచేవాడు. వ్రాతా కోతా సాధించకపోయినా ఐహికానికీ, ఆముష్మికానికీ కావలసిన విజ్ఞానం పూర్తిగా సంపాదించాడు. గుళ్లో పురాణాల దగ్గఱనుంచీ గూడెంలో తోలుబొమ్మలాటలవఱకూ అంకమ్మ లేందే అయ్యేవి కావు. అంత బ్రతుకు బ్రతికిన తండ్రి కడుపున పుట్టి తా మిద్దఱూ ఇట్లా అయిపోవడ మేమిటా అని అతని మనస్సు నిమిషనిమిషానికీ బాధపడింది.

కాని గోపాలం చిన్నప్పటినుంచీ ఎడ్డెం అంటే తెడ్డెం అనేరకం. అతడు ఒకడితో కలిసి ఎప్పుడూ ఉండలేదు. ఈసహజప్రవృత్తికి తోడు జీవితరంగంలో అతడు పెరిగిన పరిస్థితులుకూడా అట్లాగే సమకూడాయి. అతడు తల్లిదండ్రుల అదుపాజ్ఞలలో పెరిగి పెద్దవాడు కాలేదు. పుట్టిన రెండేళ్లకే తల్లి చనిపోవడంవల్ల మేనమామల ఇంటనే పెరిగాడు. తన భార్యకు ఇష్టం లేకపోయినా వాళ్ల మేనమామ తనకు చేతనైనంతలో గోపాలాన్ని శ్రద్ధగానే పెంచి పెద్దవాణ్ని చేశాడు. చిట్టచివఱికి తన కూతుర్నిచ్చి చెల్లెలిమీది అభిమానంతో గోపాలానికి పెళ్లికూడా చేశాడు. ఎంత చేస్తే ఏం. గోపాలం తన తండ్రిగౌరవమర్యాదల్లో పాలుపంచుకుని పెరగలేదు.

తెల్లవారింది. పలుదోముపుల్ల నములుకుంటూ పుల్లారెడ్డి రాముడిదగ్గఱకు వచ్చాడు. రెండువందల రూపాయలు లెక్కపెట్టి రాముడి కిచ్చాడు. తండ్రి చనిపోయినప్పుడు దినవారాల ఖర్చుకు చేతిలో పైకం లేక తమకున్న ఒక్క బండినీ పుల్లారెడ్డి కిచ్చివేసి అవసరానికి ఒక వందరూపాయలు తెచ్చాడు రాముడు. అది పోగా బండిఖరీదులో మిగిలిన సొమ్మది. రెడ్డినీ, ఆ సొమ్మునూ చూచేటప్పటికి రాముడికి వెనకటి దుఃఖం అంతా నెమరుకువచ్చింది. రెడ్డిని కౌగలించుకుని 'తాతా! మా అయ్యగౌరవం ఇట్లా నిలబెట్టుతున్నాం' అని వెక్కివెక్కి ఏడ్చాడు.

రాముడి తల తన చేత్తో నిమురుతూ 'ఓరి! వెఱ్ఱివాడా! దీనికి నువ్వేం చేస్తావు? అయినా ఇట్లా ఏడ్చి ప్రయోజన మేమిటి? నీ మానాన నువ్వు బతుకు. ఎవరి గౌరవం వారికే ఉంటుంది' అని ఓదారుస్తూ ధైర్యం చెప్పాడు.

రాముడు కొంచెం తేఱుకొని చేతులో నోట్లవంక చూచి కర్తవ్యం జ్ఞాపకం చేసుకుని 'తాతా! నీతో ఒకమాట చెప్పాలి. ఇట్లా కూర్చో' అని అరుగుమీద కూర్చోపెట్టాడు.

## నటీమణులవలె మీశరీరసౌందర్యమును కాపాడుకొనుడు!



## శోభన సమర్థ్

శోభన ప్రతి దినము తన అందమును కాపాడు ఒక పద్ధతి అవలంభించుతుంది. ప్రొద్దున సాయంత్రము ఆమె లక్స్ టాయిలెట్ సబ్బుయొక్క చురుకైన నురుగుతో రుద్దుకొని నిర్మలమైన నీళ్లతోకడుగుకొనును. "ఎల్లప్పుడుచేసే ఈ స్వల్పమైనపని నా చర్మాన్ని అందంగా, మృదువుగా, నిర్మలంగా వుంచుతుందని" చెపుతుంది. చాలమంది మన నటీమణులీ విధంగానే అంటున్నారు.




## లక్సు టాయిలెట్ సబ్బు

LTS. 127-111-40 TL

LEVER BROTHERS (INDIA) LIMITED

'తాతా! నువ్వు అప్పుడిచ్చిన వందలోనూ ఏనభై దాదాపు చిన్నదినానికీ పెద్దదినానికీ ఖర్చయి నాయి అయితే ఆ ఖర్చులో వంతులు పెట్టడం నా కిష్టంలేదు. అందుకని మిగిలిన ఈ పైకం అంతా వాడికే ఇచ్చివెయ్యి. నేనిస్తే నాతో ఏదో జగడమాడి అవీ ఇవీ కెలుకుతాడు. అది అంతా నేను సహించ లేను. నువ్వే వాడి చేతి కీ పైకం ఇస్తే మ ఱేమీ మాట్లాడడు. ఈ కాస్తపనీ నా కోసం చేసిపెట్టాలి' అని రెడ్డిచేతులు పట్టుకున్నాడు రాముడు.

'సరేలే! నీ ఇష్టం అట్లా ఉంటే అట్లాగే చేస్తాను' అని రెడ్డి లేచి, బయలుదేరాడు.

అప్పటి కింకా జాము ప్రొద్దు ఎక్కలేదు. రెడ్డి అలా వీధిలో అడుగుపెట్టేటప్పటికి గూడుబండ్లీ ఒకటి వాకిట్లో నిలబడింది. గోపాలమే అయి ఉంటాడు, మనము ఎందుకు పలకరించాలని తనదారిని తాను వెళ్లిపోయాడు రెడ్డి. గోపాలం భార్యను లోపలికి పంపించి, పాలేరుచేత పెట్టే బేడా దింపిస్తూ, వెళ్లుతూ ఉన్న రెడ్డివంక చూస్తూ నిలబడ్డాడు.

పరిచయం చిన్నబావతో ఎక్కువ ఉన్నా సీతమ్మకు పెద్దబావమీద అభిమానం ఎక్కువ. తన్ను చిన్నప్పుడు చిన్నబావ ఎప్పుడూ మొట్టికాయలు మొట్టడమేకాని ఎత్తుకున్న పాపాన పోలేదు. పెద్ద బావ అట్లా కాదు. చిన్నతనంలో తన్ను ఎత్తుకొని ఏది కావాలంటే అది తెచ్చిపెట్టేవాడు. తాను గుమ్మంలో అడుగుపెట్టుతూనే, కుఱ్ఱవాణ్ని బుజాన వేసుకుని జోకొట్టుతూ అటూ ఇటూ పచార్లు చేస్తున్న రాముణ్ని చూచింది సీతమ్మ.

'బావా! రంగయ్య కులాసాగా ఉన్నాడా?' అని అంటూ చేతులు చాచింది.

అంతలో గోపాలం లోపలికి వచ్చి సీతమ్మను చూచి 'నీకు వాళ్లతో ఏం సంబంధం! అటు పో. లోపలికి పో' అని కేక వేశాడు.

సీతమ్మ చాచిన చేతు లట్లాగే ఉంచి నివ్వెఱ పోయింది.

రాముడు తాతిబొమ్మలా నిలబడిపోయాడు.

'ఇంకా కదలవేం? నీకు కాదూ చెప్పేది!' అని గట్టిగా అరుస్తూ కళ్లు ఎఱ్ఱజేశాడు గోపాలం.

సీతమ్మ మెల్లగా, తడబడుతున్న శరీరంతో తమ భాగంలోకి వెళ్లింది.

కుఱ్ఱవాడు గొల్లున ఏడుపు మొదలెట్టాడు, రాముడు తల వంచుకుని లోపలికి వెళ్లాడు.

గోపాలం కొత్తకాపురం ఈ విధంగా మొదలు పెట్టాడు. అతని వెనకనే వచ్చిన పాలేరు పెట్టే మూటా అరుగుమీద పెట్టి, అమ్మగారు కనపడక పోవడంచేత, అయ్యగారితో చెప్పడానికి భయం వేసి ఎవరితోనూ చెప్పకుండా బండితోలుకు వెళ్లి పోయాడు.

మఱునాటికల్లా తామరపువ్వుల్తో కలకలలాడే నిండుచెఱువువంటి అంకమ్మ ఇల్లు తిమితిమింగిలాలతో తరంగసంక్షుభితమయ్యే మహాసముద్రంలాగా మాఱి పోయింది. 'కూడలికాపురం కుతకుతలూ, వేఱింటి కాపురం వెతవెతలూ' అన్నట్లయింది వారి పరిస్థితి. పాలేళ్లిద్దఱూ పని మానేస్తామని రాముడితో చెప్ప డానికి వచ్చారు. తండ్రి బతికిఉండగా స్వంతానికి తోడు కవులుపొలం వ్యవసాయంకూడా ఉండేది కాబట్టి వాళ్ల అవసరం ఉన్నది. తనకు ఇప్పు డవి అన్నీ పెట్టుకునే మనస్స్వాస్థ్యం లేకపోబట్టి 'సరే వెళ్లండి' అన్నాడు. దాంతో ఎవరిపని వాళ్లు స్వయంగా చేసుకోవలసివచ్చింది. తానూ, తనభార్యా కాపురానికి కొత్త కాబట్టి కొన్నాళ్లపాటు గోపాలం పాలేర్ని పెట్టుకుందా మనుకున్నాడుగాని తనదగ్గఱ పనిచెయ్యడానికి ఎవడూ ఒప్పుకోలేదు. అందుచేత గోపాలం మగపనీ ఆడపనీ తనే చేసుకోవలసివచ్చింది.

పంపకాలయి సరీగా రెండురోజులే అయింది. రాముడు వీధిలోకి రావడం మానివేశాడు. ఎప్పుడూ ఇంటిపట్టునే ఉండేవాడు. తోచకపోతే అటూ ఇటూ పిచ్చి ఎత్తినవాడిలా తిరుగుతూఉండేవాడు. గంటల తరబడి గొడ్లపాకలో కూర్చునేవాడు. లేచి ఇంట్లోకి రాబోతూ అప్పుడప్పుడు గోపాలంభాగంలోకి పార

పాటున అడుగుపెట్టేవాడు. ఆసమయంలో గోపాలం ఇంట్లోలేకపోతే 'రా! బావా! లోపలికి రా!'అని కేకవేసేది సీతమ్మ. ఈ కేక విని పొరపాటు తెలిసి కొని చటుక్కున వెనక్కి తిరిగి తన భాగంలోకి వచ్చేవాడు. గోపాలం ఇంట్లో ఉంటే ఆ పొరపాటూ జరిగేది కాదు. ఒకవేళ జరిగిందో, ఎదురుమాట రాముడు ఎన్నడూ చెప్పకపోయినా, వీథినిబోయే ప్రతివారూ ఆగేటటు గోపాలం గట్టిగా కేకలు వేసేవాడు.

ఎంత తంటాలుపడ్డా రాముడు గృహాన్ని పాక్షికంగా చూడలేకపోయాడు. ఒక్క గృహ మేమిటి? తన్ను తన పూర్వులతోటీ, తన వంశంతోటీ ఏకం చేసుకుని పెరిగిన అతని మనస్సు తన్ను తానుగా చూచుకోలేకపోయేది. చెయ్యి శరీరాన్ని ధిక్కరించి తెగిపోవచ్చు. ఆ తెగిపోవడంవల్ల శరీరానికి చెయ్యి లేదన్న అప్రతిష్ఠే వస్తుందిగాని తాను స్వతంత్రంగా బతకలేదు. ఈ విధంగా అతని మనస్సు ఊహించి ఊహించి విడివడడంవల్ల తమకు వచ్చే ప్రళయం ప్రత్యణువులోనూ సాక్షాత్కరింపజేసేది. ఒక్కొక్కప్పుడు తాము విడిపోలే దన్నట్టుగానే అతడు అనుకునేవాడు. అటువంటి సందర్భాల్లో బాహిరమైన ప్రతిబంధకాలు పంపకంవిషయం జ్ఞాపకం చేసేవి.

ఒకొక్కప్పుడు బాధ భరించలేక దైవప్రార్థన చేసేవాడు. ఆ ప్రార్థనా సమయంలో అప్రయత్నంగా తన తండ్రి యావజ్జీవమూ ప్రతినిత్యమూ నమస్కరించిన దేవుడున్న గూడు దగ్గఱకు వెళ్లబోయేవాడు. కాని దారిలో తడిక అడ్డుతగిలేది. చటుక్కున చతికిలబడి తన ఊపిరితిత్తులలో ఒకదాన్ని కోసివేసిన బాధతో కుంగిపోయేవాడు. మఱికొన్ని సమయాల్లో అతని సర్వస్వాన్నీ తండ్రి ఆవేశించేవాడు. అటువంటి సమయాల్లో తన తండ్రి కూర్చున్న చోటూ, అతడు వాడిన చెంబూ, అతడు పట్టుకున్న కఱ్ఱా ఇట్లాంటి వాటికోసం తహతహలాడేవాడు. కాని అవి ఏవీ అతని భాగంలో లేవు. అతనికి దక్కింది తండ్రి హృదయం మాత్రమే. భౌతికమైన తండ్రి ఆకారాన్ని జ్ఞాపకంచేసి ఏతద్వియోగబాధ నపనయించే బాహ్య వస్తు వొక్కటీ అతని భాగంలో రాలేదు.

గోపాలాని కీ విచారం ఏమీ లేదు. కాని ఒక్కొక్కరోజు గడిచినకొద్దీ అతనికి సంసారం బరువు ఎక్కువకావడం మొదలుపెట్టింది. పాలేరు లేకపోయినా తనకు కావలసిన పనులన్నీ తనే చేసుకుంటున్నాడు. ఎంత చేసుకున్నా తన్ను అనుకూలించే వాళ్లు ఊళ్లో ఎవళ్లూ లేకపోవడం అతనికి కష్టం అయింది. రెడ్డి ఇచ్చిన పైకం చేతిలో ఉన్నది. ఉన్నా దాన్ని ఖర్చుపెట్టుకోవడానికి వీలులేని పరిస్థితులు వచ్చాయి. తన కాపురం కొత్తది. తానా ఊళ్లో నిలదొక్కుకోవాలి. ఇప్పుడే పైకం ఖర్చుపెట్టితే ముందేం అవసరం వస్తుందో అని దాన్ని దాచిపెట్టాడు. దీనికి తోడు తన భార్య ఎంతసేపూ అన్నపక్షాన వాదించడం కూడా అతనికి ఇష్టమయ్యేది కాదు.

ఉన్నవి ఉండగా పంపక మైన మూడోనాటి నుంచీ అతనికి ఒక కొత్త బెడద వచ్చిపడింది. ఎడ్లలో అతని ఎద్దు చిన్నది కావడంతో అది బెంగపెట్టుకుంది. జతగా మెయ్యడం అలవాటయిన గొడ్డు కాబట్టి ఈ మూడురోజులనుండీ ఒంటరిగా కట్టివేస్తూ ఉండడంవల్ల మేతమెయ్యడం మానివేసింది. కొత్త వదిలితే అదే మేస్తుందని ఒకటిరెండురోజులు ఉపేక్షచేశాడు కాని తర్వాత గూడా అది అట్లాగే ఉండిపోయింది. దిష్టితాడు వేయించీ, నడుంతాడు కట్టించీ తంటాలు పడ్డాడు గాని లాభం లేకపోయింది. తన ఎద్దు ఇలా తీసిపోతూ ఉంటే రాముడి ఎద్దు బాగానే ఉంది. దీన్ని అతడు సహించలేకపోయాడు. తాను దుక్కలాగా ఉంటే తన అన్న రోజురోజుకూ శుష్కిస్తున్నాడే అన్న విషయం అతనికి తోచలేదు. అది తెలిస్తే ఈ ఎడ్ల పరిస్థితి కూడా అర్థమయ్యేది. రాముడి ఎద్దు అప్పుడప్పుడు జత విడిచి పొరుగూరు పోయి పనిచేసి వచ్చేది. అందుకని గోపాలంఎద్దుకు పట్టినంతగా దీనికి జతవిడవడందుఃఖం పట్టలేదు. మొదట్లో రెండుమూడుపూటలు తోడి ఎద్దుకు సాను

భూతి చూపిస్తూ రాముడి ఎద్దు మేత మానివేసినా తర్వాత మామూలుగా మేత మేస్తోంది. అందుచేత రాముడికి తన ఎద్దువిషయమైన ఆందోళన ఏమీ అవసరం లేకపోయింది. కాని గోపాలంఎద్దు పదిరోజులు గడిచేటప్పటికి సగానికి సగం తీసింది. అది ఎప్పుడూ రాముడి ఎద్దువంకే చూస్తూ నిలబడేది. అప్పుడో పరకా అప్పుడో పరకా నమిలినా మనఃపూర్తిగా తినని తిండి ఏం వంటబట్టుతుంది?

రాముడికి దుఃఖం కొంచెం వెనకపట్టింది. ఇప్పుడు ఇదివరకు మాదిరి ఎప్పుడూ ఇంట్లో కూర్చోక బైటికి వచ్చి ఆపనీ ఈపనీ చూచుకుంటున్నాడు. ఊళ్లో పరపతి గల మనిషి కాబట్టి వాములదొడ్డినుంచి మేత తేవడం, పచ్చగడ్డి మోటబావులకింద ఎక్కడైనా ఉంటే తెచ్చుకోవడం మొదలైన పనులన్నీ తాను చేసుకోకుండానే ఇతరులచేత చేయించుకుంటున్నాడు. పనిచేసుకోవడంలో అతని కేమీ కష్టం లేకపోయినా అతని దుఃఖాన్ని తిరగబెట్టే పరిస్థితులు అనుక్షణమూ తటస్థిస్తూనే ఉన్నాయి.

గోపాలంఎద్దు ఇలా శుష్కిస్తూ ఉండడం అతన్ని ఎంతో కష్టపెట్టింది. అది రోజల్లా పోత బొమ్మలా నిలబడి కళ్లవెంబడి నీరుకారుస్తూ ఉంటే చూడలేకపోయేవాడు. దాని ఎదురుగుండా తన పాకలో కూర్చుని తానుగూడా ఏడ్చేవాడు. గోపాలం ఏకారణంచేతనైనా ఇంట్లో లేకపోతే తన ఎద్దును కట్టు ఊడదీసి గోపాలంభాగంలోకి తోలి అక్కడే మఱింత మేత పడవేసేవాడు. దీని జతన ఉన్నంత సేపూ గోపాలంఎద్దుకూడా మేత మేసేది. ఇటువంటి సమయంలో ఒకరోజున గోపాలం చూచాడు. అతనికి ఒళ్లు మండే కోపం వచ్చింది. చేతికఱ్ఱతో రాముడి ఎద్దును కొట్టుతూ 'గొడ్డుమేతకోసం అశుద్ధం తినక పోతే ఏం? దగ్గఱ ఉండి మేపుతున్నాడు పెద్దమనిషి' అని అంటూ పెద్ద గందరగోళం చేశాడు. రాముడు నోరుమూసుకొని కళ్లనీళ్లు గుక్కుకుంటూ దగ్గఱికి వచ్చిన ఎద్దువీపుమీద చేత్తో నిమిరి దానిమీద పడి భోరున ఏడ్చాడు. మఱొకమాటు గోపాలంఎద్దు తాడు తెంపుకుని రాముడి ఎద్దుతో కలిసి మేత మేస్తోంది. రాముడు దాన్ని చూచి మఱింత మేత వాటిముందు పడవేసి రెండు చేతుల్తో రెంటికీ అఱు



"రాముడిఎద్దు అప్పుడప్పుడు జతవిడిచి పొరుగూరు పోయి పనిచేసి వచ్చేది."

(పుట 326)

గోకుతూ కూర్చున్నాడు. ఇదీ గోపాలంకంట పడింది. 'బుద్ధి గడ్డి తినే వెధవలకు ఎన్నిసార్లు చెప్పితే ఏం లాభం! నా ఎద్దుని తీసుకువెళ్లి తన పాకలో ఎవడు మచ్చికచేసుకోమన్నాడు' అంటూ తన ఎద్దును లాక్కుపోయి పెద్ద అల్లరి చేశాడు.

ఇటువంటి సంఘటనలు ప్రతినిత్యమూ రాముణ్ణి కుంగదీస్తూనే ఉన్నాయి. గోపాలంఎద్దు ఏమాత్రమూ కోలుకోక అట్లాగే ఉండిపోతోంది. రాముడు దాని దీనస్థితి చూచి భరించలేకపోయాడు. దాన్ని బాగు చేద్దామని తాను ఏమి చేసినా గోపాలం దానికి దురర్థం కల్పిస్తున్నాడు. తన ఎద్దును గోపాలానికి ఇచ్చేస్తే ఆ ఎద్దు తప్పకుండా బాగుపడుతుంది. కాని తాను

ఈ పని చెయ్యడం తన భార్యకు ఇష్టంలేదు. ఒకసారి తాను ఈ అభిప్రాయం బైటపెడితే 'ఇచ్చుకోండి. ఇద్దఱమూ కొడి బుజాన వేసుకుని పొలం దున్నుదాము' అన్నది. ఆవిడఅభిప్రాయం ఎట్లా ఉన్నా తాను ఇవ్వడానికే సిద్ధపడ్డాడు. కాని ఈ ముక్క తానంటే గోపాలం ఏమంటాడో! దీనికి ఏమి అర్థం కల్పిస్తాడో! మొత్తానికి అతనికి భయంగానే ఉంది. అయినా ఒకరోజున ధైర్యంచేసి చెప్పుదామని నిశ్చయం చేసుకున్నాడు. అప్పుడు గోపాలం గొడ్లపాకలో అతని ఎద్దుదగ్గఱ నుంచుని ఉన్నాడు. ఆ ఎద్దు మేత మెయ్యకుండా రాముడి ఎద్దువంక చూస్తోంది. అటువంటి సమయంలో రాముడు తన ఎద్దుదగ్గఱకు పోయి దాని తలతాడు ఊడదీసి నడుంమీద వేసి బైటికి తోలుతూ 'గోపాలం! నీ ఎద్దు బొత్తిగా పాడైపోతోంది. దీని జతన ఉంటే అది బాగుపడుతుంది. నేను మఱొక జత కొనుక్కుంటాను. దీన్నిగూడా నువ్వు తీసుకో' అన్నాడు. వెంటనే మబ్బులేకుండానే ఉఱుములూ మెఱుములూ ఫెళఫెళార్భటులు చేశాయి. 'నీమూలాన, నీ ఎద్దుమూలాన అన్యాయంగా నా ఎద్దు పాడైంది. పెద్ద ఔదార్యం చూపించవచ్చావు. పుచ్చుకున్న మఱునాటినుంచీ ఊరంతా రెండు ఎద్లూ కాజేశానని నన్ను అనేందుకా! నాకు నీ ఎద్దేమీ అక్కర్లేదు. నేనే మఱో ఎద్దు కొనుక్కుంటాను' అని దూకుడుగా వెళ్లిపోయాడు. రాముడు ఏం చెయ్యగలడు? తన ఎద్దును మళ్లీ గుంజకు కట్టుకున్నాడు.

గోపాలంప్రవర్తన ఇంతటితో ఆగలేదు. అతడు చేసే ప్రతిపనీ, అనే ప్రతిమాటా రాముడి దుఃఖాన్ని మఱింత గాఢతరం చేస్తూనే వచ్చాయి. తన భార్యని అన్నగారి భాగంలోకి వెళ్లవద్దని కట్టుదిట్టం చేశాడు. భర్తకు భయపడి వెళ్లడం అతని ప్రత్యక్షంలో మానినా మేనత్తకొడుకన్న చను వుండడంచేత పెద్దబావపక్షాన ఎప్పుడూ వాదిస్తూనే ఉండేది. ఆ వాదనలు అప్పుడప్పుడు చాలా తీవ్రంగా నడిచేవి. ఆ తీవ్రతలో తరతమభావాన్ని బట్టి గోపాలంప్రవర్తనకూడా ఉండేది. ఒకమాదిరిది అయితే అన్నను తిట్టిపొయ్యడం, కొంచెం ఎక్కువయితే భార్యనీ అన్ననీ కలిపి తిట్టి తిండి తినకుండా లేచిపోవడం, అంతకన్నా ఎక్కువయితే భార్యమీద చెయ్యిచేసుకోవడం- ఇదీ వరస. ఈ వరస రోజు కొకమాటన్నా అన్ని దశల్లోనూ జరుగుతూ ఉంటుంది. ఒక రోజున పొద్దుగుంకేవేళ గోపాలం ఇంటికి వచ్చాడు. అప్పుడు సీతమ్మ రాముడి భాగంలోనుంచి బైటికి వస్తోంది. అప్పటికి రెండు రోజులనుంచీ చంటివాడికి జ్వరం తగుల్తోంది. సీతమ్మకు వకాశం దొరకక వాణ్ని చూడనన్నా చూడలేదు. ఆ పూట పనిమీద గోపాలం పొరుగూరు వెళ్లాడుకదా అన్న ధైర్యంతో పెద్దబావభాగంలోకి వెళ్లింది. సాయంత్రానికి తిరిగివస్తాను, జాగ్రత అని గోపాలం చెప్పివెళ్లాడు. ఎప్పుడు వస్తాడో అని సీతమ్మ భయపడుతూనే ఉంది. తా నిలా బైట అడుగుపెట్టిందో లేదో గోపాలం చక్కా వచ్చాడు. సీతమ్మను చూడడంతోటే గోపాలానికి ఉప్పెనలా కోపం వచ్చింది. అట్లా నిలబడి కళ్లు పెద్దవిచేసి ముఖంకండలు ఉబ్బించి సీతమ్మవంక చూచాడు. తల వంచుకుని మెల్లగా తమ భాగంలోకి వెళ్లింది సీతమ్మ. దీంతో గోపాలంకోపం మఱీ ఎక్కువైంది. సరాసరి లోపలికి వెళ్లి కంచంలో అన్నం పెట్టడానికి వంగిఉన్న సీతమ్మజుట్టు పట్టుకుని పైకి ఎత్తి ఛడామడా రెండుచెంపలూ వాయించాడు. చెంపమీద చెయ్యి అంటిపోయి వాతలు కనబడ్డాయి. ఆ ముఖం చూడకుండానే గోపాలం గిఱ్ఱున వెనక్కి తిరిగి బైటికి పోయాడు. ఏదో అఘాయిత్యం జరగబోతుందని రాముడు అనుకుని కుఱ్ఱవాణ్ని జోకొట్టుతూ ఇవతలకు వద్దామని ప్రయత్నం చేస్తూనే ఉన్నాడు. ఇంతలో దెబ్బ తగలడం, సీతమ్మ ఏడవడం, గోపాలం వెళ్లిపోవడం అన్నీ జరిగాయి. ఏడుస్తున్న కుఱ్ఱవాణ్ని మంచంమీద అట్లాగే ఉంచి రాముడు హడావిడిగా సీతమ్మదగ్గఱకు వెళ్లాడు. రాముణ్ని చూచి 'బావా! రాబోకు-వెళ్లిపో! వెళ్లిపో! నిన్నుగూడా కొట్టుతారు. నేను చూడలేను, వెళ్లిపో' అని బిగ్గఱగా అఱిచింది. రాముడు మఱదలుతల నిమురుతూ కొంచెంసేపు ఓదార్చాడు. 'సీతా! వాడు ఎప్పుడూ ఇలాగే

ఉండడు. వాడి అంతట వాడే మానతాడు. ం వహించాలిగాని నువ్వే ఇట్లా అయితే ఇక నేనేం కావాలి? నేను ఎంత బాధపడుతున్నానో నీకు తెలియదూ' అని అంటూ ఉండగానే ఏడుస్తున్న కుఱ్ఱవాణ్ని సమదాయించడానికి వచ్చిన అన్నపూర్ణ సాధింపుమాటలు వినపడ్డాయి. 'ఈ లెక్కన కుఱ్ఱవాడు గోలపెట్టుతూ ఉంటే వాడిదగ్గఱ కాస్త కూర్చొని చూడదూ? అటు వంటా, ఇటు వీడి సంరక్షణా అన్నీ నేనే చూచుకోవాలిసి ఉండె. అయినా ఎన్నిటికని నేనేడుస్తాను! అయినా వాళ్ల కాపేక్షలుండాలిగాని ఇటు చేసుకున్న పెళ్లామూ లెక్కలేకపోయె-కన్న కడుపు అని ఆపేక్షా లేకపోయె. ఇంతకూ మన అదృష్టం ఇట్లా తగలబడింది. ఏడవకురా వెధవా' అని విసుక్కుంటూ కుఱ్ఱవాడి పిఱ్ఱమీద రెండు అంటించి, వాడు కెవ్వుమనగా ఎత్తుకుని దూకుడుగా లోపలికి వెళ్లింది అన్నపూర్ణ. ఈ మాటలు రాముడి హృదయంలో శూలాల్లా గుచ్చుకున్నాయి. మాఱు మాట్లాడలేక స్తబ్ధుడై నిలబడిపోయాడు. శరపాత శిలాతలాలనడుమ పడి నలుగుతున్న శిరీషపుష్పమువలెనై అతని హృదయం చైతన్యం కోల్పోయింది. ఇంతలో గోపాలం వస్తూ ఉండడం చూచి ఏదో తప్పుచేసినవాడిలా అప్పుడే తెలివివచ్చిన రాముడు తన భాగంలోకి తూలుతూ తడుముకుంటూ వచ్చేశాడు.

ఈ విధంగా ఒకవంక తమ్ముడూ, మఱొకవంక భార్యా తన్ను అనే మాటల్తో జీవితంమీద అసహ్యం పుట్టి దుఃఖభారంతో ఎందుకు వచ్చిందిరా భగవంతుడా అన్నట్టు జీవయాత్ర సాగిస్తున్నాడు రాముడు. పట్టుదలగల గోపాలం ఎన్ని విషమపరిస్థితులు వచ్చినా అట్లాగే నెట్టుకురావాలని ప్రయత్నిస్తున్నాడు. ఎన్ని విషయాల్లో సర్దుకోగలిగినా ఎద్దువిషయంలో మాత్రం గోపాల మేమీ చెయ్యలేకపోయాడు. అది నానాటికి తీసిపోతోంది. ఇంకా కొన్నాళ్లు ఉపేక్షచేస్తే చచ్చిపోతుందేమో అనికూడా అనిపిస్తోంది. చిట్టచివఱికి గోపాలానికి ఎట్లాగైనా దాని సంగతి తేల్చుకోవాలన్న నిశ్చయం కలిగింది. దాని జతకు మఱొక ఎద్దును కొనడం తప్ప మఱే ఉపాయమూ తోచలేదు. ఎద్దును కొనడం అంటే సామాన్యమైన విషయంకాదు. అయిదువందలన్నా ఉండాలి. బండిబాపతు రెడ్డి యిచ్చిన రెండువందలు తప్ప తన దగ్గఱ దమ్మిడీ లేదు. ఏమిటి చెయ్యడం. భార్యనగ లమ్మడానికి తగిన స్వాతంత్ర్యం తన మేనమామదగ్గఱ తనకు లేదు. అందుకని వాటి జోలికి పోగూడదు. ఎదురుగుండా ఆవూ, గేదే కనబడుతున్నాయి. వాటి నమ్మితే కావలసిన పైకం వస్తుంది. కాని మజ్జిగచుక్కకు కరువు వస్తుంది. పల్లెటూళ్లల్లో చల్లచేసి కుడితితొట్లలో అన్నా పోస్తారుగాని ఊరికే అసలు పొయ్యరు. అయినా సరే ఇబ్బంది పడకతప్పదు. అమ్మితీరాలి. అమ్మకపోతే ఉన్న ఎద్దే పోతుందేమో అన్న భయముండె. అదిగూడా పోతే తాను ఎద్దు కొనాలేదు; వ్యవసాయం చెయ్యనూలేదు.

ఈ రోజుల్లో పాడిగొడ్డునీ, పంటపొలాన్నీ అమ్మజూపితే కొనం దెవరు? నిమిషాల్లో నూఱు దగ్గఱనుంచీ నూటఎనభైదాకా పెరిగింది ఆవుఖరీదు. పుల్లారెడ్డి తాను రాకుండా పాలేరును పంపించి 'రెండు వందలు ఇస్తాను ఇవ్వవలసిం'దని కబురుపంపించాడు. గోపాలం ఇంకా వస్తుందేమో అని ఒకరోజు చూచి, ఇంకా ఆశపడడం భావ్యం కాదని వాళ్ల పాలేర్నే కేకేసి తోలుకువెళ్లమన్నాడు. గేదె నమ్మితే నూటఎనభైకంటే ఎక్కువరాలేదు. వచ్చిన సొమ్ముకు ఉన్న సొమ్ము కలిపి తన ఎద్దుకు సమానమైన ఎద్దు కొనాలని భగీరథప్రయత్నం చేశాడు. కాని సఫలం కాలేదు. చిట్టచివఱకు తన ఎద్దుకంటే ఒక గుప్పెడు ఎత్తు తక్కువున్నదాన్ని - నాలుగుకొర్ల ఎద్దును కొనుక్కొని వచ్చి పాకలో తన ఎద్దుపక్క కట్టేశాడు.

ఇంత చేసినా పాపం ఆ యెద్దు బెంగ వదలలేదు. తాను చిక్కినా అది కొత్తఎద్దువంక గౌరవంతోనూ చూచేదికాదు, ప్రేమతోనూ చూచేదికాదు. ఏదో అప్పుడప్పుడు మఱీ అంతగా కడుపులో ఎలికలు దూరితే ఒకపరక ఎంగిలిపడడమేగాని ఆప్యాయంగా తినడమే లేదు. మఱీ అదేం తోలుకుంటుంది! యథా

ప్రకారంగా ఆ ఎద్దు తీసిపోవడంతప్ప అభివృద్ధి సూచన లేమీ కనపడడంలేదు.

## 3

ఇంతలో జ్యేష్ఠమాసం వెళ్లింది. ఆ నెలలో అప్పుడొకవానా అప్పుడొకవానా పడి నేల అంతా చక్కగా పచ్చికపట్టింది. అందుకని ఎడ్లనుగూడా పొలం తోలుతున్నారు. పొలంతోలడం మొదలుపెట్టిన దగ్గఱనుంచీ గోపాలంఎద్దుగూడా కొంచెం బాగుపడింది. ఈ మార్పుకు కారణం పొలంతోలడ మేమాత్రమూకాదు. కాని అందువల్ల దానికి రాముడి ఎద్దుతో పగలంతా కలిసిఉండే అవకాశం వచ్చింది. ఒక్క ఇరవైఏళ్లు జైలులో ఒంటిరిగా చీకటికొట్టులో జీవితం గడపిన వ్యక్తి బైటికి వచ్చినప్పుడు ఎంత ఆనందం అనుభవిస్తాడో అంత సుఖం అనుభవించింది పాప మా ఎద్దు. చిన్నప్పటినుంచీ తనతో ఎదిగిన ఎద్దు తన పక్కన లేకపోవడంవల్ల ఇన్నాళ్లబట్టీ ఎంత మథనపడిందోకాని పాపం తల్త్రాడు ఊడదీసి పొలం తోలడానికి పాకలోనుంచి బైటికి పంపిన దగ్గఱనుంచీ తిరిగి ఇంటికి వచ్చేవఱకూ ఒక్కక్షణం రాముడి ఎద్దును విడిచి ఉండడంలేదు. ఎంతసేపూ దాని ప్రక్కనే నడుస్తుంది. తన శరీరం దాని శరీరాని కొరుసుకునేటట్లు నడుస్తుంది. నెమరువేసేటప్పుడు దాని కెదురుగుండా పడుకుని కళ్లల్లో కళ్లుపెట్టి చూస్తూ ఉంటుంది. ఇటువంటి పరిచయం వచ్చి నాలుగు రోజులు కాకపోయినా అది పోయిన బలం అంతా సంపాదించుకుంది. 'ఉత్సాహం సగం బలం' అన్న మాటలో ఎంత నిజముంది! ఆ జతను చూచిన వాళ్లందఱూ ఎటువంటి జతరా అని ఆశ్చర్యపడకుండా ఉండరు.

తన ఎద్దులో కలిగిన ఈ మార్పుకు గోపాలం సంతోషించకపోలేదు. వ్యవసాయపు దుక్కులు సాగించడానికి ఇంకా పదిరోజులు వ్యవధి ఉన్నది కదా, ఇంతలో ఇది హాయిగా బాగుపడుతుంది అని ఆశపెట్టుకున్నాడు. దాన్ని త్వరగా బాగుచెయ్యాలన్న ఉద్దేశంతో తెలగపిండీ, మడ్డికూడా పెట్టించాలనికూడా అనుకున్నాడు. కాని, తీరా తెప్పించి దాని ముందు పెట్టేటప్పటికి అది వాసనైనా చూడలేదు. పాప మాయెద్దుమనస్థితి ఏమిటోకాని ఇంటికి వచ్చాక ఏవిధమైన మేతా మెయ్యదు. పొలంలో ఆఎద్దుతో కలిసి ఏంమేస్తుందో అంతే. ఈవిషయం గోపాలానికి కొంత నిరుత్సాహం కలిగించింది. కాని ఏం చెయ్యగలడు ? అట్లాగే సమాధానపరుచుకుని ఊరుకున్నాడు. కొత్త ఎద్దు రావడంవల్లనే తన ఎద్దు బాగుపడిందని అతని అభిప్రాయం. ఇంటిదగ్గఱ మేతమెయ్యక పోవడంబట్టి అది సరియైన అభిప్రాయం కాదని తెలుసుకోవలసిఉన్నా తనకు వ్యతిరేకమైన ఊహ రానిచ్చేవాడు కాదు. మొత్తంమీద ఎద్దులో కలిగిన మార్పుకు సంతోషిస్తూనే వచ్చాడు.

అది చెఱువుకింద పల్లాల ఊరు అవడంవల్ల పల్లపుదుక్కులు తొలకరిలోనే ఆరంభించినా చెఱువు నిండేవఱకూ వ్యవసాయపుపనులు ఉమ్మరంగా సాగవు. తొలకరించడంతోనే రాముడు పుల్లారెడ్డిదగ్గఱకు పోయి అతని పొలంలో ఒకరోజు పని చేసి అతని అరక అడిగితెచ్చుకుని తన పొలం దున్నుకున్నాడు. తన ఎకరంపొలానికీ కావలసిన నారుగూడా రెడ్డి పొలంలోనే పోసుకున్నాడు. సాధారణంగా పశువుల విషయమూ, ముఖ్యంగా తన ఎద్దువిషయమూ తెలిసిన వాడు కాబట్టి రాముడు తన ఎద్దుకు మఱోఎద్దుతో జతకలపడానికిగాని, దానిచేత పనిచేయించడానికిగాని పూనుకోలేదు.

గోపాలానికి ఊళ్లో తనకు అట్లాంటి సహాయం లభ్యమౌతుందన్న ఆశ లేదు. అందుచేత గత్యంతరం లేక తన ఎడ్లు రెంటినీ జతకలిపి దున్నుకోవలసిన అవసరం వచ్చింది. పూర్తిగా నాగలికట్టి దున్నడం మొదలుపెట్టకముందు రెంటినీ కాడిగట్టి అలవాటు చెయ్యాలని కఱ్ఱులేని నాగలితో ఒకరోజున ప్రయత్నం చేశాడు. కొత్త ఎద్దుజత గిట్టక గోపాలం ఎద్దు మారాం చెయ్యడం మొదలుపెట్టింది. కోపంవచ్చి నాలుగుదెబ్బలు వేస్తే రెండడుగులు వేసినా ఏమఱుపాటున ఎటో అటు

లాగివేసేది. నానాయాతనా పడి స్వాధీనంలోకి తెచ్చుకుని ఎంత అరిచినా, ఎంత కొట్టినా, ముల్లుకఱ్ఱ పెట్టి ఎంత పొడిచినా అడుగుతీసి అడుగు పెట్టేది కాదు. వట్టికాడి బుజాన వేసి జతను తోలుకువస్తే అలవాటుఅవుతుందని ఇంటివైపుకు మళ్ళవేస్తే కొత్త ఎద్దును తనతోపాటు పరిగెత్తించి మేఘాలమీద ఎగిరి పోయి, ఏ చెట్టుకో కాడి తగిల్చి, మెడతాడు తెంపుకుని భూప్రదక్షిణం చేసి అర్ధరాత్రి ఏ వేళకో యింటికి వచ్చేది. దాంతో పౌరుషం వచ్చి ఎద్దు ఇంటికి రావడంతోటే గోపాలం దాన్ని కోపంతో కొట్టేవాడు. కసి తీర్చుకున్నా ననుకుని రేపు దుక్కిలో దింపితే సరి లాగ కేం జేస్తుందని ధైర్యం వహించేవాడు.

ఆ రాత్రి బ్రహ్మాండంగా వర్షం కురిసింది. గట్లు తెగేటంతగా చెరువులు నిండాయి. ఆబాల గోపాలం పల్లెటూళ్లో అందరూ తమతమ అభీష్టాలు నెఱవేరినట్లు సంతోషిస్తున్నారు. సంస్కారవంతుడైన మానవుడు పరోపకార విషయకంగా ఆర్ద్రమనస్కుడైనట్లు భూమి సమస్తమూ బీజనిక్షేపానికి అనువైంది. నేల యీనినట్లు కర్షకజనం యావన్మందీ పంట పొలాల్లో పనిచేసుకోవడానికి బయలుదేరారు.

తెల్లవారకుండానే మధ్యాహ్నంలోపల తన ఎకరం పొలం ఊడ్చెయ్యాలని రాముడు రెడ్డిఅరక తోలుకుని పొలానికి వచ్చాడు. గోపాలంకూడా తన జతను వెంటబెట్టుకుని రెండుచాళ్లన్నా ఇవాళ దున్నుదామని బయలుదేరి వచ్చాడు. ఉన్న రెండెకరాల భూమికి రెండుజతల ఎడ్లతో వ్యవసాయం చేస్తున్న వీళ్లని చూచి ప్రకృతే నవ్వుతోందా అన్నట్లుగా భళ్లున తెల్లవారింది.

గోపాలం తన జతతో దుక్కి సాగించడానికి తీవ్రప్రయత్నం చేస్తున్నాడు. కాని ఎంత చేసినా లాభంలేకపోతోంది. గోపాలంఎద్దు కొత్తఎద్దుతో ఏ మాత్రమూ సయోధ్య కుదుర్చుకోలేదు. వట్టి నేలపైతే తన యిష్టం వచ్చినట్లు గంతులువెయ్యడానికి అవకాశం ఉండేది. వరిపొలంమడిలో దుక్కి అయిన కారణంచేత బురదనేల అవడంబట్టి అటూ ఇటూ పారిపోవడానికి వీలు చిక్కడం లేదు. గోపాలంఎద్దు ఒక కొత్తవిద్య నేర్చుకున్నది. కొత్తఎద్దుతో జతకలవక అది కొత్త ముందుకు లాగిందంటే ఇది చటుక్కున పడుకునేది. తోక మెలిపెట్టీ, ముల్లుకఱ్ఱతో పొడిచీ, ఇంకా లేవకపోతే ఆ కఱ్ఱతోనే వీపుమీద నాలుగు వేసీ, వీటన్నింటికీ ఊతగా రాముణ్ని ఉద్దేశించిన తిట్లు కలిపీ ఎంతో హైరాణపడగా ఒకసారి లేచేది. చోచ్చో అని రెండడుగులు వేయించేటప్పటికి మళ్లీ పడుకునేది. తానిలా తన దుక్కితో నానా తిప్పలూ పడుతూఉంటే తన పక్కనే రాముడు ఏ కష్టమూ లేకుండా పొలందుక్కి పూర్తిచేసుకో



"గోపాలంకూడా తనజతను వెంటబెట్టుకొని రెండుచాళ్లన్నా ఇవాళ దున్నుదామని బయలుదేరి వచ్చాడు."

వడం చూచి సహించలేక కోపం మఱీ ఎక్కువై ఒళ్లు తెలియకుండా బాదడం సాగించాడు గోపాలం.

గోపాలంమనసులో ఒక పుట్టీపుట్టని ఊహ. తాను పడే కష్టమంతా చూస్తూ తనకంటే వ్యవసాయంలో ఎక్కువ అనుభవమున్న రాముడు తాను అడగకపోతేమాత్రం ఎందుకు సహాయం చెయ్యకూడదు! కాని యీ యూహ రూపుకట్టనివ్వకుండా అతని వ్యక్తిత్వం అడ్డునిలిచేది. వెంటనే వాడేమిటి, నాకు సహాయం చేసేదేమిటి అనే ధోరణి ప్రబలి అంతా తనే చేసుకోవాలన్న పట్టుదల తోచి, నిర్వహించుకోవడానికి ఉపాయం తట్టక అసమర్థతా పారవశ్యదూషితమైన ఈ ప్రవర్తనలో పడిపోయాడు గోపాలం. గోపాలాన్ని చూస్తే రాముడికి జాలీ కలుగుతోంది, కోపమూ వస్తోంది. తమ్ముడికి సాయం చెయ్యాలన్న భావం అతని మనస్సులో ఎప్పుడూ గాఢంగా ఉంటుంది. కాని చెయ్యబోతే అతడు దానికి ఏ అర్థం చెప్పి తన్ను దూషిస్తాడో అన్న భయంమాత్రం వెంబడిస్తుంది. అందుచేత జంకుతాడే కాని అసలు చెయ్యకపోవడం అతని స్వభావంలో లేదు. ఇప్పుడు గోపాలం ఎద్దువల్ల పడుతున్న యాతన చూచినదానికంటే గోపాలం ఎద్దును పెట్టుతున్న యాతన చూచి అణుమాత్రం సహించలేకపోయాడు రాముడు. ఈసారి గోపాలం ఉగ్రం చూస్తే ఎద్దునెత్తురు కళ్లచూస్తాడా అనిపించింది. రాముడి గుండె దడదడలాడింది. చటుక్కున కఱ్ఱు లోతుగా గ్రుచ్చి, దుక్కి ఆపివేసి వెనక్కు తిరిగాడు. గోపాలం ఇంకా కొట్టుతూనేఉన్నాడు. ముల్లుకఱ్ఱ చేత్తో పుచ్చుకుని చకాచకా నాలుగడుగులు వేసి ఎద్దుదగ్గఱకు పోయాడు రాముడు. గోపాలం ఎత్తిన కఱ్ఱ ఎత్తినట్లే ఆగిపోయాడు. రాముడిలా వస్తాడని అతనెన్నడూ అనుకోలేదు. రాముడు సరాసరి ఎద్దుదగ్గఱకు పోయి దాని వీపుమీద రాస్తూ, ముఖంలో ముఖం పెట్టి చూచి కళ్లనీళ్లు పెట్టుకున్నాడు. ఒళ్లంతా వాతలు తేలిఉంది. వానిమీద చెయ్యివేసి, దాని కళ్లల్లో చూస్తే తన శరీరంలో ప్రతినరమూ ఉబికి వాతలు తేలి కలుక్కుమన్నట్టయింది. ఆ బాధ భరించలేకపోయాడు. ఒక్కమాటు దాని ముఖంమీద ముఖం పెట్టి ఏడ్చాడు. దాని మెడమీద పెట్టిన తన చేతికి కాడికట్టు తగిలింది. అప్పుడు తెలివివచ్చి మెడతాడు వదిలించి కాడి ఊడదీసి గట్టున పెట్టాడు. గోపాలం ఏం చెయ్యడానికీ తోచక ఎత్తిన కఱ్ఱ దించి కాసేపు నుంచున్నాడు. రాముడు ఎద్దును నుంచోపెట్టాలని తోకమీద నిమిరి జబ్బ చరుస్తున్నాడు. అది లేవడం లేదుగాని కలత నిద్రలో మనిషి ఉలిక్కిపడ్డట్టు కదులుతోంది. రాముడికికూడా ఏం చెయ్యడానికీ తోచలేదు. చెఱువుకట్ట అంచున మొలిచిన పచ్చిగడ్డిపరకలు కోసి తెచ్చి అరచేతుల్లో పెట్టుకుని దాని కెదురుగా కూర్చున్నాడు. గోపాలం ఒకచోట నిలబడలేకపోయాడు. రాము డక్కడుండగా ఎద్దుదగ్గఱకు పోలేకపోయాడు. చిరాకెత్తి ఒళ్లుతెలియనివానిలాగా పొలంగట్ల వెంబడి చకచకా నడవడం మొదలుపెట్టాడు.

అప్పటికి ఝాముపొద్దెక్కింది. ఎఱ్ఱగుడ్డ కట్టిన కూడుదుత్త నెత్తిన పెట్టుకుని పొలంకాపునకు అన్నం తెచ్చిపెట్టే కాపుపడుచువలె సూర్యుడు చెఱువుకట్టపైకి వచ్చాడు. బాలసూర్యకిరణచిత్రవర్ణసమాక్రాంతములైన శాద్వలభూములు సత్యకాలంలో కృషీవలుడు స్వయంకృషిచేత సంపాదించిన మంచి బంగారపు మేలిమికాంతుల భ్రాంతిమాత్రమే కల్పిస్తున్నాయి. కాని యిది సత్యమునందసత్యభ్రాంతియేమో అని అనిపిస్తోంది. ఆ కాంతులవెంబడి రాత్రి చల్లదనము సర్వస్వమూ తొలికోడికూతలో కోల్పోయిన ఎద్దుమెడలోని కంచుగంట సుస్పష్టశ్రావ్యనినాదములు వినవచ్చినవి. చెఱువుతట్టులోకట్టున మేత మెయ్యడానికి ఊళ్లో గొడ్లన్నీ అప్పుడప్పుడే వస్తున్నాయి. రాముడి ఆవూ, గేదెకూడా వచ్చాయి. ఆవు చెఱువుకట్ట ఎక్కి మడిలో పడుకున్న ఎద్దునూ, ఎద్దుదగ్గఱ కూర్చున్న రాముణ్నీ చూచి అరిచింది. ఆ అరుపుకు గోపాలంఎద్దు ప్రతిధ్వని చేసింది. అటూ ఇటూ తిరుగుతున్న గోపాలం ఒకసారి ఆవువంకా,

ఒకసారి తనఎద్దువంకా చూచి ఆగాడు. అంతలో మళ్లీ పచార్లు మొదలుపెట్టాడు. ఆవు చెరువుకట్ట దిగి మడిలోకి రాబోతోంది. గోపాలానికి చిరాకు ఎక్కువైంది. దూకుడుతో అటూ ఇటూ నడవడంలో రాముడి మడిలో మెడమీది కాడితో బురదనేలలో దిక్కులు చూస్తూ దవడలు ఆడిస్తున్న రెడ్డిగారి ఎడ్ల జత గోపాలంకంట బడింది. అతడు సరాసరి దాని దగ్గఱకు పోయాడు. అనాలోచితంగా మెడకట్లు వదిలించి కాడి ఊడదీసి గట్టున పెట్టాడు. ఎడ్లు రెండూ రెండడుగులు వేసి మడిదాటి రోడ్డుమీదికి వచ్చాయి. గోపాలం వాటివెంబడే వెళ్లాడు. ఎదురుగుండా రాముడి ఎద్దు వస్తూ వీటిని చూచి అరిచింది. అది దూకుడుగా చెఱువుకట్టమీదికి వెళ్తోంది. గోపాలం ఎడ్లను తోలుకుని ఊళ్లోకి వెళ్లిపోతున్నాడు.

చెఱువుకట్ట ఎక్కి రాముడి ఎద్దు మడిలో గోపాలంఎద్దును చూచి గట్టిగా అంభా అని అరిచింది. గోపాలంఎద్దుకూడా దీనివంక చూచి అంభా అని మళ్లీ అరిచింది. రాముడి ఎద్దు ఒక్క అంగలో మడిలోకి ఊరికింది. గోపాలం ఎద్దు ఒక త్రుటిలో లేచి నిలుచుంది. త్రవ్వుతున్న భావిలో జల పొడిచినట్లు రాముడి మనస్సులో ఉత్సాహం పరవళ్లుద్రొక్కింది. రెండెడ్లూ ఒకదాని మూతి మఱొకదానికి ఆన్చుకుని దీర్ఘకాలవియోగదుఃఖ మలినకథాప్రసంగములతో ఓదార్పుపొందాయి. ఒకదాన్ని ఒకటి వెంబడించి గట్లనున్న గడ్డిపరకలు కొరికాయి. ఒకొక్కక్షణం ఆగి ఒడళ్లు ఒరుసుకోగా గాఢపరిష్వంగసౌఖ్యం అనుభవించాయి. రాముడు వాటివంకనే అనిమీలిత దృక్కులు ప్రసరిస్తూ ఆనందతన్మయుడై నిలబడ్డాడు.

అరగంట గడిచింది. ఎడ్లు మేత మాని మువ్వలు లేని బొణుగుపట్టెడ మ్రోగగా దవడలు ఆడిస్తూ నిలబడ్డాయి. రాముడు కాడి తీసి వాటి బుజాన వేశాడు. అప్పటి కింకా ప్రొద్దు నడినెత్తికి రాలేదు. ఇంకా గజంనీడ పడుతూనే ఉంది. వేసవికాలం కాబట్టి ఇళ్లకు పోవలసిన సమయం. ఎండవేడి ఎక్కువగానే ఉంది. కాని కాడి బుజాన వేసుకుని ఎడ్లు ఊరికే నుంచోక నడక సాగిస్తూ ఉండడం చూచి రాముడు అనాలోచితంగానే మేడికోలు కాడికి బిగించి నాగలికొమ్ము చేతబుచ్చుకున్నాడు. దుక్కి సాగిపోతోంది. అరఘడియలో చాలుదుక్కి పూర్తిఅయింది. ఎడ్లు మహదావేశంతో ముందు నడుస్తున్నాయి. రాముడు ఉత్సాహంతో దుక్కి పగ్గం పట్టుకు నడిపిస్తున్నాడు. దుక్కి రెండుచాళ్లూ కలపడం అయిపోయింది. ఎడ్లు వాటి అంతట అవే ఆగిపోయాయి. రాముడు తలయెత్తి చూచాడు. ప్రొద్దు నడినెత్తికి వచ్చింది.

కాని కాలం వేళమించిపోయింది. ఇక ఉండడానికి వీల్లేదు. రాముడు వెంటనే కాడి ఊడదీసి ఎడ్లను విడిచిపెట్టాడు. ఎడ్లు జంటవిడవకుండా ముందునడవడం మొదలుపెట్టాయి. రాముడు తన మడిలో ఎడ్లకోసం చూచాడు. ఎడ్లను ఊడదీసి గోపాలం తోలుకువెళ్లడం రాముడు గమనించనేలేదు. ఇప్పు డక్కడ ఎడ్లు కనబడకపోవడంతో అతడు ఒక్కక్షణం నిర్ఘాంతపోయాడు. తన తమ్ముడి ప్రవర్తన ఇంతలో ఇట్లా మారుతుందని అతడు అనుకోలేదు. రాముని స్వభావంలో మాలిన్యం లేకపోయినా తమ్ముని ప్రవర్తన అతని మనస్సులో తెచ్చిపెట్టిన కష్టంవల్ల గోపాలం ఈపని చెయ్యడం ఇంకెందుకైనా యేమో అన్న అనుమానం రాకపోలేదు. కాని అతని సహజ సుస్వభావం తలయెత్తి ఈ ఊహను నిలవనియ్యలేదు. ఎడ్లు ఉల్లాసంతో జతగూడి నడుస్తున్నందుకు సంతోషమూ, గోపాలంప్రవర్తన అర్థం కాక అభావమూ పునఃపునః పర్యాప్తములై అతని మనస్సుమీద రాజ్యం చేస్తున్నాయి. మండుటెండలో పండువెన్నెలలోవలె ఎడ్లవెంబడి రాముడు ఊళ్లోకి నడక సాగించాడు.

గోపాలం రెడ్డిగారి ఎడ్లను ఆయన కప్పజెప్పి ఇంటికి చిరాకుతో వచ్చాడు. భర్తచిరాకూ, విసుగూ చూచి సీతమ్మకు నోట మాటరాలేదు. ఏమనడానికీ తోచక చల్లని నీళ్లుమాత్రం తెచ్చి ఎదురుగుండా బెట్టి లోపలికి వెళ్లిపోయింది. అన్నపూర్ణ ఉదయంనుండీ వంట ఇంట్లో పనులు ఒకదానివెంబడి ఒకటి తలపెట్టు

కోవడంవల్ల తీరక యాతనపడుతోంది. కుఱ్ఱవాడు రంగయ్య ఆలస్యంగా పడుకోడంవల్ల చాలాసేపే నిద్రపోయాడు. కాని పదిగంటలయేటప్పటికి నిద్రలేచి అప్పుడప్పుడు గుక్కపెట్టి ఏడవడం మొదలుపెట్టాడు. సీతమ్మ వీలుమాచుకుని అన్నపూర్ణకు తెలియకుండానే పిల్లవాణ్ని తీసుకుందామని ప్రయత్నం చేస్తోందేకాని ఆమెకు కూడా తీరలేదు. ఇంతలో గోపాలం రానే వచ్చాడు. గోపాలాన్ని చూడ్డంతోటే సీతమ్మకు ఈ ఊహ కాదుగదా ఏ ఊహా తోచలేదు. కాని అంతలో పిల్లవాడు గోలపెట్టడం మఱీ ఎక్కువైంది. ఆ ఏడ్పు వినబడడంతోటే ఎన్నడూ కదలని గోపాలం కూడా మనసులో ఒక కదలిక పొందాడు. అమాంతంగా లేచినుంచున్న భర్తను చూచి సీతమ్మ హడిలిపోయింది. కాని గోపాలం చరాచరా అటూ ఇటూ ఒకసారి నడిచి 'ఆలెక్కన ఏడుస్తుంటే వినపడటం లేదూ? కదలవేం' అని అంటూ సీతమ్మను చూచి కళ్లు పెద్దవి చేశాడు. సీతమ్మకు ఈ విధమైన భర్తప్రవర్తన ఏమీ అర్థంకాలేదు. ఆమాటల్లో ఎంత నిజమో, ఎంత అబద్ధమో తోచలేదు. వెళ్లడానికీ, ఉండడానికీ కూడా భయం వేసింది. 'నీకు కాదూ చెప్పేదీ' అని అంటూ గోపాలం మధ్యనున్న తడికను ఒక తన్ను తన్నాడు. తన్నుతా తెలియని పారవశ్యంలో క్రిందబడ్డ తడికను తొక్కుకుంటూ సీతమ్మ పరుగెత్తుకునిపోయి పిల్లవాణ్ని తీసుకుంది. అన్నపూర్ణ తడికపడ్డ చప్పుడు విని బైటికి వచ్చి ఆశ్చర్యపడి నిలబడింది.

తల లాడిస్తూ, బొణుగుల చప్పుడు ఒయ్యారంగా చేసుకుంటూ కలిసిమెలిసి పెరిగిన అన్నదమ్ముల వలె ఎడ్లజత లోపల అడుగుపెట్టింది. గోపాలం ఆ రెండెడ్లనూ తలపగ్గాలు లాగి ఒకచోట కట్టి మేత వేశాడు.

బుజంమీది కాడితో రాముడు వచ్చి ఎడ్లను కట్టుతున్న తమ్ముణ్ని చూచి విస్తుపోయి నిలబడ్డాడు. ఎడ్లను కట్టిన గోపాలం వెనక్కితిరిగి అన్నను చూచి 'రెండు ఝాములయేదాకా పొలంలో ఏం చేస్తున్నట్టన్నయ్యా! ఎండ మండిపోవడం లేదూ?' అని అన్నాడు.

తండ్రి పోయిన ఇన్నాళ్లకు రాముడి ముఖంలో సౌభ్రాతృ సౌఖ్యసూచక మందస్మితము వికసించింది.



# చోర - మీమాంస



= శ్రీ రామకృష్ణశాస్త్రి =

తల్లికడుపు చలువను మానవుడు భూమి మీద పడి పదికాలాలూ బ్రదికి బట్ట కట్టేందుకు దేవతలు దీవించి మనసారా యిచ్చిన మొదటివరం దొంగతనం.

లోకమంతా తనది - సృష్టిలో రక రకాల సింగారాలూ, విలాసాలూ, విజృంభ ణాలు తనకూ, తన జాతికి అంతటికీని అను కుంటూ మననేర్చిన మానవుడికి...తనకు ఎక్కువగా మక్కువ నిలిచిన ఏవస్తువుమీద నైనా చూపు సూటిగా నిలిచి, అది తన ఒక్కడి సొత్తే అయితే బాగుండునని ఏనా డైతే అనుకున్నాడో, ఆక్షణంలో దొంగ తనానికి అంకురార్పణ జరిగింది: తనది అను కున్నదానిమీద పరాయివాడికి కూడా ఎప్పుడైతే మమత మిక్కుటమైందో - వీలు కొద్దీ, దొంగతనం జరిగింది.

'దొంగా మనిషివంటివాడే!'- దొంగ తనమనేది తాత్కాలిక మానసిక అవస్థనూ, నిర్వహణాన్నీ సూచించేదేకాని - శాశ్వత మైన వైకల్యాన్ని నిరూపించ దన్నమాటే కదా: దొంగతనం చేయకపూర్వం దొంగ మామూలు మనిషే; ఔనా?

దొంగతనం, సూతకంలాగా, వెల్లడి అయిన క్షణాన అమలులోకి వచ్చేదే కాని, దానికి ప్రత్యేక సత్తా లేదు: 'దొంగతనం చేసినందుకు కాదు తమరు నాకు ఈశిక్ష విధించుతూన్నది: దొంగతనం చేసి నిభా యించుకోలేక, పట్టుపడినందుకు!' అని వెను కటికి ఒక చోరాచార్యుడు న్యాయాధికారికి తత్వం ఉపదేశించ లేదూ?

పండితుడివలె, వనితవలె, లతవలె - ఆశ్రయం లేనిదే, దొంగతనానికి - రాణింపు సంగతి దేవుడెరుగును కాని - అసలు ఉనికే లేదు: దొంగతనం చేశాడని రుజువుచేసి, ఒక మనిషిని ఎటూ మెసిలేందుకు వీలులే కుండా తీసుకువెళ్లి ఒకచోట ఎంతో కొంత కాలము నిర్బంధించి ఉంచితే - వాని కనీసపు పౌర - హక్కు అయిన చౌర్యధర్మానికి స్వాతంత్ర్యం అరికట్టినట్లు అవుతుంది - దొంగ తన్ను తానే దొంగిలించుకో లేడు గనుక:

దొంగతనం స్వరూప నిర్ణయం యుగ ధర్మాన్ని అనుసరించి మారుతూ ఉంటుంది. అందువల్లనే ఒక్కొక్క తరుణంలో, పండిత సదస్సూ, సంప్రదాయమూ దొంగతనమని నిర్ధారించినదానిని, కర్త అలా అంగీకరించని సందర్భంలో ధర్మగ్లాని సంభవించే ప్రమాదం

---

* చోరసంహితా భూమిక.

ఉత్పన్నమౌతుంది. కనుక దొంగతనం నిర్వచనము సర్వకాలములకు రూఢికాదు: ఎవడి చేతనైనట్టు వాడు దొంగతనం చేయడానికి అధికారం లేదు. కారణం - దొంగమొగం, దొంగ చూపులు అనే సమాసాలు వ్యాకరణదుష్టములు కాకపోయినా పూర్వపదాలకి అర్థం సాధించడం అసాధ్యం. ఎవడూ 'దొంగ' లాగా ఉండడు: దొంగతనంచేసి పొరబాటున పట్టుబడ్డ ఏ ఎల్లయ్యలాగానో, పుల్లయ్యలాగానో కనుముక్కుతీరు ఒకవేళ ఉంటే ఉండునుగాక.

దొంగలకు పా: ,అనవసరం: మాన ప్రాణధనములు మూడుకూడా ఐహికానికి చెందినవేకాని ఆముష్మికం దాకా మెట్లు కట్టేవి ఎంత మాత్రమున్నూ కావు: ప్రాకృతులలో కొందరికి మానమే ధనము: కొందరికి ధనమే ప్రాణము: ఈ త్రికంలో ధనమే కడగొట్టుది. అయితే మానం పోయినా, ప్రాణం పోయినా ధనం పోదు: కాని, ధనం పోతే ప్రాణం పోవడం బహుళమని కనబడుతూన్నది: మానానికీ, ప్రాణానికీ కన్న ప్రాణానికీ, ధనానికీ మెక్కువ లంకె. ధనం దొంగిలించినందువల్ల యాదృచ్ఛికంగా పోవడమంటూ జరిగినా, దొంగకు ఆ పాపం అంటదు.

దొంగఅంతటి లోకకల్యాణ - చింతనుడు మరిఒకడు సృష్టిలో ఉండబోడు. లోకులందరూ మోయలేనంత ధన భారంతో అలసి - సొలసి, ఆదమరచి, ప్రమత్తులుగా ఉండాలని ప్రార్థించుతూ ఉంటాడు.

దొంగతనానికీ, సంధ్యావందనానికీ చాలా సంబంధం ఉంది: 'అహరహస్సంధ్యా ముపాసీత' అనేదే దొంగలకూ బ్రహ్మోపదేశం. సంధ్యావందనం మల్లేనే మానేస్తే ప్రత్యవాయదోషం ప్రాప్తించటం కద్దు: అది కేవలమున్నూ గాలిలోనే నిలిచి పోకుండా, తత్క్షణం వంటపట్టి వ్యాధిరూపేణ పీడించడమున్నూ కద్దు: తల్లి బంగారము కదా అని దొంగిలించకుండా ఊరుకున్న అగసాలెబత్తుణ్ణి ఆ దోషం కడుపునొప్పై పట్టి పల్లార్చిందని లోకవిదితము. కనుక, భక్తి ఏమాత్రము తప్పినా, ఫలం తప్పడం ఒకటేకాకుండా, లేనిపోని పీడ మెడకు చుట్టుకుంటుంది.

దొంగతనం శాస్త్రమూ, కళా? అనే విచికిత్స క్రీస్తుపుట్టక పూర్వంనుంచీ ప్రవర్తిల్లుతూన్నది: పూర్వాచార్యులు కొందరు దీనికి శాస్త్రగారవాన్ని మాత్రమే ఇచ్చారు. దీనికి ప్రవర్తకుడైన కుమారస్వామి ఎన్నడూ ఈకళను వినియోగించినట్లు నిదర్శనం లేదు గనుక. అంతమాత్రాన యిదే సిద్ధాంతం అనడానికి వీల్లేదు. కేవలం శాస్త్రంగానే, గ్రంథాల్లోనూ కొందరు మహానుభావుల హృదయాల్లోనూ నిలిచిపోయి ఉంటే లోకానికి ఉపయోగకారి కాలేకపోయేది. మనోవికాసానికి.....ఆత్మవికాసానికి తోడ్పడే బ్రహ్మవిద్యల ఛాయాలో జేరి కాలక్రమేణ చిదంబరరహస్యంగా తయారయేది.

కనుక దొంగతనం కేవలం శాస్త్రమే కాదు: అది ఒక కళ - అనేవాదం బయలుదేరడం సమంజసమేకదా: అయితే, పరిగణ

నీయముకైన అరవై నాలిగింటిలోనూ దీనిని పూజ్యపాదులు ఎందుకు జేర్చలేదూ అని పూర్వపక్షంవారు అనవచ్చును. ఆ జాబితాలో చేరలేదు గనుక దీన్ని కళ అనేందుకు వీలులేదని వారు వాదించ వచ్చును. దీనికి ఆచార్యులు చెప్పిన సమాధానం ఏమంటే - ఆ అరవైనాలుగున్నూ కేవలం లలిత-కళలు: దొంగతన మనేది అంత నీరసమైనది కాదు: యిది ప్రచండమైన కళ: దీనికి స్థాయి శృంగారంకాదు - అదే కారణం అని. ఈ సమాధానం సబబౌను: దొంగతనం ఉత్కృష్టమైన కళ: అధికారి సామర్థ్యమును బట్టి - నిర్వాహణము ననుసరించి ఎప్పటికప్పుడు క్రొత్త పూతలు విరిసే కల్పశాఖి.

దొంగతనం లోక కల్యాణంకోసం వెలసిన కళ: - లోకాన్నంతా ఏకాపోశనం పట్టి ఎవరికీ అందులో రేజా చేజిక్కకుండా దాచుకోమని, మానవుణ్ణి, స్వార్థం ఎప్పుడూ ప్రేరేపించుతూ ఉంటుంది: దానికి ఘాటైన విరుగుడు దొంగతనం:

రామరాజ్యం - అలా దొంగలూ తోడుబోతులూ లేకుండా కలకాలం వర్ధిల్లినా ఊరూ పేరూ లేకుండా కాలగర్భాన కలసిపోతుందని, రావణుడు, రాముడిమీద దయతలచి అసలుకే ఎసరు పెడితేగాని వెష్టపుట్టదని రాముడి పెళ్లాన్నే దొంగిలించాడు:

దేవతలందరూ క్షేమంగా ఉండాలని విష్ణువు టెక్కుచేసి అమృతాన్ని దొంగిలించాడు: వీళ్లందరూ లోకంయోగక్షేమం కోసం చేసిన పనులేకా ఇవి:

వెనుకటికి యూలిసిస్ తాతగారు అంత గజ-దొంగకాకుండా ఉండి, ఆమహానుభావుడు మనుమడిని ఒళ్లో కూరోపెట్టుకుని ముద్దూ మురిపెంగా, ఒడుపుగా చేద్దెబ్బకొట్టడం నేర్పకపోయినట్లయితే ప్రతిపక్షులు యెన్ని సంవత్సరాలు తలక్రిందులుగా తపస్సు చేసినా, ట్రోజన్ వీరుల సిగపూ వాడేదా? ట్రాయ్‌నగరం నేలపాలయేదా?

దొంగతనం కళ అని సిసలుగా నిర్ధారించాము కనుక - దొంగలను గురించి మీమాంస చేద్దాము ఇక:

ఉత్తమ - మధ్యమ - అధమ అధికారిభేదముచేత దొంగలు మూడు దర్జాలుగా వేర్పడుతూన్నారు.

దొంగలకు ఆర్షేయ పౌరుషేయములు ఉన్నవి: వర్ణ ఆశ్రమధర్మములు ఉన్నవి. ఇంటిదొంగకు ఈశ్వరుని కన్నుమొరగే చాకచక్యము ఉన్నా, కన్నానపోయి కన్నాన రానేర్చిన గజదొంగకన్న కులంలో తక్కువవాడౌతాడు.

దొంగలకు కక్కుర్తి అనేది ఉండకూడదు. ‘ ఏమయ్యా పట్టపగలే, దొంగతనము చేస్తున్నావు ’ అంటే ‘ నాకక్కుర్తి నీకేం తెలుస్తుంది ’ అని జవాబు చెప్పే ఘటికుణ్ణి ధీరుడుగా పరిగణించేందుకు వలనుపడదు - మర్యాదాతిక్రమణం చేస్తూన్నాడు కనుక:

దొంగ మామూలు మనిషికన్న.... గృహస్థుకన్న...ఎన్నో రెట్లు ఎక్కువవాడు- ఘాయాలో, తాహతులో: అందుకనే ప్రతి

దొంగా మనిషికావడానికి వీలున్నది కాని, ప్రతిమనిషీ దొంగ అయేందుకు ఆస్కారము ఎంతమాత్రమున్నూ లేదు అని అభియుక్తు లంటారు: ఈ వెలుగులో ' దొంగా మనిషి వంటి వాడే ' అనే లోకోక్తిని సమన్వయిం చుకోవాలి.

పట్టపవలు దొంగతనం చేసేవాడికి కులంలో వెలి: గుహ్యమ్ - గుహ్యతమమ్ అయిన చోరతంత్రము అజ్ఞులబారి పడి పాటవము చెడిపోకుండా ఉండాలని, తన చేతులు ఏకలాపములో ఉన్నదీ, తన కన్ను లకే కానరాని కటికచీకటిలో ఉత్తమచో రుడు తంత్రాంగము నెరపవలెనని దేవి ఆది కాలమునాడు అనుశాసించింది.

దొంగలందరూ శైవులు: దుర్గ వారికి ఇలవేల్పు: కుమారస్వామి కులపు - పెద్ద: కొలిచినవారికి కొంగు బంగారమయే ఆతల్లి వాళ్లకు, గాలిబరపిడికైనా సడీ చప్పుడూ అలికిడికానీయని అడుగులూ, చీకటిలో పట్ట పవల్లే చూసే చూపులూ, అణిమా - గరి మాశక్తి ప్రసాదించిన వరములు: దొంగ లంటే దేవికి కన్నబిడ్డలంత మక్కువ: కార్యరంగానికి బయలుదేరేటప్పుడు మొక్కు లందుకుని దీవెనలిచ్చి పంపుతుంది: దిగ్వి జయం చేసివచ్చి, వాళ్లు కొల్లలాడి తెచ్చిన దానిల్లో దేవికి ముడుపు చెల్లించి మరీ పోతారు: కనుక అమ్మవారి సొమ్మంతా.... నిరాక్షేపంగా దొంగసొత్తు: కుమారయ్య తల్లిచాటు బిడ్డడు; ఆమెఆస్తికి ఉత్తరత్ర వారసుడు కనుక అతనికి వేరేవాటా అంటూ పెట్టే ఆచారం లేదు:

దొంగల నిజాయితీ జగత్ప్రసిద్ధం. పాలు - పంపిణీలు తెగక తర్జనభర్జనపడటం కాని, అత్యాశకు పోవడంకాని, తన వాటాకు వచ్చేదానికన్న ఒక్కపైసా ఎక్కువ కోరడంకాని సద్వంశసంజాతులైన దొంగల విషయంలో ఉండదు: అలా జరిగి నట్లు చరిత్రలో దృష్టాంతములున్నూ లేవు: సిసలైన దొంగ ఎప్పుడూ ఒక్కటే మాటకు కట్టుబడి ఉంటాడు.

అయితే, యీపట్టున కొందరికి యీ అనుమానం తోచవచ్చును: దొంగఎన్నడూ అబద్ధాలు ఆడడా? అని: దీనికి నిష్కర్షగా జవాబు - ఆడడు.

ఈసిద్ధాంతాన్ని రెండు రకాలుగా సాధించవచ్చును. ఆ రెండు మతములున్నూ విపులంగా క్రింద ఉదాహృతములు అవు తూన్నవి.

' దొంగాబద్ధాలు ' అనే ప్రయోగం లోకంలో కనబడుతూన్నది

దొంగ (యొక్క) అబద్ధాలు.

దొంగ (పైన) అబద్ధాలు.

మనకు - అంటే ప్రాకృతులకు సం బంధించినంతవరకూ, దొంగ - యొక్క - అబద్ధం=నిజం. దొంగ - పైన - అబద్ధాలు = నిజాలు: కనుక, మనకు సత్యసాక్షాత్కారం చేసేందుకు ఆతని వాక్కు వినియోగపడు తూన్నది.

" దొంగ, ' అబద్ధీకుడు ' " అని కూడా లోకంలో వాడుకలో ఉన్నదే కదా!

దొంగ=' అబద్ధీకుడు ' అని కొందరు అంటారు.

దొంగ (యు), అబద్ధీకుడు (న్నూ) అని మరికొందరు అంటారు.

దొంగ అబద్ధాలకోరు అని రూఢి అయిపోయినట్లయితే, పునరుక్తి ఎందుకు? - అలా కాదు, దొంగమాత్రమే కాకుండా అబద్ధీకుడున్నూ అని అంటారా, ఈ రెంటికీ సాపత్యం ఏమిటి, ఈయిద్దరినీ ఒకే గణంలో ఎందుకు పారవేశారు? - అనే రాద్ధాంతం వస్తుంది: పశువును, వేశ్యను మనువు జత గూర్పలేదా, ఆపద్ధతే యిక్కడా వర్తిస్తుంది అంటారా, పరస్పరాశ్రితమైన సమానధర్మం అంటూ ఒకటి ఉండి తీరాలి: లేదు గనుక అలా అన్వయించుకోవడం ఇక్కడపొసగదు.

కొంచెం డొంకతిరుగుడుగా ఉన్నా రెండుమతాలూ చివరకు ఒకటేసిద్ధాంతానికి వస్తూన్నవి : ఏతావతా తేలిందేమంటే, యీ ద్రావిడ ప్రాణాయామంలో, దొంగ అంటే అబద్ధీకుడు అని సర్వకాల సర్వావస్థల యందున్నూ రూఢిగా అర్థంచేసుకునేందుకు శాస్త్రం అనుమతించదు అని :

దొంగశబ్దము ఆంధ్ర గీర్వాణరూపాలలో కొన్ని తరుణాల్లో ప్రకరణాన్నిబట్టి, లక్షణార్థంగా, శ్లేష వాచకము. 'అమ్మ దొంగ!', చోర-సురతము ఇత్యాదులు ఉదాహరణములు—అంటున్నారు వాగనుశాసనులు కొందరు : అయితే, ఇక్కడ కొంత తికమకఉంది : 'దొంగకు కన్నెర్ర' అనే భయంలో, ప్రాణపదంగా కాపాడుకుంటూన్న వాటిని తన చాతుర్యం మెరయించి కాజేయగలిగిననాడే దొంగ అన్వర్థాభిధానుడు ఔతున్నాడు కాని, 'వచ్చి, మహారాజులాగా ముచ్చిలించుకుపొమ్మని పరులు ఆదరంతో బొట్టూ కాటుకా పెట్టి పిలిచి నప్పుడు-వాటిని కట్టబెట్టుకుపోవడం దొంగ తనం ఎలా అవుతుంది?-చేజిక్కనివాటిని చిక్కించుకునే నేర్పే దొంగతనం : తదితరములు కావు—ఇంకా పూర్వపక్షాలు చాలా ఉన్నవికాని, అవన్నీ అప్రస్తుతములు :

దొంగ, దొర వ్యతిరేకార్థకములని మన సంప్రదాయము : అది ఎంతవరకూ నిజమని, ఉద్యోగమునుంచి విరమించి ప్రస్తుతం ఉపకారవేతనంతో కాలక్షేపం చేస్తూన్న ఒక చోరవృద్ధుణ్ని ఆ నడుమ ఎవరో ఒక పత్రికావిలేఖరి ప్రశ్నించగా ఆ అనుభవజ్ఞుడు యిచ్చిన సమాధానం ఇది—

'దొంగ కానివాడు దొర అని లోకం అంటూన్నది కేవలమూ పొరబాటు: యథార్థస్థితి అందుకు పూర్తిగా వ్యతిరేకము: దొంగ కానివాడు దొర కావడం అసంభవము : ఎందుచేతనంటే, దొంగ ముదిరితేనేకాని దొర కాలేడు.'— ఇందులో తత్వం మనకు అర్థంకావడం కష్టం, కాని సత్యాన్ని కాదనలేముకదా! ،

దొంగను పట్టుకునేందుకు దొంగనే నియోగించమని రాజనీతి : అయితే యీ సూత్రం అక్కరమాలిన దని సంప్రదాయజ్ఞుల అభిప్రాయము. ఎందువల్లనంటే, యిందులో అనన్వయదోషం ఉన్నది,-ఇద్దరు దొంగలనూ నిర్ణయించుతూన్నది లోకమే కాబట్టి; సిసలైన దొంగకు అ-దొంగలంటే తగని నిరసన : అందుచేత, పనికట్టుకుని వచ్చి, 'నేను నికరమైన దొంగనయ్యా'

అని తన కులగోత్రాలు ఎన్నటికీ తెలుపుకోవడం అంటూ సంభవించదు. కనుక, ఒక దొంగచేత మరో దొంగను పట్టించే అవకాశం లోకానికి ఎన్నటికీ ఒనగూడదు.

అయితే 'ఏమయ్యా, దొంగలు ఉన్నారని నిర్ధారించగలిగిన లోకం వాళ్లను పసిపట్టలేదా?' అని ఎవరన్నా ఆక్షేపించవచ్చును. నిజమే: ఇక్కడ ప్రత్యక్ష ప్రమాణానికి వీలుంటే అలా అనడం చెల్లుతుంది. కాని, అనుమానమే ప్రమాణమాయెను! స్పర్శనుబట్టి వాయువుఉనికి ఎలా అనుమానిస్తున్నామో, సృష్టివికాసాన్ని చూస్తూ పరమేశ్వరుని స్థితిని ఎలా అనుమానిస్తున్నామో అలానే, దొంగతనాన్నిబట్టి దానికారకుడి స్థితిని అనుమానిస్తున్నామేకాని, స్వరూపాన్నిబట్టి దొంగ ఇలా ఉంటాడు అన్నేందుకు దొంగ-రూపం ఫలానా అని లేకపోవడం సృష్టిలో లోపం: తస్మాత్, దొంగ ఎవరు, ఎట్టివాడు అనే ఆకాంక్షయందు సిద్ధించేదేమంటే - దొంగ ఎవరైనా కావచ్చును, తానుగాక: కనుక దొంగశబ్దానికి ఉత్తమపురుష చెల్లదు.

దొంగను పట్టుకోవాలంటే దొంగకే చెల్లుతుంది - అనే న్యాయం సర్వసమ్మతం కాకపోవడానికి, బలవత్తరమైన మరో హేతువు ఉన్నది. ఒకవేళ, కర్మం చాలక, ఎవరన్నా ఓ ఆసామి, దొంగను పట్టుకోవడమంటూ సంభవించినా, 'నేను దొంగను గనుకనే వాడిని పట్టుకోగలిగాను' అని రొమ్ముమీద చెయ్యివేసి చెప్పుకోగలడా?- ఉహు... అదీగాకుండా తాత్వికంగా చూస్తే గట్టిచిక్కు ఒకటి ప్రాపించుతూన్నది: తాను దొంగ ఔనో కాదో, కాగల యోగ్యత ఏకోశానైనా ఉన్నదో లేదో, గ్రహించగల యోగ్యత యీ కలికాలంలో బొత్తిగా మృగ్యమైపోయింది. అందుచేత 'దొంగ' శబ్దప్రయోగానికి వ్యావహారికంలో పరువు ఛప్పగా క్షీణించిపోయింది: ఎగతాళికో ఎకసక్కెముగానో, కసితోనో, మానవుడు సాటిమానవుణ్ణి ఈపదంతో సంబోధించి తన అక్కసు తీర్చుకుంటున్నాడేకాని, ఆశబ్దం విలువను గుర్తించడం లేదు: కొన్నాళ్లుపోతే 'దొంగ' ఆర్షప్రయోగాల్లో చేరిపోతుందేమోనని భయంగా ఉంది.

దొంగలందరూ సాక్షాత్ మహేశ్వర స్వరూపులు.

'రుద్రుడు లీలావిలాసానికి చోరాది రూపములను తాల్చుతున్నాడు. లేదా, రుద్రుడు జగత్తునంతటినీ వ్యాపించి ఉన్న కారణంచేత, చోరులుకూడా రుద్రునివలెనే పూజింపతగినవారు...' ఈమాదిరిగా రుద్రాధ్యాయం వివరణంలో మహీధరుడు అంటున్నాడు. రకరకాల చాకచక్యములూ, ప్రత్యేకతలూ ఉన్న దొంగలకు శివునిపేరిట పరి-పరి విధాల మ్రొక్కడం నమకం పఠించే సమయాన, ఎంత మడిగట్టుకుని కూర్చున్నవారికైనా తప్పనిసరి.

ప్రతియుగంలోనూ, ప్రతిదేశంలోనూ దొంగలు అడపాదడపా ఉద్భవిల్లుతూనే వచ్చారు. దొంగ లేని యుగం అంధయుగము. దొంగలను కననేరని జాతికి చరిత్రగాని, తదితర సభ్యజాతుల్లో స్థానంకాని లేదు.

# జన్మకాల శోధనపద్ధతుల విలువ



= శ్రీ రాళ్ళపల్లి గోపాలకృష్ణమాచార్యులు =

న్మకాలమును శుద్ధముగావించు విషయమున జాతక తంత్రవేత్తలు గోప్యముగా నుంచుకొని వాడుచున్న పద్ధతులు కొన్ని కలవు. వానిలో 'శుక్రనాడి' అను ప్రాచీన గ్రంథమునఁ జెప్పఁబడిన దనియు, మిక్కిలి విలువగల గణితమార్గ మనియు ప్రతీతి గల పద్ధతి యొకటి యున్నది. దీని ప్రయోగవిధాన మిది :

సూర్యోదయాదిగా జన్మకాల ఘటీవిఘటికలను మొత్తపు విఘడియలుగా మార్చి, ఆ సంఖ్యను 4 తో గుణించి 27 తో భాగించఁగా, వచ్చిన శేషమును అశ్విన్యాదిగా లెక్కించినచో, ఒక నక్షత్రము వచ్చును. మరల ఆ మొత్తపు విఘడియల సంఖ్యనే 3 తో గుణించి 7 తో భాగించఁగా, వచ్చిన శేషమును భానువారాదిగా లెక్కించినచో, ఒక వారము వచ్చును. ఈ విధముగా సాధించిన నక్షత్రవారములు జన్మదినమునాఁటి నక్షత్ర వారములే కావలెను. అట్లు సరిపోనియెడల, జన్మకాల మశుద్ధమని నిర్ధరించి, వలసినంత వెనుకకో, ముందునకో జన్మకాలమును జరిపి సరిపుచ్చవలయును. అట్లు సరిపోయినదే శుద్ధ కాలము అని.

ఈ పద్ధతికి నిదాన మేమో, ఏ తత్త్వముపై నిది యాధారపడినదో తెలియదు. నాడీగ్రంథముల పరిచయము సామాన్యముగా లభించునట్టిది కాదు. వానిని ముద్రించు భాగ్యమునకు ముద్రాయంత్రము లింకను నోచుకొనలేదు. ఆ గ్రంథముల తాళపత్రప్రతులను దాఁచిన నిధులవలె తండ్రులు కుమారులకు చూపిపోవుటయు, వానిలోని భాగములను కుమారులు పితృస్వముతోపాటు దాయభాగరూపమున పంచుకొనుటయు అందందు కలదఁట ! నాడీగ్రంథములనఁగా, దివ్యదృష్టి కల ప్రాచీనమహర్షిపుంగవులు లోకకల్యాణమునకై మునుముందుగా నానాభాషలలో వ్రాసియుంచిన వ్యక్తిజాతకముల సంపుటము లనియు, ఆ గ్రంథములను దాఁచి సంరక్షించుచున్న మహనీయుల నాశ్రయించి, అంతో యింతో ముడుపు చెల్లించి, వారి యనుగ్రహమున నా గ్రంథభాగములను చదివించుకొని విని, గతజీవితమందలి తమతమ యనుభవములకు సరిపడు వ్యక్తిజాతకము లందు లభించెనేని, వాని ప్రతిని వ్రాయించుకొని వచ్చు వాడుక యున్నదనియు వినుచున్నాము. అంతే కాని, జాతకములను గణించు మార్గములు, వానికి సంబంధించు గణితసూత్రములు, గ్రహదృష్టి స్వభావాదుల మూలతత్త్వములను గూర్చిన విధులు ఇత్యాదులు వానిలో నున్నట్లు వినము. ఒక వేళ, ఇవన్నియు సమగ్రముగా నుండి ప్రకాశమునకు రాకుండా దాఁచఁబడి యున్నవేమో ? ద్రవ్యార్జనమునకు సాధనముగా నిట్టి గ్రంథముల నుపయోగించుచుండువారికి తత్సూత్రములను ప్రకటించు నుదారహృదయ ముండదు. ఈ నాడీగ్రంథముల నుండి ధన మార్జించుటే వృత్తిగా కలవారిలో ననేకులకు జ్యోతిషశాస్త్రమున సామాన్యజ్ఞానము నయితము లేదందురు. అగుటచే, ఏ పరమప్రయోజనము నుద్దేశించి మహర్షు లీ గ్రంథరాజములను రచించిరో, అది జనసామాన్యమున కందరాని పండగుటలో నాశ్చర్యము లేదు.

"వ్యయతో వృద్ధి మాయాంతి
క్షయ మాయాంతి సంచయాత్."

అను న్యాయమును మరచి, విద్యాధనము నిట్లు గుప్తము కావించి త్రుప్పుపట్టించు నలవాటు వచ్చుటం జేసి మన దేశమున కెంతో విజ్ఞానదారిద్ర్య మీ వరకే వాటిల్లినది. ఇంకను వాటిల్ల నున్నది. మహారాజులో, జమీందారులో, ఎవరైన నిట్టి గుప్తధన మున్న భాగ్యశాలురను కనిపెట్టి, ఆ గ్రంథమును సంపాదించి ప్రజాహితమునకై దానిని ప్రకటించవలసిన బాధ్యత కలదు. అట్టి భాగ్య మెన్నటికైన రాఁగలదా? చాకి రేవులకో, స్నానమందిరములకో, ఖండాంతరములలో లక్షలకొలఁదిగ ద్రవ్యమును ధారాళముగా వెచ్చబెట్టు మహోదారులు మనదేశమున లేకపోలేదు. కాని, వారి కృపాకటాక్ష మీశాస్త్రములవైపు ప్రసరించకుండుట మన—లేక, మన ప్రాచీననాడీగ్రంథప్రణేతల—అభాగ్యపు ఫలము !

మహదాశ్రయము లేని విద్యలు నశించక మఱి యేమగును అది యట్లుండె.

సామాన్యదృష్టితో విమర్శించినచో, ప్రశంసలో నున్న పద్ధతి క్రింది ఫలితము కానరాఁగలదు. జన్మదిన మేదైన నేమి, జన్మస్థల మేదయిన నేమి, శేషవిఘటికలకు అశ్విన్యాదిగా నక్షత్రములను, భానువారాదిగా వారములను లెక్కించవలె నను నియమ ముండుటచే, ఇట్టి నక్షత్రవార సంయోగము నియమితకాలమందే ప్రతిదినమందును సంభవించక తప్పదు. ఒక్కొక్కనక్షత్రముతో ఒక్కొక్క వారముచొప్పున 27 నక్షత్రములతో ప్రత్యేకముగ 7 వారములు జతపడుటకు కనీసము (27×7) 189 విఘడియల కాలము కావలసియుండును. అగుటంబట్టి, సూర్యోదయాదిగా నేదో యొక విఘడియలో ఇష్ట నక్షత్రవార సంయోగము కలిగెనేని, ఆ విఘడియకు తరువాత ప్రతి 189-వ విఘడియ సయితము అట్టి నక్షత్రవారసంయోగమును చూపుచునే యుండఁ గలదు. కావున సూర్యోదయాదిగా నొక దినమందలి మొత్తపు విఘడియలు (60×60) 3600 టిలో ఇష్ట నక్షత్రవారసంయోగమును పై పద్ధతితో చూపఁగల విశిష్ట విఘటికలు 19 ఉండు ననుట: అగుటచే, ఈ సూత్రమునకు వాస్తవముగా విలువ యుండు నేని, ఏదినమందయినా శిశుజన్మములు పరస్పరము 189 విఘడియల్క (3 ఘడియలు 9 విఘడియల) అంతరము గల 19 కాలములలో మాత్రమే సంభవించు నని తేలఁగలదు.

ఉదాహరణార్థమై పూర్వఫల్గునీ నక్షత్రమున బుధవారమునాఁడు కలిగిన జనన మొకటి కల దనుకొందము. అశ్విన్యాదిగా పూర్వఫల్గుని 11-వ నక్షత్రము. భానువారాదిగా బుధవారము 4-వ వారము. ప్రశంసలోనున్న సూత్రము ననుసరించి యీ రెండును చేరఁగల విఘడియ సూర్యోదయాదిగా 104–వ దగుచున్నది. దాని తరువాత వచ్చు ప్రతి 189–వ విఘడియ సయితము పై సూత్రముతో సమన్వయపడఁగలదు. అగుటచే, మొత్తముమీఁద ఈక్రింద కనుపరచిన 19 ధ్రువకాలములందు మాత్రమే ఆ దినమున అనఁగా పూర్వఫల్గునీయుత బుధవారమున శిశుజన్మములు కలుగు నని సిద్ధించును:

| | గ. | విఘ. |
|---|---|---|
| (1) | 1 | 44 |
| (2) | 4 | 53 |
| (3) | | 2 |
| (4) | 11 | 11 |
| (5) | 14 | 20 |
| (6) | 17 | 29 |
| (7) | 20 | 38 |
| (8) | 23 | 47 |
| (9) | 26 | 56 |
| (10) | 30 | 5 |
| (11) | 33 | 14 |
| (12) | 36 | 23 |
| (13) | 39 | 12 |
| (14) | 42 | 41 |
| (15) | 45 | 50 |
| (16) | 48 | 59 |
| (17) | 52 | 8 |
| (18) | 55 | 17 |
| (19) | 58 | 26 |

పై దినమున ఉదయాదిగా 35 గడియఅలో జననమని యొక జాతక ముండె ననుకొందము. ఈ సూత్ర ప్రక్రియ ననుసరించి జన్మకాలమును 33-14 గడియలకో, లేక 36-23 గడియలకో సవరించవలసియుండును. ఈ పద్ధతిలో గరిష్ఠపక్షము 1 గడియ 34½ విగడియలు ఇష్టకాలమును వెనుకకో ముందునకో త్రోయవలసి వచ్చుట సంభవించును. తత్ఫలితముగా లగ్నము, పదివిగడియల కొక్క భాగవంతున రమారమి 9, 10 భాగల దూరము (అనఁగా, మూఁడు నవాంశల పట్టు) జరుగవలసి వచ్చుచున్నది. అందాజుకాలపు జాతకముల మాట యట్లుండ, జన్మక్షణమును గమనించి గ్రంథస్థము కావించిన సందర్భములలో సయితము, ఇంత దూరము కాలము సవరించుటకు మన కధికార మున్నదా యనుట నా దృష్టిలో సందేహాస్పదమగు సమస్య.

లగ్నశుద్ధికై యిట్లు సవరించుటచేఁ గలుగు నష్టమేమి అనువా రుందురేమో? ధ్రువకాలములు 19 టిలో తప్ప ఇతర సమయములలో మానవజన్మములు కలుగవని ప్రప్రథమున మనము నమ్మవలసి యుండును. అనుభవముతో నీ సూత్ర మెంతమాత్రము సమన్వయపడునో, హోరాశాస్త్రజ్ఞులే కాక, ప్రసూతితంత్రవేత్తలు సయితము నిర్ధరించవలసిన మాట! కాకతాళీయముగా, ఏవో కొన్ని జాతకములు—ధ్రువకాలములకు సన్నిహితముగా జన్మకాలముండునవి—కానరావచ్చును. కాని, అట్టి దృష్టాంతములీ సూత్రమునందలి యాథార్థ్యమును స్థాపించ నేరవు. నా యనుభవములో నేమో, ఈ సూత్రమునకు మంచి విలువ కానరాలేదని విధిలేక విన్నవించవలసియున్నది. రేడియో కాలమునకు సవరించుకొని స్పష్టపరచుకొన్న నికరమైన గడియారము నరచేత నుంచుకొని, మంత్రసానుల మాటపై నాధారపడకుండుటకై, సూతికాగృహద్వారప్రాంత మం ధే

జాగరూకతతో కాలనిరీక్షణము చేయుచుండి, శిశురోదన క్షణమును గురుతువేసుకొన్న సుఖప్రసవదృష్టాంతములలో సయితము నా కీ సూత్రము ఫలించలేదు. ఇట్టి సందర్భములలో కూడ జన్మకాలము గడియకు పైఁగా సవరించవలెనన్నచో ఈ సూత్రముపై విశ్వాసము వచ్చు టెట్లు?

మఱి యొక్క మాట: ఈ పద్ధతి ననుసరించి సవరించిన లగ్నబిందువు వాస్తవముగా విశ్వసనీయ మగునేని, లగ్నచలన మాధారముగాఁ గల దశలలో జీవితమందలి పరిణామములయొక్క శుభాశుభములను సూచించవలయును గదా? దినవర్షపద్ధతితో కాని, ఏకాంశవర్షపద్ధతితోకాని చలింపఁజేసిన లగ్నదశమకేంద్రములు గ్రహదృష్టియోగముల వశమున జీవితమందలి మంచిచెడుగులను తెలుపఁజాలనిచో, ఈ సూత్రమువలన సాధించిన లగ్నము (అనఁగా, జన్మకాలము) అశుద్ధ మనియే తీర్మానించవలసి యుండును. ఇంతే కాదు; అట్లు సవరించిన కాలమునుపకరణముగాఁ గొని నక్షత్రకాలాంతరధ్రువమును సాధించి, తన్మూలముగా జీవితమందలి ప్రధానపరిణామములు సంభవించిన దినములకు దైనికజాతకములను గుణించినచో, ఫలములతో సరిపడు గ్రహసంయోగములను దైనిక కేంద్రములు చూపవలసి యుండును. ఈ రెండుమార్గములతో సాక్ష్యము తృప్తికరముగా వచ్చినఁగాని, పై సూత్రమును విశ్వసించుట కష్టము. జీవితముతో సరిపడని కాలము నిచ్చు సూత్రము శుక్రనాడిలోని దైననేమి, శివనాడిలోనిదైన నేమి?

ఒక జాతకము నుదాహరణముగాఁగొని పైసూత్రము నన్వయించి జీవితదశ లెట్లు సాక్ష్య మిచ్చునో విమర్శింతము. ఆ జాతకపు సామగ్రి యిది:

| | | | | |
|---|---|---|---|---|
| జన్మదినము | (తేదీ) | 5-4-1885 | | |
| జన్మస్థానపు అక్షాంశలు | | భా 12 | కల 16 | |
| జన్మస్థానపు రేఖాంశాకాలము | గ 5 | ని 6 | సెక 40 | |
| స్థానిక మధ్యమ సూర్యోదయకాలము (L.M.T.) | 5 | 57 | 28 | A. M. |
| ఇష్టకాలము (ఉదయాదిగా 4 ఘడియలు) | | 36 | 0 | |
| జన్మకాలము (L.M.T.) | | 33 | 28 | A. M. |

జన్మకాలము 4 గడియ లనుటచే పాదచ్ఛాయల మూలముగా గణింపఁబడిన అందాజు కాల మిది యని మన మూహించవలసియున్నది. అగుటచే శుద్ధకాలము కనుఁగొనుట యత్యవసరము.

జ్యేష్ఠానక్షత్రముతో కూడిన బుధవారము జననము. ఈ రెండింటి సంయోగము చూపఁగల సన్నిహితకాలము ఉదయాదిగా 153-వ విఘడియయో, 342-వ విఘడియయో అగుచున్నది. * అగుటచే, ఈ శుక్రనాడీసూత్రానుసారము 2—33 గడియలకు జన్మకాలము సవరించవలసి యుండును. లేదా, 5—42 గడియలవరకు దానిని పెంచవలసియుండును.

ఇది యిట్లుండ, 'ఆధానకాలపద్ధతి' ననుసరించి పాశ్చాత్యమతానుసారముగా శుద్ధము గావించిన కాలము వేరొకటి కలదు. అది ఉదయాదిగా 5 గడియలు 20 విగడియ లగును. పాఠకమహాశయుల సౌకర్యార్థము పై మూఁడు వేళలకు సరియగు స్థానిక మధ్యమకాలమును (L. M. T.) ఈక్రింద చూపుచున్నాను:

| ఉదయాదిగా:— | గ. | ని. | సెక. |
|---|---|---|---|
| 1. 2—33 గడియలు | 6 | 58 | 40 |
| 2. 5—42 గడియలు | 8 | 14 | 16 |
| 3. 5—20 గడియలు | 8 | 5 | 21 |

పై మూఁడు కాలములలో కడపటిదానికి సాధించిన సాయన గ్రహభావకుండలి యీ క్రిందనున్నది. తక్కిన రెండువేళలకు ప్రత్యేకముగా కుండలుల నీయలేదు. కాల వ్యత్యాసము స్వల్ప మగుటచే గ్రహస్థితులలో విశేషభేద

* ఇష్ట నక్షత్రవార సంయోగము వచ్చు విగడియ నీక్రింది మార్గమున కనుఁగొనవచ్చును:

అశ్విన్యాదిగా జన్మనక్షత్రపు సంఖ్య 4 తో నిశ్శేషముగా భాగము పోదేని, దానికి 27, లేక 54, లేక 81 కాని చేర్చి, నిశ్శేషమగునట్లుగా భాగించవలెను. అట్లు భాగించఁగా వచ్చిన లబ్ధసంఖ్యను 3 తో గుణించి 7 తో భాగించఁగా వచ్చు శేషమును భానువారాదిగా లెక్కించినయెడల నొక వారము వచ్చును. ఆ వారమే జన్మవార మగునేని, ఆ లబ్ధసంఖ్యయే ఇష్ట విఘటిక యగును. ఆ వారము జన్మవారము కాదేని ఆ వారము మొదలుకొని జన్మవారమువరకు లెక్కించఁగా వచ్చు సంఖ్య 2 అయినచో 54; 3 అయినచో 108; 4 అయినచో 162; 5 అయినచో 27; 6 అయినచో 81; 7 అయినచో 135. ఈ ప్రకారముగా పై లబ్ధసంఖ్యకు చేర్చవలెను. వచ్చిన మొత్తమే ఇష్ట విఘటిక యగును. దానికి తరువాత ప్రతి 189-వ విగడియ సయితము ఇష్ట నక్షత్రవారసంయోగమును తెలుపఁగలదు.

ముండదు కొన గ్రంథవిస్తరభీతిచే మానితిని. లగ్నాది కేంద్రములలో వ్యత్యాస మధికముగా వచ్చుటంజేసి, అవి యీ మూఁడుకాలములకును ప్రత్యేకముగా నిచట చూపఁబడినవి :

| | లగ్నము | దశమము |
|---|---|---|
| 1. మొదటికాలము | వృషభరాశి 3½ భాగ | మకరము 26¼ భాగ |
| 2. రెండవ కాలము | వృషభము 23¾ భాగ | 14¾ భాగ |
| 3. మూఁడవ కాలము | వృషభము 21¼ భాగ | కుంభము 12½ భాగ |

ఆ సాయనకుండలి యిది:—

| | | | |
|---|---|---|---|
| | కే4-15<br>కు4-19<br>శు7-47<br>ర15-49 | బు4-18<br>I 21-15<br>ఇ 21-40 | శ19-17 |
| X 12-23 | (అయనాంశలు<br>22 భాగలు<br>14 కలలు) | | |
| | | | గు26-16<br>(వ) |
| చ18-15 | | వ 0-16(వ)<br>రా4-15 | |

ఉపజ్ఞాసూచక మగు వృషభరాశి 21-వ భాగ లగ్నమగుట, అసాధారణశక్తిమంత మగు ఇంద్రగ్రహ మచట ఉదయించుట, సౌహార్ద్రప్రియుఁ డగు శుక్రుఁడు లగ్నాధిపతియై స్థానాధిపతియగు కుజుని చేరి,

"కుసుమస్తబక స్యేవ
ద్వయీ వృత్తి ర్మనస్వినః,
మూర్ధ్ని వా సర్వలోకస్య,
వన ఏవ వా,"

అను వాగర్థకుఁ దగిన సుమనస్కతను సూచించు మేషరాశి 8—వ భాగయం దుండుట, మనఃకారకుఁడు విక్రమాధిపతియు నగు చంద్రుఁడు, ధర్మకర్మాధిపత్యముచే రాజయోగకారకుఁ డగు శని- వీ రిరువురు పరస్పరపూర్ణ దృష్టితో ధనుర్మిథునములలో కార్యశూరత్వము దెలుపు 18, 19 భాగలలో నుండుట, పితృకారకుఁడగు రవి పరమోచ్చాసన్నప్రాంతమందు విప్లవసూచక మగు మేషరాశి 15-16 భాగలో ప్రకాశించుట, బృహస్పతి సింహరాశిలో ఉత్తమ శ్లోకతను, హోరాశాస్త్రనైపుణ్యమును. సూచించు 26-వ భాగలో నుండి పుష్పవంతులపై నత్యంత శుభకోణదృష్టిని ప్రసరింపఁ జేయుట, ఉపజ్ఞాయుత మగు సంకల్పశక్తిని• ఉత్సాహయుక్త మగు స్వాతంత్ర్యప్రీతిని సూచించు వరుణ గ్రహము సప్తమాధిపతి యగు కుజునితో సమసప్తకమున రాహువుతో నుండుట—ఇవి యీ జాతకమందలి ప్రధానవిశేషములు. హోరాతంత్రవిశారదుఁడు జాతకుఁడు. అతని జాతకయోగములకు ఫలముల నిచట చెప్పఁబూనితి నేని, పరిహాసభాజన మగుదును. ఉపదిష్టకాలమును మార్చినందుకై మన్నన నర్థించుచు, ప్రశంసావిషయమున ఉదాహరణముగామాత్ర మీ జాతకము నిచట ఉపయోగించుచున్నాను.

జాతకునికి 12 సంవత్సరముల ప్రాయమున (1897) వివాహము, 35 వయస్సున (1920) పితృకర్మ, 47-వ ఏఁట కళత్రవియోగము, 58 యీడున (1943) మాతృక్లేశము సంభవించినవి. దినవర్షదశాపద్ధతిలో చలించిన లగ్న దశమకేంద్రము లాయా పరిణామములకు తగిన గ్రహదృష్ట్యాది యోగము లెట్లు సూచించునో పరీక్షింతము• ప్రశంసలోనున్న కాలత్రయమునకు ప్రత్యేకముగ లగ్న దశమకేంద్రముల చలితస్థానములు పథకమున చూపఁబడినవి. (అనుబంధము 1 చూడుడు.)

1. ప్రథమ కాలము:—

1897-వ సంవత్సరమునకు దశమకేంద్రము జన్మశుక్రుని అర్ధకోణదృష్టి నార్జించినది. పరిణయసులభమగు వయస్సు నిది సూచించుట సత్యమే. కాని, ఇది కాకతాళీయ న్యాయమువంటిది. ఏలన, పితృకర్మను సంపాదించి యిచ్చిన 1920-వ సంవత్సరమునకు తగిన దశ నీ కాలము చూపలేదు. కళత్రవియోగము కల్గిన 1932-వ సంవత్సరమునకైనా సరిపడు దశాకాల మిందు కానరాదు. 1943-వ సంవత్సరపు మాతృకర్మకుమాత్ర మెట్లో దశమకేంద్రమునకు చలితశనినుండి కేంద్రవేధ వచ్చినది. ఇది మాతృక్లేశమును సూచింపఁజాలినదే యనవచ్చును. నాల్గు ప్రధానఘట్టములలో రెండింటిని మాత్రము చూపఁగలిగిన యీ కాలము జాతకుని దగునా ?

# మధురనేలిన తెలుగునాయకరాజులు



## = శ్రీ దిగవల్లి వేంకటశివరావు =

(గత సంచిక తరువాయి)

విశ్వనాధనాయకుని తరువాత ఆయనకుమారుడైన కుమారకృష్ణప్ప, లేక కృష్ణమ్మ ౧౫౬౪ లో మధురకు ప్రభువై ౧౫౭౨ వరకూ పరిపాలించాడు. ఈయనను పెద్దక్రిష్టప్పఅని, పెద్దక్రిష్టమ్మ అనికూడా అనేవారు. ఆయన విశ్వనాధుడి జీవితకాలములో కూడా రాజ్యవ్యవహారాలలో పాల్గొనేవాడు. ఈయన రాజ్యానికివచ్చిన కొద్దికాలానికే ౭౨ పాళెగాళ్లలో బలవంతుడైన తుంబిచ్చి నాయకుడు తిరుగుబాటు చేయగా కృష్ణప్పనాయకుని సేనాధిపతియైన పెద కేశవప్పనాయకుణ్ణి తుంబిచ్చి నాయకుడిమీదికి పంపాడు. అతడు చనిపోగా ఆయనకుమారుడినే సేనాధిపతిగా చేయగా ౧౩ గ్గురు సహాయ సేనాధిపతుల సహాయముతో తుంబిచ్చి నాయకుణ్ణి ఓడించి తలకొట్టి పంపినాడు. తరువాత కృష్ణప్పనాయనివారికి సింహళ రాజుతో యుద్ధము తటస్థించినది. తుంబిచ్చి నాయకుడి తలకొట్టినట్లు తెలియగా అతని స్నేహితుడైన ఖండి (సింహళ) రాజుకి కోపంవచ్చి మధురనాయకుణ్ణి దూషించాడట. అంతట కృష్ణప్పనాయనివారాగ్రహించి పెద్దసైన్యంపోగుచేసి ౫౨ పాళెగాళ్లతో తరలిపోయి నవపాషాణం దగ్గర సముద్రందాటి వెళ్లగా సింహళ రాజున్నూ ౪౦ వేల కాల్బలమును నలుగురు మంత్రులు, ౮ మంది దేశనాధుల కింద పంపించాడు. కృష్ణప్పనాయకుడు మధుర సేనాధిపతిని ౨౦ వేల కాల్బలముతో ముందుకు పంపగా అప్పుడు జరిగిన యుద్ధములో మధురకే జయము కలిగింది. ఇద్దరు మంత్రులు ౫ దిశానాధులు పట్టుబడ్డారు. వారిని కృష్ణప్పనాయకుడు అవమానించక దయగా చూచి ఆదరించాడు. వారు తమ రాజును రాజీ పడవలసినదని ప్రోత్సహించారు. కాని లాభం లేకపోయింది. మళ్లీ జరిగిన యుద్ధములో సింహళరాజు వీరస్వర్గ మలంకరించాడు. అంతట కుమార కృష్ణప్పనాయకుడు సింహళరాజధానియైన ఖండినగరాన్ని పట్టుకుని రాజుకు ఉత్తరక్రియలు చేయించి తన భావమరదియైన విజయ గోపాలనాయకుణ్ణి పరిపాలకుడుగా నియమించాడు. ఈ వృత్తాంతము యావత్తూ చక్కని తెలుగులో సింహళ ద్వీప కైఫీయత్తనే ఒక పురాతనమైన తెలుగు వచన కావ్యములో వివరింపబడినది. అది ఇప్పటికీ మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో నున్నది. (**The Madura Country-Nelson. Part III. P P. 101-104.**)

### విశ్వనాధుని సంతతివారు

కుమారకృష్ణప్పనాయకునితరువాత ఆయన కుమారుడు పెద్దవీరప్పనాయకుడు ౧౫౭౨ మొదలు ౧౫౯౫ వరకూ మధురదేశాన్ని పరిపాలించాడు. అతనితోపాటు అతని తమ్ముడైన రెండవ విశ్వనాధుడు కూడా పరిపాలనచేశాడు. ఇంతవరకూ దళవాయిగా నుండిన ఆర్యనాధమొదలియారు చాలా బలవంతుడుగా నుండేవాడు. అతడు ౧౬౦౦ సం.లో చనిపోయినాడు.

వీరప్పనాయకుడికి లింగయ్య అనే కుమార కృష్ణప్ప,విశ్వప్ప,కస్తూరిరంగప్ప అనే ముగ్గురుకుమాళ్లు. వీరిలో పెద్దవాడైన వీరకుమారక్రిష్ణప్పనాయకుడు రాజై ౧౬౦౧ వరకూ పరిపాలించాడు. ఇతనిని రెండవ క్రిష్ణప్పనాయకు డని చరిత్రకారు లంటారు.

అతడు జీవించియుండగానే తమ్ముడు విశ్వప్ప చనిపోయినాడు. క్రిష్ణప్ప పోగానే కస్తూరిరంగప్ప వారం రోజులు రాజ్యాక్రమణచేసి పాలించాడుగాని తరువాత విశ్వప్పకుమారుడైన ముద్దుక్రిష్ణప్ప రాజై ౧౬౦౯ వరకూ పరిపాలించాడు. తరువాత అతని కుమారుడైన ముద్దువీరప్ప నాయకుడు ౧౬౨౩ వరకూ పరిపాలించాడు. క్రిష్ణప్పవీరప్పలకాలంలో జెసూటు క్రైస్తవ మిషనరీలు ప్రచారంచేయడం సాగించారు. రాబర్టు డి నోబిలీ "జగద్గురు తత్వబోధకస్వామి" అనే వేషంతో తిరుగుతూ దేశభాషయైన అరవమున్నూ, రాజభాషయైన తెలుగున్నూ బాగా నేర్చుకుని మతబోధచేయడం ప్రారంభించాడు.

౧౬౨౩ లో ముద్దువీరప్పనాయకుని తమ్ముడైన తిరుమలశౌరి నాయని అయ్యలుగారు రాజై ౧౬౫౯ వరకూ పరిపాలించినాడు. ఈయనకాలంలో మైసూరుతోనూ, తిరువాంకూరురాజుతోనూ వచ్చిన యుద్ధములలో దళవాయిరామప్పయ్య అఖండవిజయమును పొంది ప్రఖ్యాతిచెందినాడు. ఇతడు తెలుగునియోగి బ్రాహ్మణుడు; రాజ్యతంత్రనిపుణుడు; మహాశూరుడు. తిరుమలశౌరి తరువాత ఆయనకుమారుడు ముద్దు అలగాద్రి అనే రెండవ ముద్దువీరప్పనాయకుడు రాజై ౧౬౫౯ లో నాల్గుమాసములు పరిపాలనచేసి మరణించినాడు. అంతట అతని కుమారుడైన చొక్కనాథుడు రాజై ౧౬౫౯ మొదలు ౧౬౮౨ వరకూ రాజ్యం చేశాడు. రాజధానిని మధురనుంచి తిరుచునాపల్లికి మార్చినాడు. చొక్కనాథుని కాలంలో కొన్ని విశేషాలు జరిగినవి.

ఇతడు రాజయ్యేటప్పటికి ౧౬ సంవత్సరములవాడు. అందువల్ల దళవాయి, ప్రధాని, రాయసము ఏకమై అక్రమాలుచేయడం ప్రారంభించారు. చొక్కనాథుడు బ్రాహ్మణుడైన దళవాయి కళ్లుపీకించి, రాయసమును వధించి నిరంకుశపరిపాలన ప్రారంభించినాడు. చొక్కనాథుడు ౧౬౭౩ లో తంజావూరును జయించి తన సవతితమ్ముడైన ముద్దుఅళగిరిని పరిపాలకుడుగా నియమించినాడు. అళగిరి గర్వాంధకారంవల్ల అన్నగారినికూడా తృణీకరించినాడు. పూర్వము తంజావూరు రాజుదగ్గరనుండిన రాయసం వెంకన్న యనే నియోగిని దగ్గరకు తియ్యగా అతడు మహారాష్ట్రప్రభువైన ఏకోజీతో కుట్రచేసి ౧౬౭౬ లో అళగిరిని పదభ్రష్ఠుణిచేసి పూర్వపురాజుకొమారుడైన చంగమలదాసును తంజావూరుకు రాజుగా చేసినాడు.

చొక్కనాథుడికాలంలో మైసూరుదళవాయి కుమారయ్య దండయాత్రచేయగా చొక్కనాథుడు జింజిపరిపాలకుడైన ఏకోజీసహాయంతో ఉపద్రవం తప్పించుకొన్నాడు. చొక్కనాథుని తరువాత ఆయన కుమారుడైన రంగ క్రిష్ణ ముద్దువీరప్పనాయకుడు ౧౬౮౨ లో రాజై ౧౬౮౯ వరకూ పరిపాలించి మశూచివల్ల మరణించినాడు. ఆయనభార్య ముత్తమ్మ గర్భవతిగా నుండినది. ఆమెకుపుట్టిన కుర్రవాడే విజయరంగ చొక్కనాథుడు. అతని చిన్నతనంలో ముద్దువీరప్పతల్లి మంగమ్మగారు ౧౬౮౯ మొదలు ౧౭౦౬ వరకూ పరిపాలించింది.

## రాణీమంగమ్మగారు

మంగమ్మగారు చాలా సమర్థురాలు. ఆవిడదళవాయి నరసప్పయ్యగారు అఖండమేధాశాలి. అతడు ప్రధానామాత్యుడుగా కూడా వుండి దేశపరిపాలనము నతిసమర్థతతో జరిపినాడు. ఇతడు తెలుగు నియోగి బ్రాహ్మణుడు. ఈ నరసప్పయ్యగారు గొప్పశూరుడు. అనేక యుద్ధాలుచేసి జయించాడు. దేశారిష్టాలు కలిగినప్పుడు వాటికి ప్రతిక్రియలుచేసి ప్రజలను కాపాడినాడు. ఇతనికి పాశ్చాత్యులన్నా, క్రైస్తవులన్నా గిట్టదు. ఈయననుగూర్చిన కథలు చాలావున్నవి. మంగమ్మగారు చాలా దానధర్మాలు చేసింది. ప్రజోపయుక్తములైన కార్యాలను చేసింది.

## విజయరంగ చొక్కనాథుడు

మంగమ్మగారి తరువాత ౧౭౦౬ మొదలు ౧౭౩౨ వరకూ విజయరంగ చొక్కనాథుడు రాజ్యం చేశాడు. అతనికి మొదటినుంచీ తీర్థయాత్రలమీద, పండిత గోష్ఠిమీద ప్రీతి. అందువల్ల ఆయనకాలంలో

దళవాయిలుగా నుండిన కస్తూరి రంగయ్యా మొదలైన వుద్యోగులు అక్రమాలుచేసి ప్రజలను బాధించసాగినారు. ౧౭౧౦ లో ఒక గుడియొక్క ఈనాముగ్రామ భూములమీద పన్నులు వేసినందుకు గుడియొక్క సేవకుడు కుపితుడై గోపురంమీదనుంచి కిందపడి ఆత్మహత్యచేసుకొన్నాడు. ౧౭౧౨ లో ఒక శాసనంలో కస్తూరి రంగయ్యా దళవాయి అనిన్నీ, వెంకటకృష్ణయ్యా ప్రధాని అనిన్నీ పేర్కొనబడి యున్నారు. వీరి దుష్పరిపాలనవల్ల ప్రజలు చాలాబాధలుపడ్డారు. తరువాత నరసప్పయ్యా వెంకట రాఘవాచార్యులనే మంత్రులు బలవంతులైనారు.

విజయరంగ చొక్కనాథుని తరువాత ఆయన భార్య మీనాక్షి ౧౭౩౨ మొదలు ౧౭౩౬ వరకూ రాజ్యంచేసినది. ఆవిడ ఒక పిల్లవాడిని పెంచుకున్నది గాని అప్పట్లో ఆర్కాటునవాబు చందాసాహేబు నమ్మించి స్వామిద్రోహం చేసినందువల్ల మీనాక్షి ఆత్మహత్య చేసుకోగా మధురరాజవంశం పరిపాలన అంతరించినది.

మధురనాయక రాజవంశమువారు అనేకదాన ధర్మాలుచేశారు. వారికాలములో సంగీతసాహిత్యాలు, శిల్పము అభివృద్ధిగాంచినవి. ఈనాయకరాజులు, వీరి ఆశ్రితులు తెలుగువచనములో అనేకగ్రంథాలు వ్రాసినారు. అనేకకవులను, గాయకులను పోషించినారు. ఆ చరిత్ర వ్రాయాలంటే చాలాపెద్ద గ్రంథమవుతుంది.

## నాయకరాజులనాటి కొన్ని తెలుగుశాసనాలు

దక్షిణహిందూదేశములో విజయనగర సామ్రాజ్యమునకు లోబడి మధురను రాజధానిగా చేసుకొని పాండ్యరాజ్యము నేలిన తెలుగు నాయకరాజవంశమువారి శిలాశాసనాలు, తామ్రశాసనాలు వారేలే దేశం ద్రవిడదేశమగుటవల్ల ఎక్కువగా అరవములో నున్నవి. కొన్నిమాత్రం సంస్కృతములోను, తెలుగులోను ఉన్నవి. ఈ తెలుగు శాసనాలవల్ల ఆ రాజవంశీయుల సరియైనపేర్లు, వాటి యుచ్చారణము మొదలైన సంగతులు తెలుస్తున్నవి. ఈ శాసనాలలో కనబడే విశ్వనాథ నాయకు డనే పేరు ఈ నాయకరాజవంశానికి మూలపురుషుడున్నూ, ౧౫౨౯ మొదలు ౧౫౬౪ వరకూ మధురనేలిన విశ్వనాథనాయకునిదే.*

(౭౫) క్రీ.శ. ౧౫౮౨ (శా. శ. ౧౫౦౫ కు సరియైన స్వభాను నామసంవత్సరము) మాఘమాసములో దక్షిణ ఆర్కాటుజిల్లా చిదంబరం తాలూకాలోని శ్రీ ముష్ణం శాసనము విజయనగర చక్రవర్తియైన వీరప్రతాప శ్రీరంగదేవరాయ మహారాయలు పెనుగొండలో రాజ్యంచేస్తూ వుండగా కాశ్యపగోత్రుడైన కృష్ణప్పనాయనింగారి కొమారుడు కొండమనాయనిగారు భోనగిరిపట్నంసీమలోని గుడి తాలూకు ౩౮ గ్రామముల మీది జోడీయున్నూ, విరాదయున్నూ తీసివేసినట్లు చెపుతున్నది. (౨౬౬-౧౯౧౬)

(౭౭) క్రీ. శ. ౧౫౮౪ (శా. శ. ౧౫౦౫ స్వభాను) మధురలో విశ్వనాథనాయకకృష్ణప్ప నాయకుని కుమారుడైన వీరప్పనాయకుడు రాజ్యంచేస్తూవుండగా సుందరేశ్వర దేవాలయంలోని కంబంతాడి మండపమును పురాణగాథలు చిత్రములు గల స్తంభాలతో నిర్మించినట్లు చెపుతున్నది. (౩౫-౧౯౦౮ **Sewell Vol. I. P. 293.**)

(౧౧౭) క్రీ. శ. ౧౬౧౩ వీరవెంకటపతిరాయలవారు విజయనగరంలో రాజ్యము నేలుతూవుండగా మధురలో విశ్వనాథ వీరప్ప నాయకుడు పరిపాలిస్తూ వుండగా విశ్వనాథకృష్ణప్పనాయని దగ్గర వెంకటాద్రి భట్టరు భూదానము పొంది వీరభూపాల సముద్రములో కృష్ణుని విగ్రహమును, కామేశ్వరి విగ్రహమును ప్రతిష్ఠించినట్లు చెపుతున్నది. (౪౫౨-౧౯౧౬).

(౧౬౮) క్రీ. శ. ౧౬౬౭ (శా. శ. ౧౫౪౯ ప్లవంగనామ సం.) కోయంబత్తూరు జిల్లా ఉడమలపేట తాలూకా కుమారలింగంలో విశ్వనాథ తిరుమల

* **Nayaks of Madura By** R. **Satyanadha Iyer. Appendix D. pp.** 333-372.)

వీరప్ప చొక్కనాథ నాయకుడు ఒక బ్రాహ్మణున కిచ్చిన దానము. ( **S. C. P. No. 188.** )

(౧౮౩) క్రీ. శ. ౧౬౭౮ ( శా. శ. ౧౬౦౦ కాళయుక్తి నామ సం.) మధురలో విశ్వనాధ నాయని తిరుమలనాయకుడు మనమడున్నూ, ముద్దు వీరప్పనాయడు కుమారుడున్నూ అయిన ముద్దు అళగిరి నాయడు శ్రీ వీరప్రతాప శ్రీరంగరాయ మహాదేవ రాజుగారు ( విజయనగరంలో ) రాజ్యం ఏలుతూవుండగా కృష్ణాపురం గ్రామాన్ని ఒక బ్రాహ్మణుడికి దానమిచ్చినట్లు చెపుతున్నది. ( **S. C. P. No. 120** )

(౧౮౭) క్రీ.శ. ౧౬౭౯ (శా.శ. ౧౬౦౨ సిద్ధార్థినామ సం) విశ్వనాధ నాయకుని కుమారుడైన ముద్దు అళగిరి దక్షిణదేశములో తామ్రపర్ణి నదీతీరమున ‘ ఆరంబన్న ’ మనే గ్రామముమీద వచ్చే ౬౦౦ మల్లుకులున్నూ, శ్రీరంగక్షేత్రం దక్షిణగోపురమునకు పడమర నున్న రాతిమఠమునున్నూ శ్రీ యోగీంద్రతీర్థ శ్రీపాద ఒడయరుగారి రఘుపతి ధనాగారానికి దానమిచ్చినట్లు చెపుతున్నది. (**Mysore Archeological Report 1917. p. 57** )

(౧౯౭) క్రీ.శ. ౧౬౯౧ (ప్రజోత్పత్తినామ సం.) చొక్కనాథ నాయని భార్య మంగమ్మగారు ఒక బ్రాహ్మణున కిచ్చిన దానమును గురించి తెలుపుతున్నది.(**S. C. No. 747.**)

(౧౯౮) క్రీ. శ. ౧౬౯౨ ( శా. శ. ౧౬౧౪ అంగీరస నామ సం. ) తిరునల్వేలిలో విజయరంగ చొక్కనాధుడు. విశ్వనాథనాయకుని వంశీయుడున్నూ, ముద్దువీరప్ప మనమడున్నూ, చొక్కనాథుని కుమారుడున్నూ అయిన రంగకృష్ణ ముద్దువీరప్పగారి కుమారుడైన విజయరంగ చొక్కనాధుడు “మధుర సంస్థానమందు వుండి” ఒక మశీదును నడపగలందులకొక ముసల్మాను కిచ్చిన దానమును వివరిస్తున్నది. (**S. C. No. 53.**)

(౨౦౫) ౧౬౯౮ (శా. శ. ౧౬౧౯) ఈశ్వరమాఘ శుక్రవారము. విశ్వనాథనాయక చొక్కనాథనాయకుని రాణియైన మంగమ్మగారు తమతిరుచునాపల్లి రాష్ట్రంలో చేరిన శ్రీవిల్లిపుత్తూరు సీమలోని ఆయర్ధర్మం గ్రామంమీదశిస్తున్నూ, ఒకమఠమున్నూ, మండపమున్నూ, గుడిన్ని, శ్రీవిల్లి పుత్తూరులోని పూర్ణఘటమున్ను ... తీంద్ర తీర్థ శ్రీపాద ఒడయరువారి రఘుపతి ధనాగారానికి చెల్లించినట్లు చెప్పే తెలుగుశాసనము. (**Mysore Archeological Report 1917.** పుట **57.**)

(౨౦౬) ౧౭౦౦ ( శా. ౧౬౨౦ సం|| ) రంగకృష్ణ ముద్దువీరప్పనాయకుడు తిరునల్వేలిలో శివాలయాని కిచ్చిన దానము. (**S. C. P. No. 168.**)

(౨౦౭) ౧౭౦౦ ( ౧౬౨౨ వృష ) మధురలో బాలకృష్ణ మహాదానపుర గ్రామమును బ్రాహ్మణుల కిచ్చిన దానము. విశ్వనాథనాయని తిరుమలనాయుడు మనమడున్నూ, ముద్దువీరప్పనాయడు కొమారుడున్నూ అయిన చొక్కనాథ నాయడు భార్య మంగమ్మగారిచ్చిన దానము. (**S. C. P. No. 19.**)

(౨౦౯) ౧౭౦౧ మంగమ్మగారి దానము (భూమి. **M. E. R. 1911 pp 89-90.**)

(౨౧౦) ౧౭౦౧ డిటో. తిరుచునాపల్లి దగ్గర కొన్ని గ్రామాలు బాబనత్తు దరగాకు దానముగానిచ్చినట్లున్నది.

(౨౧౧) శా. శ. ౧౬౨౬ తారణ మరుత్తువక్కుడి. (పాపనాశం తంజావూరు) ఉయ్యకొండను కాలవదగ్గిర నెలకొల్పబడిన ఒక శిలాశాసనము. ఒక బ్రాహ్మణుడు కట్టిన “కళింగలు” (**Sluice**) విషయంలో మంగమ్మగారు చేసిన శాసనము {౩౯౪-౧౯౦౪).

(౨౧౨) ౧౭౦౬ లో మంగమ్మగారి దాన శాసనము.

(౨౧౫) ౧౭౦౮. శోసాలె వ్యాసరాయ మఠం వారి రాగి శాసనములో పాండ్య సింహాసనాధ్యక్షుడున్నూ, కాశ్యప గోత్రుడున్నూ, విశ్వనాథ నాయక చొక్కనాధ నాయని పౌత్రుడున్నూ, రంగకృష్ణ ముద్దువీరప్పనాయకుని పుత్రుడున్నూ అయిన విజయ

రంగ చొక్కనాథనాయకుడు వ్యాసరాయ మఠానికి కొన్ని వరుమానములు దానము చేసినట్లు తెలిపే శాసనము. మధుర రాజ్యములో చొక్కనాథపురములోని దేవాలయాని కేయేరుసుములు చెల్లుతున్నవో అవన్నీ ఈమఠానికికూడా చెల్లేటట్లు శాసింపబడినది. (**Mysore Archeological Report 1912 p. 55.**)

(౨౨౮) ౧౭౨౧ (శా. శ. ౧౬౪౩ శుభకృతు ౧౭౨౨) తిరుచునాపల్లి చొక్కనాథ నాయకుని పౌత్రుడున్నూ, రంగకృష్ణ ముద్దువీరప్ప నాయకుని పుత్రుడున్నూ అయిన విజయరంగ చొక్కనాథ నాయకుని రాజ్యకాలంలో ధన్వంతరి పూజకోసం నరసన్న పంతులు అనే ఆయనకు ఒక ఈనామును దానముగా నిచ్చిన దానశాసనము (**1 of Appendix of 1911 M. E. R. 1911 p 90.**)

*(౨౩౬) ౧౭౩౩ విజయరంగ చొక్కనాథుని భార్య వితంతువు మీనాక్షి తిరుచునాపల్లి కోట గుమ్మందగ్గిర దానధర్మాల కోసం యిచ్చిన దానము. (**S. E. P. 49.**)

## నాయకులనాటి తెలుగు సాహిత్యం

మధుర రాజ్యాన్నికూడా తంజావూరు రాజ్యంలాగనే ౧౬-వ శతాబ్దంనుంచీ విజయనగర చక్రవర్తుల సామంతులైన తెలుగు నాయకులే పరిపాలిస్తూవున్నా సామ్రాజ్య రాజధానియైన విద్యానగరానికి మధుర కొంచెము దూరముగానున్నందువల్లను, మధుర నాయకులకు మైసూరు రాజులతోను, చక్రవర్తితోను తరుచుగా తగవులు వచ్చి యుద్ధములు తటస్థిస్తూవున్నందువల్లను దేశంలో శాంతిలేక సంగీత సాహిత్యాలు తంజావూరు రాజ్యంలోలాగ వెంటనే అభివృద్ధిగాంచలేదు.

౧౬౨౩ మొదలు ౧౬౫౯ వరకూ మధురను పరిపాలించిన తిరుమలనాయకుడనే తిరుమల శౌరి నాయని అయ్యలుగారి కాలంలో మధుర బలవంతమై, సుభిక్షమై విజయనగర చక్రవర్తుల అధికారాన్ని కూడా ధిక్కరించి వర్ధిల్లినది. అప్పటినుంచి అక్కడ కూడా సంగీత సాహిత్యాలు, కళలు అభివృద్ధి గాంచినవి.

తిరుమల నాయకుడు చాలా సొమ్ము ఖర్చుపెట్టి చిత్ర శిల్పములతో నొక గొప్ప రాజనగరును నిర్మించాడు. మీనాక్షిసుందరేశ్వర దేవాలయాలను పునర్నిర్మాణము చేయించాడు. తంజావూరు రాజులాగనే తన రాజసభలో సంస్కృతాంధ్ర తమిళ కవులను, విద్వాంసులను చేర్చి ఆదరించాడు. రుక్మిణీపరిణయము, సత్యభామా సాంత్వనము అనే తెలుగు ప్రబంధములను రచించి తిరుమల నాయకుని కుమారుడైన ముద్దు అళగిరికి కృతియిచ్చిన కామేశ్వరకవి తిరుమల నాయకుని వలనకూడా రాజసన్మానం పొందినట్లు అతడు తన సత్యభామా సాంత్వనంలో "దక్షిణసింహాసనాధ్యక్ష తిరుమల క్షమాకాంత కరుణాకటాక్ష లక్షిత స్వచ్ఛముక్తా గుళుచ్ఛ సితచ్ఛత్ర చామరకళాచికా కన కాందోళికాది రాజోపచార" అని చెప్పుకున్న మాటలవల్లనే తెలుస్తున్నది.

కామేశ్వరకవిని తిరుకామకవి అనికూడా అనేవారు. ఇతడు తిరుమల నాయకుని తరువాత ఆయన కుమారుడైన చొక్కనాథుని కాలంలోనూ, ముద్దు అళగిరి కాలంలోనూకూడా రాజసన్మానమును పొందినాడు. భీష్ముడు ధర్మరాజునకు చెప్పిన గోమాహాత్మ్యమనే పేరుతో వ్రాసి ఒక కొత్తపద్ధతి తెలుగువచన కావ్యరచనకు మార్గదర్శియైనాడు. ఈ గ్రంథము ప్రారంభములో 'చొక్కనాథుని శ్రీరంగేశుడు ప్రోచుగాక'యనే ఆశీర్వచనమున్నందువల్ల కవి యాగ్రంథము నారాజు కంకితమిచ్చినట్లెంచవచ్చును.

శృంగార రాధామాధవమనే ప్రబంధమును రచించిన వెలిదండ్ల వెంకటపతికూడా చొక్కనాథుని కాలంలో మధురరాజ స్థానములోనుండేవాడు. ఇతడు తన రాధికా సాంత్వనమును తంజావూరు మండలము

* **Nayaks of Madura By R. Sathyanatha Iyer. (Numbers refer to Appendix D.) pp** 333-372,

లో కావేరీ పట్టణాధీశుడైన మడగల రామనామాత్యుని కంకిత మిచ్చినాడు.

తరువాత ౧౭౦౦-౩౮ మధ్య మధుర నేలిన విజయరంగ చొక్కనాథుని రాజస్థానములో నుండిన అళగిరికవి ఈ వెంకటపతి మేనల్లుడే. అళగిరికవి సుదంతా పరిణయమనే గ్రంథమును రచించాడు. అతని కుమారుడైన తిరువెంగళార్యుడు గొప్ప గాయకుడు, వైణికుడుకూడా. అతడు వ్యాసతాత్పర్య నిర్ణయమనే గ్రంథము రచించాడు.

తిరుమల నాయకుని మనుమడైన విజయరంగ చొక్కనాథుని కాలంలో సంగీత సాహిత్యకళలు చాలా అభివృద్ధి గాంచినవి. విజయరంగ చొక్కనాథుని బాల్యంలో మధురరాజ్యానికి చాలా చిక్కులు కలిగినవి. యుద్ధంవల్ల దేశశాంతిలేకపోవడమేగాక దేశంలో కరవు, అంటు వ్యాధులు చెలరేగినవిగాని విజయరంగ చొక్కనాథుని పితామహియైన మంగమ్మ గారున్నూ, ఆవిడకింద దళవాయి ప్రధానామాత్యుడు గాను వుండిన నరసప్పయ్యగారి చాకచక్యమువల్లను ఈ చిక్కులు తొలగి దేశములో శాంతి కలిగి సుభిక్ష మైనది. అందువల్ల విజయరంగ చొక్కనాథుడు రాజ్యానికి వచ్చేటప్పటికిఈచిక్కులులేక అతడు విద్యా గోష్ఠిలో ప్రొద్దు పుచ్చడాని కవకాశం కలిగినది. అతడు స్వయంగాకూడా తెలుగులో గ్రంథాలు రచించాడు. ఆయన రాజసభలో కవులు, గాయకులు అనేకు లుండేవారు. ఆయన సామంతులలో కొందరు తెలుగులో గ్రంథాలు రచించారు. వారిలో సముఖము వెంకట కృష్ణప్ప నాయకుడు ప్రముఖుడు. విజయరంగ చొక్కనాథునిలాగనే ఆయనసామంతులును కవులను, పండితులను ఆదరించేవారు. సముఖము వెంకటకృష్ణప్ప నాయకుడు అహల్యాసంక్రందనము, రాధికాసాంత్వనము అనే రెండు తెలుగు ప్రబంధాలను రచించాడు. అతని స్నేహితుడైన శేషము వెంకటపతి తారాశశాంకవిజయమును రచించి విజయరంగ చొక్కనాథుని మంత్రులలో నొకడైన వెంగళ సీనయ్యగారి కంకితమిచ్చినాడు. వెలగపూడి కృష్ణయ్య మాలతీమాధవీయమును, భానుమద్విజయమును రచించాడు. మాలతీమాధవీయము భవభూతి సంస్కృత నాటకానికి తెనుగు. అతడు విజయరంగ చొక్కనాథుని దళవాయిలలో నొకడైన సాంబయామాత్యునికి దగ్గరబంధువు. ఇతడు వేదాంత సారసంగ్రహమనే తెలుగు వచనగ్రంథాన్ని కూడా రచించాడు.

విజయరంగ చొక్కనాథుని సభలో నుండిన వెలిదండ్ల ముద్దళగిరి యనేకవి రాజుగారి కోరికపైన సుదంతా పరిణయమనే తెనుగు ప్రబంధాన్ని రచించి శ్రీరంగనాథస్వామి కంకిత మిచ్చినాడు. భారతీ పరిణయమనే గ్రంథమును రచించి విజయనగరచక్రవర్తి యైన వీర వెంకటపతిరాయల కంకితమిచ్చి ఆయనవల్ల కనకాభిషేక గౌరవమును పొందిన గోవిందామాత్యుడనే కవియొక్క మనమడైన కుందుర్తి వెంకటాచలకవి విజయరంగ చొక్కనాథుని యాస్థానములో రాజసమ్మానము పొందినాడు. అతడు మిత్రవిందా పరిణయము, కార్తికేయ మాహాత్మ్యము అనే రెండు తెలుగు ప్రబంధములను రచించినాడు. పెద్దపూడి ఎట్టియకవి యువజనహృదయరంజనమనే గ్రంథమును రచించినాడు. ఆకాలములోనే తిరుమలకవి చిత్రకూట మాహాత్మ్యమనే తెనుగునాటకమును రచించి శ్రీ రంగనాథుని కంకితమిచ్చి కొత్త దారి త్రొక్కినాడు.

ఇలాగ ఆకాలంలో మధురలో కొన్ని తెలుగు ప్రబంధములు, ఒకనాటకముకూడా వెలసినప్పటికిని ఆరాజాస్థానములో తెలుగు వచనానికే ఎక్కువ రాజాదరణ కలిగినది. దీనికి కారణము దేశభాష అరవమైనందువల్ల ప్రజలకు సులభముగా గ్రాహ్యమయ్యేటట్లు గ్రంథాలు తెలుగు వచనములో నుండుట యవసరమనే సంగతిని ఆరాజు గ్రహించడమే. అందువల్ల విజయరంగ చొక్కనాథుడే స్వయముగా శ్రీరంగమాహాత్మ్యము, మాఘమాహాత్మ్యము మొదలైన గ్రంథాలను తెలుగు వచనములో వ్రాసినాడు. ఆయన సామంతుడును, రాజోద్యోగిన్నీ అయిన సముఖము వెంకటకృష్ణప్ప నాయకుడున్నూ జైమిని భారతమును,



నిజంగా అతను
లైఫ్‌బాయ్
అభ్యాసము నేర్చుకున్నాడు

అతను స్కూలుకు వెళ్లినాడు, అక్కడనుంచి ఏమి తెస్తాడో? విజ్ఞానము, క్రొత్త పద్ధతులు—బహుశా ఏలంటు వ్యాధులు వ్యాపింపచేసే క్రిములనో తెస్తాడు: తానునేర్పిన పద్ధతుల వలన తన కుమార్డు సురక్షితముగా వుండునట్లుచేసి వాని తల్లి వానిని స్కూలుకు పంపుతుంది — అన్నిటిలోకి ముఖ్యమైనదేమంటే, ఎంతబలవంతుడైన పిల్లవాడైనప్పటికి క్రిములవలని వ్యాధిగ్రస్తుడగుటకు కారణమైనటువంటి "మురికివలని అపాయము" నుండి రక్షించే లైఫ్ బాయి సబ్బును ప్రతిదినమూవాడటమే.




లైఫ్‌బాయ్ యంచి సబ్బుల్లోకె ఉత్తమమైనది
ఇది యంచి అలవాటు

L 78-23 TL

LEVER BROTHERS (INDIA) LIMITED

సారంగధర చరిత్రమును తెలుగువచనములో వ్రాసినాడు. శ్యామరాయకవి రామాయణవచనమును, శ్రీపతి రామభద్రకవి హాలాస్య మాహాత్మ్యమును రచించాడు. కుందుర్తి వెంకటాచలకవి తెలుగువచనములో భాగవతమును, రామాయణమును రచించాడు.

విజయరంగ చొక్కనాథుని (౧౭౦౦-౩౮) సమకాలీనుడును, యుద్ధములలో ఆయనకు సహాయముగా నున్నవాడునైన పుదుక్కోటరాజైన విజయరఘునాధ రాయడుకూడా తెలుగు కవుల నాదరించేవాడు. శేషయ్య యనే కవి పుదుక్కోట నేలిన తొండమాను రాజులను పొగుడుతూ ఒక శతకమును రచించినాడు. విజయరఘునాధ రాయల కుమారుడైన రాయరఘునాథుడు నుదురుపాటి వెంకనార్యుడనే గొప్పకవి నాదరించాడు. ఈకవి ఆంధ్రభాషార్ణవమనే గొప్పనిఘంటువును రచించి మాతృభూతేశ్వరున కంకితమిచ్చినాడు. రఘునాథీయమనే అలంకార గ్రంథమును కూడా రచించినాడు. రాయరఘునాధరాజే రచించినట్లు చెప్పబడే పార్వతీపరిణయమనే తెలుగు ప్రబంధమును కూడా ఈ కవియే రచించినట్లు ప్రతీతి. ఈకవికుమారుడైన సాంబశివకవి బిల్హణీయమును రచించి ఇంకొక తొండమాను రాజు కంకితమిచ్చినాడు. ఇతడు తొండమానువంశ ప్రతాపమాలికయనే గ్రంథమునుకూడా రచించినాడు. పుదుక్కోట రాజాస్థానములో శ్రీమన్నారాయణ సూర్యశేఖరయ్య, కవిశేషయ్య మొదలైన కవు లుండేవారు.

తిరుచునాపల్లి మండలములోని వెంగూలమున కధికారియైన లింగారెడ్డి శేవూరి అనంతార్యుడనే కవిని పోషించగా అతడు వృద్ధాచలమాహాత్మ్యము నతని కంకిత మిచ్చినాడు.

సేలము జమీందారుడైన బధిరకృష్ణమ నాయకుడుకూడా తెలుగు కవుల నాదరించినాడు. అనంతార్యుడు తన గయోపాఖ్యానము నతని కంకితమిచ్చినాడు.

తంజావూరు రాజసభలో లాగనే మధురరాజస్థానంలో కూడా భరతనాట్య మభివృద్ధి జెందినది. యక్షగానములు, కథలు రచించబడి రాజాదరణము పొందినవి.



# పిచ్చి బాబు*

= శ్రీ రా. సి. ఆంజనేయశాస్త్రి =

౧

ఆయన:

గాయత్రిని ఒదిలిన కర్మిష్ఠీ
వాంఛలు తీరని స్వేచ్ఛాజ్ఞానీ,
గుళ్లోకన్నా వెళ్లని భక్తుడు.

౨

ఆయనలో:

అద్వైతపు చిటారుకొమ్మన
అనేకత్వపు ఆభాసం
బ్రహ్మచర్యపు గార్హస్థ్యం
వానప్రస్థంలో సన్యాసం
కులాలన్నిటి
కలగాపులగం.

౩

ఆయనది:

ఆవుని చంపిన అహింసా
స్వరాజ్యం తేలేని సత్యవాక్కూ—!

౪

ఆయన ఉద్దేశం:

అంతర్వాణని, ఆత్మదర్శన మని
అరుణారుణ రుధిరజ్యోతిలో
అమృతకాంతులు చూద్దామని.

౫

ఆయనకి:

శత్రువులు కానట్టి
మిత్రులే లేరు
అయినా ఆయన
అజాత శత్రువు!!

అందుకనే—

మనుషులికి కావాలి
మా పిచ్చి బాబు!!!

* మహాత్ముని జన్మదిన సందర్భంలో ఇటీవల లక్నోనుంచి సోహన్‌లాల్ ద్వివేదీ గారి సంపాదకత్వాన "గాంధి అభినందన గ్రంథం" అనే హిందీగ్రంథం ఒకటి ప్రచురింపబడింది. దాంట్లో ప్రపంచపు భాషలన్నింటిల్లోనూ,—ముఖ్యంగా హిందూదేశపుభాషల్లో, మహాత్మాగాంధీగారిని గురించి రాయబడిన కవితల్ని ఏరి, దేవనాగరిలిపిలో ప్రచురించారు. వాటిభావాల్ని హిందీలోకూడా ఆగ్రంథంలోనే చివర అచ్చువేశారు. ఆగ్రంథంలో ప్రచురింపబడిన దీ తెలుగురచన.

# ఇంటిపేరు



= శ్రీ చిలుకూరి నారాయణరావు =

'భారతి' కడపటినెల సంచికలోని శ్రీ మేరు సోమయాజుల వరహాలుగారి 'ఇంటిపేరంటే' అనే వ్యాసం చక్కని పరిశోధనకు విషయమైనది. ఆ వ్యాసము నింకా కొంచెము లోతుగా ఆలోచించి వ్రాస్తే ఎక్కువ సంతోషించేవాడను. వరహాలుగారు అక్కడక్కడ హాస్యములోనికి దిగి వ్యాసమునకు శాస్త్రరీత్యా న్యూనతను కలుగజేయకుండా ఉంటే బాగుండేది.

విషయము సామాన్యమైనది కాదు. దానిని గురించి పాశ్చాత్యభాషలలో పెద్దపెద్ద గ్రంథా లనేకములు బయలుదేరినవి. అట్టివి బీరువాలకొద్దీ ఉన్నవి. దానినిగురించి చర్చించడానికి మానవశాస్త్రము (**Anthropology**), మానవజాతిశాస్త్రము (**Ethnology**), సంఘతత్త్వశాస్త్రము (**Sociology**), మనస్తత్వశాస్త్రము (**Psychology**), (ప్రపంచ) చరిత్రము మొదలయిన ఎన్నో విషయాలతో పరిచయమును సంపాదించవలెను. ఇదిగాక మతములు, సంప్రదాయములు, ప్రత్యేకాచారములు, అనాగరకజాతులలోని పద్ధతులు మొదలయిన ఎన్నో విషయములను గురించి తెలుసుకొని ఉండవలెను. విమర్శపద్ధతులను తెలిసి ఉండవలెను.

వరహాలుగారు ఆరంభించిన పరిశోధన శ్లాఘాపాత్రమైనది. కాని వారు దానిని పైపైన స్పృశించి విడిచిపెట్టినారు. వారింకా ఈ విషయమై ఎక్కువ శ్రద్ధతో, జ్ఞానతృష్ణతో సాగించవలెనని కోరుతున్నాను. వారి వ్రాతలో తప్పులెంచే ఉద్దేశముతో గాని, ఆక్షేపించే ఉద్దేశముతో గాని దేను దీనిని వ్రాయలేదనిన్నీ, ఈ విషయమై సక్రమముగా, లోతుగా ఆలోచింప పురికొల్పడానికే వ్రాస్తున్నాననిన్నీ, వారున్ను, ఈ విషయమై పరిశోధన సాగింపనెంచేవారున్ను తలచి కృషిని సాగిస్తే ఆంధ్రుల విజ్ఞానానికి చాలాతోడ్పడగలరని హెచ్చరిస్తున్నాను.

వరహాలుగారు తమ వ్యాసములో సాధారణముగా ఒక్క బ్రాహ్మణుల యింటిపేళ్లనుమాత్రమే యెత్తుకున్నారు. ఇతరవర్ణాలవారి యింటిపేళ్లను గురించి కూడా ఆలోచిస్తే చాలా చిత్రాలు బయలుదేరుతవి. ఇంటిపేళ్లలో స్థూలముగా కనబడుతూవున్న భేదాలనుమాత్రము వారు స్పృశించినారు. వాటిని గూడా కొంచెము లోతుగా విమర్శించలేదు. ఉదాహరణముగా కొన్నిటిని చూపిస్తాను. 'భక్షి' అనే దానిని, 'షరాబుఖానా' అనేదానిని బిరుదులపేళ్లలో చేర్చినారు. ఇవి బిరుదులు కావు. భక్షి అంటే మహారాష్ట్రభాషలో గుమాస్తా, కరణం, వ్రాయసకాడు అని అర్థము. ఇది ఒక ఉద్యోగముపేరు. 'షరాబ్ఖానా' అంటే షరాబు ఉద్యోగమునకు సంబంధించిన కార్యాలయము. అందులో ఉద్యోగము చేస్తూవుండేవారు కాబట్టి వారి కాయింటిపేరు గలిగినది.

సర్వసిద్ధి, జనమంచి అనేవి ప్రజ్ఞా, ప్రకర్షలను సూచిస్తవన్నారు. ఇవి రెండున్ను వూళ్లపేళ్లే గాని ప్రజ్ఞా, ప్రకర్ష సూచకాలు కావు. నేమాని అనేది వూరిపేరు. ఆవూరినుండి వచ్చిన ద్రావిడులలోను, వేగినాట్లలోనూ గూడా నేమానివారున్నారు. ఆ వూరిలో ఒకప్పుడుండిన అన్నివర్ణములవారికిన్ని ఆ యింటిపే రుండవచ్చును. శ్రీరంగము, ద్వారక, వారణాసి మొదలైన యింటిపేర్లు గ్రామనామాలలో

చేర్చుకోవలసినవి కాబట్టి వాటిని ప్రత్యేకంగా వుదాహరించ నక్కరలేదు. 'వెంపల' అనేది కూడా గ్రామనామమే. ఉచ్చారణసామ్యమునుబట్టి చెట్లపేరులలో చేర్చినారు. అల్లే కడియాల, గంపల, ముప్పిడి, దాట్ల, దావాల, వేలాల అనేవికూడా గ్రామనామాలే. గంటివారు అనేదానికి గరిటతో సంబంధ ముందేమో విచారణీయం. కాని మాగంటి, చాగంటి, పానుగంటి మొదలైన పేళ్లు మాగల్లు, చాగల్లు, కాపుగల్లు, పానుగల్లు మొదలైన స్థలవాచకశబ్దములకు ఔపవిభక్తిక రూపములు. వీటికిన్ని, గంటికిన్ని యేమి సంబంధమున్నదో విమర్శించనిది చెప్పడానికి వీలులేదు.

ఆంధ్రులలో మొదటినించీ యింటిపేళ్లు లేవని ఒక్కమాటతో త్రోసి వేయడానికి వీలులేదు. ఏజాతిలో అయినా, యేసంఘంలో అయినా యింటిపేరనేది వుండితీరాలి. ఇంటిపేరి తత్వమును మొదట విమర్శించుకొననిదే యేమి చెప్పడానికిన్నీ అధికారము కుదురదు. ఆ తత్వనిర్ణయమునకు కొన్ని సూచనలను మాత్రము చేసి యిప్పటికి విరమిస్తాను.

ప్రపంచములోని జనులు ప్రత్యేకవ్యక్తులు. కొన్నికొన్ని సంప్రదాయాల ననుసరించి వారి వ్యక్తిత్వమును నిర్ణయించి, 'ఇతడు వీడు' అని నిరూపించడానికి పేళ్లు ఏర్పరుపబడుతవి. ఎంతమంది వ్యక్తులు ప్రపంచములో ఉన్నారో అందరికీ అన్నిపేళ్లు ఉంటవి. వ్య క్తుల సంఖ్య ఎంతో వారి పేళ్ల సంఖ్య కూడా అంత ఉండవలెను. కాని, ఆ పేళ్లు అనేకులకు సామాన్యముగా ఏదో ఒకటి పెట్టుతూఉండడము చేత ఆ పేళ్ల సంఖ్య చాలా తక్కువ అవుతున్నది. వరహాలు అనే పేరు గల వ్యక్తు లనేకులున్నా ఆపేరు మాత్ర మొక్కటే. ఈ సంజ్ఞావాచకపదము లెట్లేర్పడినవో ప్రత్యేకపరిశోధన చేసి తెలుసుకోవాలి. ఇంటిపేర్లనుగురించి తెలుసుకొనడముమాత్రము మనకిప్పుడు కావలసినది.

ఒకపేరు గల వ్యక్తి ఎవడో నిస్సందేహముగా నిర్ణయించవలసిన అవసరము సాధారణసాంఘికవ్యవహారాలలో కలుగుతూ ఉంటుంది. దానిని మన దేశములో ఎట్లా చేస్తూవస్తున్నారో కొన్ని ఉదాహరణలిస్తే విషయము స్పష్టమౌతుంది.

ఉపనిషత్తులలో వైదికపురుషుల పేళ్లు కనబడుతున్నవి. బృహదారణ్యకమునుంచి కొన్ని యిస్తాను.

"దృప్తబాలాకిః గార్గ్యః అజాతశత్రుం కాశ్యం ఉవాచ." (గార్గ్యుల దృప్తబాలాకి అనేవాడు కాశీ అజాతశత్రునితో పలికెను. దీనికి సరియైన నేటి వ్యవహారము: దూర్వాసుల చిన్నదక్షిణామూర్తి కాశీకృష్ణమూర్తితో చెప్పెను.)

బాలాకి అనే పేరు గలవారు అనేకు లుండవచ్చు. వారిలో కొందరు గార్గ్యవంశములోనివారు. ఆ గార్గబాలాకులలో ఎవడు అన్నప్పుడు దృప్తబాలాకి అని మరింత స్పష్టమౌతున్నది. అజాతశత్రునాము లనేకు లున్నప్పుడు కాశీలోని (కాశీనుంచి వచ్చిన, కాశీనుంచి వచ్చిన వంశమునకు చెందిన) అజాతశత్రువు అనే పేరు గలవాడు అనే మరికొంత సూక్ష్మనిర్దేశము. అట్లే కాశీకృష్ణమూర్తి అనే నిర్దేశముకూడాను. 'దూర్వాసుల' అనే ఇప్పటిపేరు ఎట్లా వచ్చినదో తెలియదు. అది గోత్రనామమైతే కావచ్చు. కాని, ఇప్పటి దూర్వాసులవా రందరూ ఏకగోత్రికులుగా కనబడరు. ఏకగోత్రమువారయినా ఏకప్రవరవారై ఉండనక్కరలేదు. 'దూర్వాసుల' అనే పేరు నడిమికాలములో ఎవడో మిక్కిలి కోపిష్ఠి కావడము చేత లోకు లతనిని దూర్వాసుడు అని పిలువగా పిలువగా అదే రూఢి అయిపోయి అతని సంతతికికూడా ఆ పేరు అనుబంధముగా నిర్దేశవాచకముగా కుదురుకొని ఉండవచ్చును. ఒక్క వంశములోనే ఏకకాలములో దక్షిణామూర్తి అనే పేరుగలవా రొక్కరి కంటె ఎక్కువమంది ఉంటే పెద్ద దక్షిణామూర్తి, చిన్న (పిన్న) దక్షిణామూర్తి అనికాని, నల్ల, ఎర్ర, కుంటి, చెవిటి మొదలయిన విశేషణములు కాని చేరుతవి.

"గార్గీ వాచక్నవీ పప్రచ్ఛ" (వాచక్నువారి గార్గి అడిగినది. వాచక్నుఋషి వంశములోని గార్గి

అని అర్థము. "మాదిరెడ్డి వెంకటలక్ష్మమ్మ, అయ్యల రాజువారి అన్నపూర్ణమ్మ.";

"ఉద్దాలక ఆరుణిః ప్రపచ్ఛ" (అరుణుని కొడుకు ఉద్దాలకుడు అడిగినాడు—అచ్చన్న కొడుకు బుచ్చన్న; అచ్చాయగారి బుచ్చన్న.)

"వాచక్నవి వ్యవాచ" (వాచక్నవి పలికినది-స్థానము వేసము వేసినాడువలె.)

"జనకో వైదేహః" (విదేహదేశపు జనకుడు, ఆరె రామచంద్రరావు. ఆరెదేశము (మహారాష్ట్ర దేశము) నుంచి వచ్చిన ఒక వంశమునకు చెందిన అని అర్థము.)

ధర్మశాస్త్రాలలోని గోత్రప్రవరఖండ మంతా ప్రత్యేకవ్యక్తుల స్థూలనిర్దేశాని కేర్పడినదే. ఇట్లే సూత్రము, శాఖ మొదలయినవికూడాను. ఇవన్నీ ద్విజులకు సంబంధించిన విభాగము. మహాసంకల్పమంతా తుదను ప్రత్యేకవ్యక్తిని సూక్ష్మముగా తెలుపడాని కేర్పడినదే. దానిలోని ఒక భాగమే సంధ్యావందనాంతమున చెప్పుకొనే అభివాదనక్రియ.

ఇంటిపేరుకున్నూ, పైని చెప్పిన దానికిన్నీ సంబంధ మేమిటో ఇప్పటికి కొంచెము బోధపడుతుం దనుకొంటాను.

ఇక ఆంధ్రశాసనాలను చూదాము. శాలి (త) వాహనుడు ప్రఖ్యాతపురుషుడు (మాదిరెడ్డివలెనే). అతనిదగ్గరసంతతివారు అతనికి సంబంధించినవార మని చెప్పుకొనడాని కాపేరును నిర్దేశవాచకముగా పెట్టుకొన్నారు. శ్రీముఖశాతవాహనుడు అంటే శాతవాహన వంశపు పేరు నిర్దేశనామముగా గల శ్రీముఖుడు అని అర్థము. ఈ పేరు ఉపనామముగా కొంతకాలము ఆవంశములో చెల్లినది. ఆ తర్వాత ఆ వంశములోనే కర్ణనామకు డొకడు మరొక ప్రఖ్యాతపురుషుడు బయలుదేరడముచేతను, శాతవాహనవంశములో అనేక ము లేర్పడడముచేత అందులో ఒక ఉపవంశము వారిని ప్రత్యేకముగా నిర్దేశించవలసిన ఆవశ్యకత ఏర్పడడముచేతను కర్ణనామ మా ఉపపదముగా కుదురుకొనడము సంభవించినది. ఇట్లా ఇంటిపేర్లు కొన్నాళ్లకు మారిపోయే సంప్రదాయం తెనుగువారిలో ఉన్నది.

చాళుక్యుల యింటిపేరు సల్కివారు. వారిలో నుంచి చీలిపోయిన తూర్పుచాళుక్యుల యింటిపేరు మానవ్యసంవారు. రాజరాజనరేంద్రుని కులబ్రాహ్మణుడైన నన్నయభట్టు ఇంటిపేరు మానవ్యసశోద్భవమైన వానసంవారు. నన్నయభట్టు వానసవంశవిభూషణు డని గ్రంథాలవల్ల, శాసనాలవల్ల తెలుస్తున్నది. తిక్కన్న యింటిపేరు పాటూరివారు. కేతనయింటిపేరు మూలఘటికవారు. "మూలఘటికాన్వయుడన్ కేతన యనువాడన్" అన్నప్పుడు అతనిని సూక్ష్మముగా నిర్దేశించే నామము మూలఘటికకేతన అయి మూలఘటిక అనేది ఇంటిపేరుగా నిలువవచ్చును. ఇక్కడ గమనించవలసిన విషయ మొకటి ఉన్నది. అన్వయము, వంశము, గోత్రము మొదలయినవాటి పేర్లు కొన్ని సమయాలలో ఇంటిపేర్లుగా నిలువవచ్చును. కాని, ఇంటిపేర్లన్నీ అన్వయ, వంశ, గోత్రాలపేర్లే అయిఉండవలె నన్న నిర్బంధము లేదు. కౌరవదుర్యోధనుడు సుప్రసిద్ధుడు కాబట్టి అతనిని ప్రత్యేకముగా ఉపపదముతో నిర్దేశించ నవసరములేదు. కాని, సుప్రసిద్ధుడైన కౌరవుడుకాని మరొక దుర్యోధనుని నిర్ణయింపవలసివచ్చినప్పుడే ఉపపదాలతో వారిని ప్రత్యేకించవలసివస్తుంది. అప్పు డొకడు కౌరవదుర్యోధను డౌతాడు; రెండోవాడు రౌరవములోనివాడైతే రౌరవదుర్యోధను డౌతాడు. ఇద్దరికీ అప్పుడు భేద మేర్పడి ఒకరిని మరొకరినిగా భ్రమపడడానికి వీలు లేకపోతుంది. అట్లే యాదవకృష్ణుడుకాక భూధవకృష్ణుడు మరొక డుండి వారిద్దరికీ ప్రత్యేకత్వము నిరూపింపవలసివచ్చినప్పుడు ఒకడు యాదవకృష్ణుడనీ, ఒకడు భూధవకృష్ణుడనీ వ్యవహారము కలుగుతుంది. వారి సంతతులవారిలో ఒకరు యాదవకృష్ణవా రౌతారు, రెండోవారు భూధవకృష్ణవా రౌతారు. లేదా, ఆ యిద్దరి పేళ్లున్నూ వారి వారి తండ్రుల పేళ్లతో ప్రత్యేకింపబడవచ్చును.

అప్పుడొకడు వసుదేవకృష్ణుడు, మరొకడు నరసింహ కృష్ణుడౌతాడు. ఒకని సంతతి యింటిపేరు వసుదేవ కృష్ణంవారు; రెండోవాని సంతతి ఇంటిపేరు నరసింహ కృష్ణంవారు అవుతుంది. శ్రీనాథుని కింటిపేరుతో వ్యవహారము లేదు నిజమే. కాని, అసలు శ్రీనాథుడు అనే పేరు కవి తనకు ప్రత్యేకముగా పెట్టుకొన్నదేమో. ఆ పేరుతోనే ప్రసిద్ధికి వచ్చివేసినాడు కాబట్టి మరి యింటిపేరవసరము లేకపోయినది. ఆకాలములో గాని, మరొక కాలములో గాని మరొక శ్రీనాథుడుండి ఇద్దరికీ భేదము కల్పించవలసి ఉంటే మాదయ్యగారి మల్లన్నవలె శ్రీనాథుడు మారయ్యగారి శ్రీనాథుడై ఉండేవాడు. సంస్కృతనామము పెట్టుకొన్నదైనా లోకు లతనిని మారయ్యగారి శ్రీనాథయ్య, శ్రీనాథన్న అనే పేళ్లతో పిలిచి ఉందురు. ఇట్లే అహోబలపండితు డాపేరిని తాను పెట్టుకున్నాడు. 'వాతూలవంశపయఃపారావారసుధాకరాహోబల పండితుడ' నని అతడు గద్యలో వ్రాసుకొన్నాడు. అతనియింటిపేరు గాలివారు; అతని వ్యవహారనామము నరసయ్య. గాలి నరసయ్య స్వహస్తం వ్రాసుకొన్న అహోబల పండితీయపు ప్రతి నావద్ద ఉన్నది. రామరాజభూషణ అనేది అతని అసలు వ్యవహారనామము కాదు. అది ఒక బిరుదము. రావుబహుదూరు వంటిది. ఊరికొక్కడే రావుబహుద్దూరుంటే ఆయనే రావుబహుదూరవుతాడు. మరొక్కడుకూడా ఉన్నప్పుడే ఆ పదాని కుపపదము చేర్చాలి. అట్లాగే వేరే ఊళ్ల రావుబహుదూర్లు. రామరాజభూషణబిరుద మొక్కనికే ఉంది కాబట్టి అతని కింటిపేరక్కరలేదు. అతనికి ప్రత్యేకమైన పేరు, ఇంటిపేరు ఉండనే ఉంటవి.

ఇంటిపేర్లు గ్రామనామాలయినప్పుడవి అట్లాగే ఆసంతతులవారికిన్ని ఆ యింటిపేరు నిలిచి పోనక్కరలేదు. ఆయావ్యక్తులొక్కటే ఊరిలోనే నిలిచి ఉంటే అతని కా ఊరిపేరు ఇంటిపేరు కానక్కరలేదు. అతని కింటిపేరే అక్కరలేదు. అతడు మరొక ఊరికి వాసస్థానము మార్చుకొంటే తాను విడిచిన ఊరిపేరు ఇంటిపేరవుతుంది. ఉదాహరణానికి రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ ఇంటిపేరు రాళ్లపల్లి అయినా అతని స్వయముసోదరుల యింటిపేరు కరణమడకలవారు. ఆ అనంతకృష్ణశర్మ ఇప్పుడున్న మైసూరిని విడిచి అనంతపురము చేరుకొంటే ఇంటిపేరు మైసూరువారు కావచ్చును. ఇట్లే ఇతరములైన యింటిపేళ్ల విషయములో కూడాను. కాని కొన్నికొన్ని కుటుంబాలలో ఇంటిపేరు చాలాతరాలవరకు అట్లే నిలిచిపోతుంది. ఈ నిలిచిపోవడము ఉత్తరసర్కారులలో ఎక్కువగా కనబడుతుంది. రాయలసీమలో ఇంటిపేరు అస్థిరముగా ఉన్నట్టు నాకు తెలిసినంతమట్టుకు తేలినది.

ఇంటిపేర్లను గురించిన ఈ క్రిందివిషయాలను సంగ్రహముగా చెప్పవచ్చును :

౧. ప్రపంచములో అనేక వ్యక్తులున్నారు. వీరు నానాదేశములలో నివసిస్తున్నారు. ఒక్కొక్క దేశమువారు ఒక్కొక్క ప్రాంతములో ఉంటారు. ఆ ప్రాంతమునకు మండల మందాము. ఒక మండలములో ఎన్నో ఉపమండలములు, ఒక్కొక్క ఉపమండలములో ఎన్నో పల్లెలు, పట్టణములు ఉంటవి.

౨. జనులు ఆయాప్రాంతములలో రాజకీయ, మత, ఆర్థిక, సాంప్రదాయిక భేదాలనుబట్టి ప్రత్యేక సంఘాలుగా విడబడి ఉంటారు. ఒక్కొక్కసంఘము ప్రత్యేకకుటుంబముల సముదాయముగా ఉంటుంది. ఆ కుటుంబములు ప్రత్యేక వర్ణ, ఆచార, వృత్తి, ఉద్యోగాదిభేదములచేత ప్రత్యేకము లవుతూ ఉంటవి.

3. ఆ ప్రత్యేకకుటుంబములలోని వ్యక్తులు తమలో తాము వ్యవహరించుకొనడానికి ఇంటిపేళ్లను ఉపయోగించుకొనరు. అంటే ఒకరినొకరు పిలుచుకొనేటప్పుడు ఇంటిపేరును చేర్చి పిలుచుకొనరు. అమ్మ, నాయన, అక్క, చెల్లెలు, మామ, అత్త మొదలయిన బంధుత్వపు పేళ్లతోనే పిలుచుకొంటారు. ఇంకా స్పష్టముచేయవలసివస్తే చిన్న, పిన్న, పెద్ద, నడిమి మొదలయిన విశేషణాలను చేర్చుకొంటారు. లేదా, సంక్షిప్తనామాలతో జగ్గు, నరుసు, సీను అని పిలుచుకొంటారు. లేకపోతే క్రొత్త వెక్కిరింపుపేళ్లు

పెట్టి పిలుస్తారు. ఒక కుటుంబములోనివారిని మరొక కుటుంబములోనివారినుంచి వేరుచేసి పిలువవలసివచ్చినప్పుడే ఇంటిపేరు కావలసివస్తుంది.

౪. ఇంటిపేర్లు కలుగడానికి అనేకకారణాలున్నా, వాటి అన్నిటి ప్రయోజనమున్నూ వ్యక్తి నిర్దేశముకోసమే.

౫. ఇంటిపేరొక కుటుంబమున కెల్లకాలమూ ఒకటిగానే నిలువనక్కరలేదు. అనేక కారణాలవల్ల మారుతూ ఉండవచ్చును.

౬. తాత్కాలిక ప్రయోజనముకోసము వ్యక్తి నిర్దేశము తండ్రిపేరుతోనే చేయడము సమస్తప్రపంచములోను ఉన్నది. భారతదేశములో అన్ని ప్రాంతాలలోను, అన్ని కాలాలలోను ఇదే సంప్రదాయమైనట్లు కనబడుతుంది. తండ్రి పేరుకాక, ఇతర నిర్దేశచిహ్నములను కూడా చేర్చవచ్చును. ఉదాహరణము కాంద్రేగుల శ్రీనివాస జగన్నాథరావు జమీందారు. దీనిలో కాంద్రేగుల అనేది గ్రామనామము. శ్రీనివాస అనేది తండ్రిపేరు; జగన్నాథరావు అనేది వ్యక్తిపేరు. ఈయనకుమారుడు కాంద్రేగుల జగన్నాథగోపాలరావు. దీనిలో కాంద్రేగుల అనేది తండ్రిఉపనామమునుబట్టి కొడుకుకున్ను సంక్రమించి ఇంటిపేరుగా ఏర్పడినది. జగన్నాథ అనేది తండ్రిపేరు. గోపాలరావు వ్యక్తిపేరు. గోపాలరావుకొడుకు కాంద్రేగులగోపాలజగన్నాథరావుసంప్రదాయము ప్రకారము కావలెను. కాని, కాంద్రేగుల ఉమాకాంత శ్రీనివాసరావు అని పేరుపెట్టినారనుకొనండి. అప్పుడు సంప్రదాయము మారిపోతుంది. ముత్తాతపే రిప్పుడు వ్యక్తిపేరయినది. ఉమాకాంత మనేఆయన ఆ కుటుంబమునకు మేలుచేయడముచేత ఆపేరుకూడా ఉపనామమవుతుంది. లేదా, గోపాలరావు తన తరములో నూజవీటిసంస్థానమును కొని నూజవీట స్థిరపడితే ఉమాకాంత శ్రీనివాసరావు పెద్దవాడయి బందరులో చేరుకొంటే అతని సంతతి యింటిపేరు నూజేటివారుగా మారవచ్చును. అప్పుడు ఇంటిపేరు మారిపోతుంది.

ఇట్లే బసవేశ్వరుని తండ్రిపేరు మండెగ మాదిరాజు. మండెగ అనేది ఊరిపేరు. అది అతని ఇంటిపేరనుకోవచ్చును. అతని కొడుకు మండెగమాదిరాజుగారి బసవన్న అవుతాడు. కాని, బసవన్న బిజ్జలునికి కోశాధ్యక్షుడు కావడముచేత భండారం బసవన్న, లేక బండారుబసవన్న అని పిలువబడేవాడు. అతని సంతతివారు ఆ గౌరవోద్యోగనామము నింటిపేరుగా ఉంచుకొని బండారువారు అని వ్యవహరింపబడుతూ రావచ్చును. బండారు తమ్మయ్యగా రావంశములో ఇంటిపేరుగా బండారు అనేదాని నుంచుకొన్నవారై ఉండవచ్చును. ఇట్లే ఇతరరాజులవద్ద భాండాగారులుగా ఉన్నవారినిబట్టికూడా బండారు అనే యింటిపేరు కలుగవచ్చును.

౭. ఒకప్పు డాయింటిపేరు స్థిరముగా చాలా కాలము నిలిచి నేటికిన్ని అదే ఉండవచ్చును. వీరశైవపండితత్రయములో ఒకడైన మంచన శివలెంక అనే భక్తబిరుదనామ ముండబట్టి తాను శివలెంక మంచణ్ణ అని ప్రసిద్ధుడైనాడు. ఆ ప్రసిద్ధినిబట్టి అతని సంతతులవారు శివలెంక అనే గృహనామముతోనే నేటి ఆంధ్రపత్రికా సంపాదకులు శివలెంక శంభుప్రసాదువరకు వ్యవహరింపబడుతున్నారు.

౮. ఇంటిపేరు అనేది ఆంధ్రులలో లేదనకూడదు. అట్లనడము సంఘవ్యవహార విరుద్ధము. ఇంటిపేళ్లు అనాదిగా ప్రపంచములో అన్ని దేశాలతోపాటు ఆంధ్రదేశములోకూడా ఉన్నదే. ఇంటిపేరు లేకపోతే వ్యక్తిని సూక్ష్మముగా నిర్దేశించడము జరుగదు.

ఇతరదేశాలలో సంఘములోని వ్యక్తినిర్దేశ మెట్లు జరుగుతున్నదో ఆయాదేశపు విద్వాంసులకు విడిచిపెట్టుదాము. మన ఆంధ్రదేశములో ఆ సంప్రదాయ మెట్లున్నదో నిర్ణయించడానికి వరహాలుగారివంటి జిజ్ఞాసువులకు విడిచిపెట్టుదాము. అది మహాగందరగోళము. ఒక మహారణ్యము. దానిలోని చిక్కులను విడగొట్టడానికి ఒకరివల్ల కాదు. అనేకులు పూనుకోవలెను. కొన్ని సూచనలను మాత్రము పరిశో

ధకుల కివ్వడముకంటె నావల్ల ఎక్కువకాదు. నాకు తీరిక లేదు.

(౧) ఇప్పటి యింటిపేర్ల జాబితాలను తయారు చేయవలెను. దీనికి పరికరాలు సెన్ససుఆఫీసులలో దొరుకుతవి. వోటర్ల లిస్టులలో దొరుకుతవి. ఓపిక ఉంటే ఏ ఒక్క గ్రామములోనో, పట్టణములోనో ఒక్కసారి ఇంటింటికీ తిరిగి ఇంటిపేర్ల జాబితాను తయారుచేసుకొని, బుద్ధి నుపయోగించి గృహనామ తత్త్వమును నిర్ణయించుకోవచ్చును.

(౨) చారిత్రకముగా పరిశోధించవలెనంటే శాసనాలను సంపూర్ణముగా చూచి జాబితాలను తయారుచేసుకోవలెను. గ్రంథాలలోకూడా ఇంటిపేర్లు అనేకముగా కనబడుతవి. పండితారాధ్యచరిత్రము అనుబంధములో సంజ్ఞావాచకపదముల పట్టికలో ఇంటిపేర్లతో వ్యక్తులపేర్ల జాబితా తయారుచేసుకోడానికి పరికరాలిచ్చినాను. ఇట్లే ఇతరగ్రంథాల నుంచికూడా ఏర్పాటుచేసుకోవచ్చును. మొదట పైపని చేయనిదే ఇంటిపేర్ల తత్త్వవిచారానికి దిగడము శాస్త్రనిర్మాణపద్ధతి కాదు.

(౩) ఇంటిపేర్ల తత్త్వమును తెలుసుకొనడానికి ఈ వ్యాసము మొదట తెలిపిన ఆయాశాస్త్రములను బాగుగా చదువుకోవలెను. అప్పుడు సరియైన పద్ధతులు పట్టుబడుతవి.

(౪) ఇంతకూ మించి శబ్దశాస్త్రమును, నిరుక్తమును ఆధునికరీతిగా అభ్యసించవలెను. ఈ విజ్ఞానము లేకపోతే తప్పుడుసిద్ధాంతాలు, తొందరపాటు సిద్ధాంతాలు బయలుదేరుతవి.

ఈ విషయమునుగురించి శాస్త్రీయముగా తెలుసుకొన నాసక్తిగల వరహాలువంటివారు పరిశోధన చేయడానికి ఇదేకాక, ఇటువంటి విషయాలెన్నో ఉన్నవి. అవి చిన్నవిషయములని త్రోసివేయరానివి. ఒకజాతి సంప్రదాయములను, నాగరికతను నిర్ణయించేవి. ఏ విషయమై పరిశోధన చేసినా వేళాకోళంగా, అల్లాటప్పగా మాత్రము చేయకూడదని హెచ్చరిస్తున్నాను.



# విశ్వం పెళ్లి

[ నాటకము ]

## =శ్రీ సోమంచి యజ్ఞన్నశాస్త్రి=

### ౨-వ అంకం

[విశ్వేశ్వరరావుగృహం. విశ్వేశ్వరరావు మోటారు డ్రైవరు సింహాచలం పాడుకుంటూ బల్ల సవరిస్తూవుంటాడు.]

సింహా—రాదే చెలీ....నమ్మరాదే చెలీ....

విశ్వం—ఎవరిని నమ్మకూడ దంటావు సింహాచలం?

సింహా—ఏంలేదు, బాబూ,

విశ్వం—నన్నుకూడా తెలుసుకోనీ నీ రహస్యం కొంత. ఎవరైనా నిన్ను....

సిం—సినీమాపాట బాబూ.

విశ్వం—సినీమాల వ్యామోహం ఇంకా పోలేదు

సిం—ఆట మారినప్పుడల్లా యెళుతూనేవున్నాను బాబూ.

విశ్వం—అరి పిడుగా! అయితే నీ జీతమంతా సినీమాలకిందే ఖర్చు.

సిం—సినీమా కెంతోటి కావాలి! బేడ్డబ్బు లెడితే ఔంచి.

విశ్వం—రెండు రూపాయలు వొదిలించుకుంటేనే గాని నాకు సినీమా చూడ్డం పడదు. సినీమాకి వెళ్లినా వక్కవాడితో బాతాఖానీయే ఎక్కువ. ఫిలిముచూడ్డం తక్కువే: మొత్తంమీద ఫిలిములన్నీ మీరే బాగా చూసి ఆనందిస్తారు, ఒక్క తమాషా కనిపెట్టావ్ సింహాచలం! ఇది ప్రజాస్వామిక యుగం. కళ అంతా సినీమాద్వారానే ప్రచారమవుతోంది. కనక మీరే కళలని పోషిస్తున్నారు.

సిం—తమాషా తమరు సెప్పడంలో వుంది,

విశ్వం—కానేకాదు. సినీమాలవల్ల మన సంఘంలో కలిగిన గొప్పమార్పు కనిపెట్టావా?

సిం—లేదు బాబూ!

విశ్వం—నువ్వు నౌకరువి; నేను యజమానిని. అయినా మన మిద్దరమూ సమానహోదాలో సినీమానిగురించి చర్చించుకోగలము: జట్కాబండీలో ఎక్కా వనుకో. బండీవాడికీ, నాకూ సినీమాపేరు చెప్పి అరనిమిషంలో స్నేహమవుతుంది, ఇది సాంఘికవిప్లవం కాదూ? మరో విషయం కదుపు. అన్నీ విభేదాలే: వీడు ధనికుడు; వాడు బీద. వీడు గాంధీగారి శిష్యుడు: వాడు గవర్నమెంటుబంటు. వీడు కమ్యూనిష్టు; వాడు సోషలిస్టు. వీడు బ్రాహ్మడు; వాడు శూద్రుడు. వీడు మాల; వాడు మాదిగ. వీడు వైదికి; వాడు నియోగి: సినీమా కొచ్చేటప్పటికి మాత్రం మనం అందరమూ నోరెళ్లబెట్టుకు చూసే ప్రేక్షకులం.

సిం—సినీమాలోనూ కొట్లాటలు రావు మరీ: ఓడికోఆట నచ్చు; మరోడి కది గిట్టదు.

విశ్వం—అదంతా వ్యక్తిగతాభిప్రాయాలు సింహాచలం! కాంగ్రెస్‌పార్టీ ఒకటైనా అందులో మళ్లీ బ్రాహ్మలూ అబ్రాహ్మలూ, కమ్మా కాపూ కొట్టుకుని పైకి రావాలని చూస్తున్నారా? కాని "పుష్పమాల" ప్రేక్షకవర్గంలో బ్రాహ్మణశిష్యులనీ, అబ్రాహ్మణ శిష్యులనీ కొట్టుకుంటున్నారా? పుష్పమాలంటే జ్ఞాపకమొచ్చింది. ఈమధ్య దాని కేదో పిచ్చెక్కిందన్నారు. నిజమే?

సిం—పిచ్చికాదు బాబూ! పుంచినోడు పోయాడుట. అతగా డంటే వొల్లమాలిన యిష్టంట! యిశారంనేత కుంగిపోయిందిట.

విశ్వం—అదా సంగతి? ఈప్రేమంతా సినీమాలోనే అనుకున్నాను. పైన మనకీ అంటుకుంటోంది. మన అరవిందంగా దొకడు! కౌముదిమీద తెగ పద్యాలూ, పాటలూ రాసేస్తున్నాడు.

సిం—కౌముదమ్మగారు బలే చలాకీమనిషి బాబూ. అరవిందంబాబుని....

విశ్వం—నానుస్తున్నావేం? పెళ్లి చేసుకోదంటావా ఏమిటి కొంపతీసి? చేసుకుంటుందిరా! చేసుకుంటుంది.

సిం—నాకేటో....

విశ్వం—నువ్వు గట్టిగా అనకురా. ఇప్పుడు వాక్శుద్ధి అంతా మీలో వుంది. నువ్వు గట్టిగా అంటే అది కాస్తా నిజమైపోయి వూరుకుంటుంది.

(పైనించి తలుపుకొట్టిన చప్పుడు)

విశ్వం—ఎవరో వొచ్చినట్టుంది. చూడు.

(సింహాచలం పైకి వెళ్లిపోతాడు. కరుణాకరం లోపలికి ప్రవేశిస్తాడు. కరుణాకరానికి ఇరవై ఏ ళ్లుంటాయి.)

విశ్వం—కూచోండి. మిమ్మ ల్నెక్కడా చూసిన జ్ఞాపకం........

కరు—లేదండి. చూడలేదు. నాపేరు కరుణాకరరావు. మొన్ననే బి. యల్. పాసయాను. ఇహ బిల్ల కట్టాలి.

విశ్వం—తల్లితండ్రులు నిలవేసిన ఆస్తి చాలా వుందా యేమిటి?

కరు—ఏం అలా అడిగారు?

విశ్వం—రేపు భుక్తి ఎలా గడుస్తుందనేవాళ్లు ప్లీడరీ ప్రారంభించి లాభం లేదుగా....నువ్వు మాసంఘంలో వాడి వేనా?

కరు—మీసంఘమంటే?

విశ్వం—సోమరి ధనికుల సంఘం.

కరు—(నవ్వుతూ) అన్నమాటే.

విశ్వం—ఏంపనిమీద వొచ్చినట్టు?

కరు—అట్టే పనేమీ లేదండి. మీరు ఉషని ఎరుగుదురుగా! ఇక్కడి కొచ్చిందేమో కనుక్కుందామని.

విశ్వం—ఉషా? ఇక్కడి కెందు కొస్తుంది? వొస్తానందా?

కరు—లేదండి.

విశ్వం—మరి?

కరు—వూరికే కనుక్కుందామనే వొచ్చానండి.

విశ్వం—నన్ను నమ్మమనేటయ్యా నీ వుద్దేశం? కారణం లేకుండా ఉష ఇక్కడుంటుం దనుకోడానికి నువ్వేమైనా వెఱ్ఱివాడివా? అసలు సంగతి చెప్పు. ఉషని నువ్వు ఎలా ఎరుగుదువు?

కరు—మా కాలేజీలో చదువుకుంది.

విశ్వం—ఉషమీద పద్యాలూ, పాటలూ ఏమన్నా వ్రాశావా ఏమిటి?

కరు—నాకు కవిత్వం రాదండి.

విశ్వం—ప్రాణా లివ్వడానికి సిద్ధంగా ఉన్నట్టు వచనంలోనైనా చెప్పుకున్నావా?

కరు—ఉషని నేను మనసారా ప్రేమిస్తున్నా.

విశ్వం—అయిందీ! నే నొక్క సలహా చెబుతాను విను! సమయం మించిపోక మునుపు విరమించుకో! ఉషమీద ఆశ పెట్టుకు తిరిగి లాభం లేదు. అనవసరంగా ఎందుకు చిక్కులో పడతావు?

కరు—కారణ మడగొచ్చునాండి!

విశ్వం—అడక్కూడదు. అదింకా రహస్యం. అయినా ఎవరితోనూ చెప్పనంటే నీ ఒక్కడితోనూ చెబుతాను ఆ రహస్యం.

కరు—ఎవరితోటీ చెప్పను. భగవంతుడి సాక్షిగా చెబుతున్నా!

విశ్వం—నీ కా భగవంతుడి సాక్ష్యంకూడా ఎందుకు? నీమాట చాలదూ? నీ మాటలో నీకే విలవలేక, వారినీ వీరినీ సాక్ష్య మేసుకుంటానంటే, ఇతరు లేం నమ్మగలరు?

కరు—నా వుద్దేశ మదికాదండీ!

విశ్వం—మనసులో వుద్దేశ మొకటీ; పైకి చెప్పే దొకటీ. ఇదేగా నాగరికత అంటే! ఈరహస్యం మాత్రం మరెవరితోనూ అనకు. ఉషకి పెళ్లయిపోయింది.

కరు—(ఆశ్చర్యంతో) పెళ్ల యిపోయిందా? ఎప్పుడు?

విశ్వం—ఏమో! ఎప్పుడో!

కరు—భర్త పే రడగొచ్చునా?

విశ్వం—అడగొచ్చును గాని, చెప్పడానికి మా కెవరికీ తెలీదు. అదే రహస్యం. నువ్వు ఉషని పెళ్ళాడదామనే అనుకున్నావన్నమాట.

కరు—కొంత ఆశపడ్డాను.

విశ్వం—నువ్వింకా కుఱ్ఱాడివి. ఒక్క సంగతి నేను అనుభవంమీద చెబుతున్నా విను. ఎప్పుడూ ఏ ఆడదాని మాటా నమ్మకు. నమ్మావా, మహా సుడిగుండంలో పడి పోతావు.

(అంటూవుంటే ఉష లోపలి కొస్తుంది.)

విశ్వం—(ఉషతో) వొచ్చావూ? నీ కోసమే ఇందాకటినించీ పలవరిస్తున్నాడు. ఇహ అట్టే ఏడిపించక, దబ్బున వీడ్కోలు ఇచ్చేసి పంపించెయ్యి. పరస్పర నిందలూ, విచారాలూ ఏమీ ప్రయోజన ముండదు. తెలిసిందా? మీ మాట లయిపోయిన తరవాతగాని, ఈలోపుగా నాసలహా అవసర ముంటేగాని, పిలవండి. (అని ఎవరూ జవాబు చెప్పడానికి వీలులేకుండా త్వరగా వెళ్లిపోతాడు.)

ఉష — మెట్టవేదాంతం మొదలెట్టావా? ఎంతసేపయింది నువ్వొచ్చి ?

కరు—పదినిమిషాలు కాలేదు, ఆట్టే వేదాంతం లేదు గాని, నీ రహస్యం చెప్పి నన్ను తప్పుకోమని సలహా ఇచ్చాడు. నాభార్యని నేను ఇంత దొంగచాటుగా కలుసుకోవలసి రావడం నాకేం బాగాలేదు. అందరికీ మన వివాహం సంగతి చెప్పెయ్యనిద్దూ !

ఉష—చెప్పనని నాకు మాటిచ్చావు.

కరు—ఇచ్చాను లే, కాని అందరిచేతా మాటలు పడడం నాకేమీ....

ఉష—తొందరపడి లాభం లేదు. ఓపిక పట్టాలి. ఏం చేస్తాం, మీ నాన్న మూర్ఖపుపట్టు పట్టాడయ్యె !

కరు—నిజమే ననుకో! ఆయనతో వాదించి లాభం లేదు. పెద్ద కట్నంతో వొస్తేనే గాని పిల్లని చేసుకోడం సాంప్రదాయం కాదంటాడు. కట్నం పుచ్చుకోకపోతే, మా వంశం మంచిది కాకపోడంవల్లనే కట్నం దొరకలేదంటారుట ! నలుగురిలోనూ తలెత్తుకు తిరగడం కష్టంట ! ఇహ ఏం చెప్పను ? చిన్నప్పుడు వారాలు చేసుకునీ, మధూకర మెత్తుకునీ చదువుకుని డబ్బు సంపాదించి గొప్పవాడయిన సంగతి మరిచిపోలేకుండావున్నాడు. తన వంశం ఎలాగయినా గొప్పదే నని అనిపించుకోవాలని ప్రయత్నం. భల్లూకపుపట్టు పట్టాడు. అయినా మానాన్నకి మన పెళ్లి సంగతి తెలిస్తే ఏం చేస్తాడు? డబ్బివ్వడం మానుకుంటాడు, అంతేనా ? మరేం భయంలేదు. నారెక్కలు నాకుండగా మా నాన్నడబ్బు తినడం నాకేదో దొంగతనం చేసినట్టుంది. అందరికీ చెప్పెయ్యనిద్దూ,

ఉష—వల్లకాదు, మీనాన్న డబ్బివ్వనంటే మనకి గడవదు. ప్రేమనిగురించి ఎన్ని పిచ్చిఅభిప్రాయా లున్నా ప్రమాదం లేదు. డబ్బువిషయంలో తప్పుఅడుగు వేశామా, దెబ్బతినేస్తాము. నీకొచ్చిన చదువుతో ఏ గుమాస్తావనో దొరుకుతుంది, నలభై రూపాయల రాబడిమీద ప్రేమ ఏమిటి, సుఖమేమిటి ? నీతో ఇదివరకు అనేకమాట్లు చెప్పాను. కలుసుకున్నప్పుడల్లా ఇదే గొడవ తేకు.

కరు—సరేగాని, నాకేమో....

ఉష—సందేహా లన్నీ కొద్దిరోజులు మరిచిపో. సినీమాకి వెళ్లడానికి కౌముదీవాళ్లూకూడా ప్రయాణమయినట్టున్నారు. వాళ్లెవరూ ఇక్కడికి రాకముందే పోదాం రా !

కరు—విశ్వేశ్వరరావుగారితో చెప్పిపోదాం !

ఉష—చెప్పక్కర్లేదు లెద్దూ! పిలిస్తే మళ్లీ వేదాంతం మొదలెడతాడు.

(అని యిద్దరూ నవ్వుకుంటూ వెళ్లిపోతారు. అర నిమిషం నిశ్శబ్దం. తరవాత అరవిందం ప్రవేశిస్తాడు)

అర—ఎవరూ లే రిక్కడ ? విశ్వం !

విశ్వం—ఎవరది ? (బయటికొచ్చి) అరవిందం! ఇక్కడ మీచెల్లెలూ, కరుణాకరమూ వుండాలి !

అర—నా కెవరూ కనిపించలేదే! కరుణాకరం ఎవరు ?

విశ్వం—నీలాటివాడే, మరోఘంట. మీచెల్లెలిని పెళ్లి చేసుకుందా మనుకున్నాడుట. ఇప్పుడు గుండెపగిలి ఏడుస్తున్నాడు. నీసంగతేమిటి ? కౌముదితో మాట్లాడావా ?

అర—విశ్వం, నే నెంత క్రూరుణ్ణి! కఠోరహృదయుణ్ణి!

విశ్వం—ఏదన్నా నాటకంలో పార్టు జ్ఞాపకంచేసుకోడం లేదుకదా!

అర—నాజీవితనాటకంలో సుఖాంకమే లేకుండా పోతోంది.

విశ్వం—ఇప్పుడు నీ కొచ్చిన ప్రమాదమేమిటిరా ? నిన్ను పెళ్లిచేసుకుంటా ననలేదు కదా కౌముది ?

అర—ఎంత నిర్దయ !

విశ్వం—పోనీ, ఇక్కడ పలవరిస్తూ కూచోకపోతే వెళ్లి అడిగెయ్యలేకపోయావా ?

అర—పురుషులది రాతిగుండె! ఏకోశానా మృదుత్వమే లేదు. అడిగేశాను !

విశ్వం—ఏ మంది ?

అర—అశ్రుజలం బొటబొట రాల్చింది. ఆ కంఠధ్వని నువ్వు వినుంటే, ఆ కన్నీళ్లే నువ్వు చూసుంటే! ఆహా! ఉబికిఉబికి పొంగుతున్న దుఃఖాన్ని బలవంతంగా అణిచిపెట్టుకుంది కదా !

విశ్వం—కన్నీళ్లే ! మాయాజాలం ప్రారంభమయిందన్న మాట ! ప్రయోజనం లేకుండా ఆడదాని కంటివెంట ఏ రాదురా బాబూ.

అర—పూరుకో, నీ వ్యాఖ్యానాలూ నువ్వూను !

విశ్వం—పోనీ, ఎందుకేడిచిందో కనుక్కున్నావా ?

అర—వివాహం సంగతి చెప్పేసరికి వాళ్ల నాన్న జ్ఞాపకమొచ్చాడుట. పితృవియోగ విచారసాగరంలో మునిగివుండగా నేను పెళ్లిమాట ఎలా తలపెట్టానో కదా !

విశ్వం—ఏడిశావు, నోరుమూసుకో! తండ్రికోసం ఎల్లకాలమూ ఏడుస్తూకూచుంటుందా ఏమిటి? అదంతా నటనరా బాబూ. నిన్నింకా కొంతకాలం ఏడిపిస్తేనేకాని అంగీకరించ దన్న మాట.

అర—నువ్వు గార్డియన్‌వి కనక నీతో చెప్పి మొదట నీ అనుమతిపుచ్చుకొని మరీ తన్ని అడిగుండవలసిం దంది. నీ అనుమతి కోరడమంటే ఎలాగో వుంది. ఒక్కమాట కౌముదితో చెబుదూ!

విశ్వం—ఏమని చెప్పమంటావు?

అర—కౌముది నన్ను పెళ్లాడి సుఖపడుతుంది కాని కష్టపడదని....

విశ్వం — నువ్వు సుఖపడతావా లేదా అని నాకు బెంగ కాని, దానికేం? ఎవరినైనా తన సుఖానికీ, తన ప్రయోజనానికీ వినియోగించుకోగల శక్తి కౌముది కుంది. ఒక్క కౌముదికే ఏమిటి? ప్రతిస్త్రీలోనూ వుంది: తమకి స్వంతంగా ఏఆదర్శమూ లేని పురుషులు స్త్రీ ప్రయోజనానికి సాధనమాత్రులుగా లొంగిపోయా రంటే ఆశ్చే విచారించవలసిన పని లేదు కాని, కవివై స్వతంత్రసృష్టి సాగించాలన్న నువ్వు స్త్రీకి లొంగకూడదు.

అర—నా కవితాసృష్టికి కౌముదే ఆదర్శ దేవత. పట్టుకొమ్మ. నన్నేదో సాధనంగా వినియోగించుకుంటే నాకు కలిగే నష్ట మేమిటి?

విశ్వం—నష్టమేమిటా? వెర్రివాడా! అసలు ఈప్రపంచాన్ని, ఈ మానవసృష్టినిగురించి ఏనాడయినా ఆలోచించావా? మానవుడు సృష్టి అయి ఎన్నికోట్ల సంవత్సరాలయిందో? జంతువుకంటె ఉత్కృష్టజాతిని సృష్టించాలన్న సంకల్పమే మానవజాతికి ప్రభవకారణంగదా! కాని ఇన్నికోట్ల సంవత్సరా లయినతరవాత మానవుడు జంతుజాతి కంటె లేశమాత్రమయినా ఉత్కృష్టంగా కనిపిస్తున్నాడా? మానవజాతి నశించకుండా పురోభివృద్ధి చెందాలంటే ఉత్కృష్టపరివర్తనం జరిగితీరాలి. అది పురుషుడి ఆధీనంలో వున్న కార్యం. ఈ ప్రపంచసృష్టికే మూలకారణమయిన సంకల్పశక్తి పురుషుడిలో వుంది. మన మనస్సు, బుద్ధి అందు కేర్పడినవేగదా! ప్రకృతి అంధసృష్టిని ప్రతిఘటించి సవ్యమార్గాన, ప్రయోజనకరమైనదారిని నడిపించవలసిన బాధ్యత మనమీద వుంది. శక్తి మనలో వుంది. పురుషుడే సంకల్పించాలి. వేరే సంకల్పం లేక, ఈసృష్టి అవిచ్ఛిన్నంగా సాగిస్తూ, జంతుజాతికి సామీప్యంలో మానవజాతిని వుంచేటందుకు కారణభూతురాలయినది స్త్రీ. కనక స్త్రీకి సాధనమాత్రుడుగా లొంగిపోకు. సంకల్పించు. ప్రతిసృష్టికి ప్రయత్నించు. మానవుడిని మించిన ఉత్కృష్టవ్యక్తి సృష్టికి సహాయపడు.

అర — నీవాగ్ధోరణి అమోఘంకదా! కట్టతెగిన ప్రవాహం. మాట్లాడ్డం మొదలెడితే, ఎదుటివాడిని గుక్క తిప్పుకో నివ్వవు.

విశ్వం—నే నెంత బోధచెయ్యబోయినా నీధోరణి నీదే. సరే....ను వ్విప్పు డెక్కడినించి వొచ్చావు? షికారుకి వెళ్లడానికని లలిత వొస్తానంది.

అర—అన్నట్టు మరిచిపోయాను. నీచేతి కిమ్మని లలిత వుత్తరమిచ్చింది.

(అని వుత్తరం తీసి చేతి కందిస్తాడు. విశ్వం వుత్తరం విప్పుకుచదివి)

విశ్వం—హరి! ఏమి మోసం!!

అర—ఏమిటిసంగతి?

విశ్వం—నాతో లలిత ఎక్కడికీ బైటకి వెళ్లకూడదని కౌముది హుకుం జారీచేసిందట.

అర—కారణమేమైనా వ్రాసిందా?

విశ్వం—కారణం కాదు. అవమానం! ఇప్పుడే కాదు. ఎప్పుడూకూడా వొంటరిగా నాతో వుండకూడదని నిషేధించిందిట. ఆడపిల్ల లెవరూ నమ్మి నాతో స్నేహం చెయ్యడానికి తగినవాడిని కానుట నేను. నీసుగుణాలపోవు. నీ కౌముది ఎలాటిదో ఇప్పుడైనా గ్రహించావా నువ్వు?

అర—తండ్రి పోయిన తరవాత చెల్లెలి బాధ్యతంతా కౌముదిమీద వొచ్చి పడింది కాదూ. పాపం! తల్లికి అన్నీ స్వయంగా చూసుకునేందుకు శక్తి లేదు! అలాటప్పుడు చెల్లెలి బాగోగులు కౌముది చూసుకోకపోతే ఎలాగ?

—అంటే! నావిషయమై కౌముది కున్న అభిప్రాయమే నీకూ వుందన్న మాట.

అర—లేదనుకో. కౌముదిమనస్సులో నిజంగా వున్న ఉద్దేశం నే నవగాహన చేసుకోగలను. నువ్వేమో అన్నీ తల్లకిందులు వ్యవహారాలు మాట్లాడుతావు. ఇంకా బుద్ధి కుదరని పిల్లలు అవి నమ్మి ఆచరణలో పెట్టడం ప్రారంభిస్తే ఇహ సన్మార్గం పట్టుపడుతుందా? నువ్వే చెప్పు పోనీ!

విశ్వం—ఒకరిని సన్మార్గంలో పెట్టడమంటే, నిజమేమిటో తెలియకుండా అన్నీ అబద్ధాలు చెప్పడమేగా? ఆ

అబద్ధాలన్నీ సరే. నేను నమ్మకద్రోహం చేస్తానన్న ఈ అబద్ధమేమిటి? ఇదిమాత్రం నేను సహించలేను.

అర—కౌముది నిన్నేమీ అలా అనందే?

విశ్వం—అలా అనకపోతే మరెలా అంది?

సింహా—(లోపలికి తొంగిచూసి) కౌముదమ్మగా రొస్తున్నారు!

(కౌముది లోపలికి ప్రవేశం)

కౌ—(విశ్వంతో) లలితకి తలనొప్పొచ్చింది. రాలేనని నీతో చెప్పమంది. ఆసంగతి చెప్పడానికే నే వొచ్చాను.

విశ్వం—(అరవిందంతో) ఇప్పుడేమంటావు?

అర—అర్థం కావడం లేదూ? నీమనస్సుకి కష్టం కలిగించడ మెందుకని ఈమాదిరిగా చెబుతోంది.

విశ్వం — మోహాంధకారం! కళ్లయెదుట పెట్టి చూపించినా తెలుసుకోలేవురా! కౌముదీ, నే నోపని చెబుతాను చేస్తావూ? మీచెల్లెలి తలనెప్పి పోతుంది.

కౌ—ఆ.

విశ్వం—ఇప్పుడు నువ్వు నాతో చెప్పిన ముక్కలు మీచెల్లెలితో చెప్పు. చెప్పి, తను రాసిన వుత్తరం అందిన కొద్దినిమిషాలకి నువ్వొచ్చి ఈకథ చెప్పిన సంగతికూడా చెప్పు.

కౌము—లలిత నీ కుత్తరం రాసిందా?

విశ్వం—ఆ. వివరాలతోసహా!

అర—నువ్వు మరేమీ అనుకోకు కౌముదీ! నువ్వు నీవిధ్యుక్తధర్మం నెరవేర్చుకున్నావు. మనసు నొప్పించకుండా, ఎంత మృదువుగా మందలించడానికి వీలుందో, అంత మృదువుగానూ హెచ్చరించావు.

కౌ—నీ దెంత మెత్తని హృదయం అరవిందం! నువ్వెంత చక్కగా అర్థంచేసుకుంటావు?

విశ్వం—ఊ! కొండచిలువ తోక చుట్టెయ్యి. అరవిందం! నువ్వు కౌముదిని ప్రేమిస్తున్నావు కాదూ?

అర—ఆ.

కౌ—అబ్బ! వూరుకో.

విశ్వం—మీవివాహానికి నాసమ్మతి యిచ్చేస్తున్నాను. సుఖీ భవ. నే నిక వెళతాను. ఓగంటసేపు షికారు తిరిగి రావాలి.

కౌ—వెళ్లకు విశ్వం. నీతో మాచెల్లెలివిషయం మాట్లాడాలి. అరవిందం! అమ్మకూడా సినీమాకి వొస్తానంది. నువ్వెళ్లి తీసుకురావూ? అమ్మకి నువ్వంటే ఎంతో యిష్టం!

అర—ఓ. తప్పకుండా తీసుకొస్తా. నువ్వు చెప్పడమూ, నేను చెయ్యకపోడమూనా? (అని వెళ్లిపోతాడు)

విశ్వం—నేను నమ్మకద్రోహం చేస్తానని చెప్పడంలో నీవుద్దేశమేమిటి? ఇహ నేను లలితకి ఎలా మొహం చూపించను?

కౌ—నువ్వలాటివాడివి కావని నాకు తెలుసును. కాని....

విశ్వం—అయితే ఎందుకు చేసిన ట్టీపని? ఎందుకీఅబద్ధాలు?

కౌ—చెప్పక తప్పిందికాదు!

విశ్వం—తప్పిందికాదూ?

కౌ—అమ్మ చెప్పించింది!

విశ్వం—అమ్మ! అమ్మ!! అమ్మ!!! ప్రతిదానికీ అమ్మ!!!!

కౌ—నే నేం చెయ్యను చెప్పూ? నువ్వాపుస్తకం రాశావు: చయనులుగారికీ, అమ్మకీ దురభిప్రాయం కలిగించావు.

విశ్వం—అయితే నేను తప్పు చెయ్యలేదని తెలిసుండి, మీఅమ్మకోసం అలా అబద్ధాలాడ్డమా?

కౌ—అన్నీ మన యిష్టమొచ్చినట్టు చెయ్యగలమటోయ్. పెద్దవా ళ్లేమనుకుంటారో అని మనం కాస్త ముందూ వెనకా చూసుకోవొద్దూ?

విశ్వం—కూడదు. వయస్సులో పెద్ద లయినంత మాత్రంచేత బుద్ధిలో పెద్దలా? ముసలివాళ్లందరూ యువకులమీద పరిపాలన చెయ్యొచ్చునన్న దురభిప్రాయం నశించేదాకా ఈ లోకం బాగుపడదు. వయస్సుకి జరుగుతున్న ఈపూజ మానిపించాలి. "తల్లి మాట మీరరాదు" అన్నదే అసలు మానవసంఘానికి వేరుపురుగు. తల్లిమాట ఎందుకు విధిగా వినాలి? తల్లికీ, పిల్లకీ మధ్య వున్నది ప్రేమకాదు. దౌర్జన్యం. భావదాస్యం. నువ్వు తిరగబడాలి. దాస్యశృంఖలమోచన మయితేనేగాని మనకి మోక్ష ముండదు.

కౌ—ఏం చక్కగా మాట్లాడతావోయ్ నువ్వు? ఏశాసనసభలో ప్రవేశించినా ఇట్టే పైకొచ్చేస్తావు!

విశ్వం—నీ కిదంతా వొట్టి వూకదంపుఉపన్యాసం కింద కనిపిస్తోందికాదూ? ఐతే పో. ఇంటికి పో. మీఅమ్మ కొంగట్టుకు తిరుగు. పెళ్లాడి పిల్లల్ని కని వాళ్లందరి మన

స్సులూకూడా పాడుచెయ్యి ఊ. వెళ్లు. ఇంకా కూచున్నావేం ?

కౌ—నీతో ఏమొచ్చినా కష్టమేనోయ్, నువ్వు చెప్పినది నాకు నచ్చినా, ఆచరణలో ఎలా పెట్టడం చెప్పు ? ఇప్పుడు నన్నేం చెయ్యమంటావు ?

విశ్వం—ఏం చెయ్యమంటానా ? సంకెళ్లు తెంపుకో. నీమనస్సుకి నచ్చినరీతిని ప్రవర్తించు. ఎవ రేమనుకుంటారో అని ఆలోచించకు. మీఅమ్మ చెప్పిన మాటలు అసలు వినకు. నీమనస్సులో వున్న కుళ్లంతా పైకి తోసెయ్యి. ఈ ఆవరణలోనించి బయటపడు. పరిశుభ్రమైన స్వేచ్ఛా వాయువు పీల్చు. దేశాటనం చెయ్యి. కావలిస్తే నాతో రా. నాకారులో వూటీకొండలమీదికి, కన్యాకుమారిఅగ్రం దాకా సంచారం చేసొద్దాం. తరవాత నీఅనుభవాలన్నీ పుస్తకరూపంలో ప్రకటిద్దువుగాని. దానితో మీఅమ్మ పనయిపోతుంది. నీకు వ్యక్తిత్వం లభిస్తుంది.

కౌ—(ఆలోచిస్తూ తాపీగా)బాగానే వుంది సుమా ను వ్వన్నది ! నాకూ వూళ్లు చూడాలని చాలా రోజులనించీ వుంది. వూటీ తీసుకెళతావుకాదూ తప్పకుండా ? నీతో వొచ్చేస్తే మరేమీ ప్రమాదం వుండదు, ఏమంటావు ? నువ్వు నా గార్డియన్‌వే కనక నీతో వొంటరిగా వెళ్లినా ఎవరూ ఏమీ అనుకోడానికి హక్కుండదు. వొచ్చేస్తానోయ్.

విశ్వం—(నిర్ఘాంతపోయి)వొచ్చేస్తావా ?

కౌ—ఆ.

విశ్వం—మనం వొంటరిగా వెళ్లడంవల్ల ప్రమాదమే లేకపోతే వెళ్లి ప్రయోజనం ?

కౌ—నాకు చెడ్డపేరు తెద్దామనా నీవుద్దేశం? అమ్మా! ను వ్వలాటి పిచ్చిపని నిజంగా చెయ్యవని నాకు తెలీదూ ? నువ్వు నిజానికి చాలా మంచివాడివోయ్ ! లేకపోతే న న్నిలా వూళ్లన్నీ తిప్పుతానంటావా ?

విశ్వం—ఎవరూ ఏమీ అనుకోనికాడికి ప్రపంచమంతా తిప్పినా లాభముండదు.

కౌ—చూశావా ? అన్నీ ఇలాటి వితండవాదాలే !

(అంటూవుంటే రామాయమ్మగారు లోపలికొస్తారు)

కౌ—అమ్మా ! విశ్వం నన్ను తన కారులో వూటీ తీసుకెళతానన్నాడే ! తరవాత కావలిస్తే కన్యాకుమారీఅగ్రం దాకాకూడా తిప్పితీసుకొస్తానన్నాడు. వెళ్లిరానా ?

విశ్వం—మీఅమ్మగారికి మనం ఇలా వొంటరిగా వెళ్లడం ఇష్టముండదు. ఆవిడ సమ్మతించదు. కాదండీ. మీ కిష్టం లేదుకాదూ ?

రామా—నా కెందు కిష్టంలేదు నాయనా ? తండ్రి పోయినతరవాత ఎక్కడికీ బయటకి వెళ్లడానికి వీలే లేక పోతోంది. తిరిగొస్తే కాస్త దుఃఖమయినా తగ్గుతుంది..... ఆసంగతే చెబుదామని నేను అనుకుంటున్నాను. లలితని కూడా కాస్త అటూ ఇటూ తిప్పుదూ ? అది మరీ యింట్లో వుండిపోతోంది. మీరు వూరెళ్లొచ్చినతరవాతయినా సరే !

విశ్వం—మోసం, మోసం, మహామోసం !!

కౌ—(తొందరగా) అమ్మా, సినీమాకి టైమయి పోతోంది, వెళ్లిపోదాం రావే. (అని తల్లిరెక్క పట్టుకుని బలవంతంగా పైకితీసుకుపోతుంది.)

(విశ్వం మెల్లిగా తల కొట్టుకుంటాడు. సింహాచలం లోపలి కొస్తాడు)

విశ్వం—సింహాచలం ! కౌముది నాతో కారులో వూటీప్రయాణాని కొస్తానందిరా !

సింహా—సితం. నే నెప్పుడో సెప్పానుకాదండి !

విశ్వం—ఏమన్నావు ?

సింహా—అమ్మగారు అరవిందంగోరికి దక్కరని !

విశ్వం—ఇప్పుడొచ్చిన ఉపద్రవమేమిటి ? నాతో ప్రయాణం చేసినంతమాత్రాన అరవిందం కౌముదిని వొదులుకుంటాడా ?

సిం—అరవిందంగా రొదులుకోరండి !

విశ్వం—మరి !

సిం—ఏటిబాబూ ! ఇన్నోటి పుస్తకాలు చదువుకున్నారు. ఇంకా తెలవదు.

విశ్వం—అదేరా మాఖర్మం. పుస్తకాలు నూరిపోసి మాబుర్రలు నింపేసరికి ప్రపంచజ్ఞానం తక్కువయిపోతుంది. అందుచేతే ప్రపంచవ్యవహారం ఏమొచ్చినా నీనలహా అడిగేది. ఇంతకీ సంగతి చెప్పావుకాదు. కౌముది అరవిందాన్ని ఎందు కొప్పుకోదు ?

సిం—మరోరిమీద కన్నేసింది కనక !

విశ్వం—ఎవరిమీద ?

సిం—మీమీదే !

విశ్వం—నామీదా ? నీకేం బుద్ధిలేదురా ?

సిం—నాకేం బాబూ ! సెప్పమన్నారుకనక సెప్పాను.

మీయిష్టం. ఇలాగే అనీ అడుగుతారు. సెబితేనేమో కోపం. (అని వెళ్లిపోతాడు)

విశ్వం — నిజమా ? నేనా కొండచిలువపరసి ? నేనా బలిపశువుని ? ఎంత ఘోరం ! ఎంత ఘోరం !! సింహాచలం, కారు సిద్ధంగావుందా ?

సిం—ఆ.

విశ్వం—కారునిండా పెట్రోలు నింపెయ్యి. నీవీ నావీ పక్కచుట్టలు పెట్టెయ్యి. అయిదునిమిషాల్లో బయలు దేరాలి.

సిం—ఎక్కడికి ?

విశ్వం—మహాపర్వతాగ్రంమీదికి! భీకరారణ్యాల్లోకి! కౌముదికి అందకుండా ఎక్కడికయినాసరే. ఊ, పక్క కట్టు, పెట్టె సర్దు. కారు తియ్యి. ఊ. జల్దీ. జల్దీ.

## 3-వ అంకము

[నీలగిరి కొండల్లో ! దొంగలముఠా.

దొంగలజట్టులో ఏదో మీటింగు జరుగుతోంది. దొంగలనాయకుడు ఈ సమావేశానికి అధ్యక్షత వహించి కొంచెం ఎత్తైన పీఠంమీద కూచున్నాడు. నాయకుడు ప్రసాద్‌కి నలభై ఏళ్లుంటాయి.]

ప్రసాద్—స్నేహితులారా ! తోడిదొంగలారా ! రాడికల్ డెమోక్రాటులకి ఎక్కువ ధైర్యసాహసా లున్నాయా, సోషలిస్టులకి ఎక్కువ ధైర్యసాహసా లున్నాయా అన్న అంశంమీద మూడురోజులనుంచీ చర్చలు జరుగుతున్నాయి. ఈ సందర్భంలో రాడికల్ డెమోక్రసీ అంటే ఏమిటి. సోషలిజమ్ అంటే ఏమిటి అన్న విషయంకూడా క్షుణ్ణంగా చర్చించాము. మన ముఠాలో వున్న ఒక్క రాడికల్ డెమోక్రాటూ, రాడికల్‌డెమోక్రసీ అంటే ఏమిటో తెలియకపోయినా, పధ్నాలుగు గంటలు ఉపన్యసించి, రాడికల్ డెమోక్రసీని వర్ణించాడు.

రా. డె.—ప్రెసిడెంట్! అన్యాయం. అన్యాయం. నాకు రాడికల్ డెమోక్రసీ అంటే తెలుసునని రుజువుచేస్తాను. (అంటూ లేస్తాడు)

ప్ర—వల్లకాదు. దానికి మళ్లీ ఇంకో రెండు రోజులు పుచ్చుకుంటావు.

(వెనకనించి 'కూచో కూచో'. అని కేకలు. రా. డె. గొణుగుకుంటూ కూచుంటాడు)

ప్ర—ఇహ మనలో సోషలిస్టులు ముగ్గు రున్నారు. వీళ్లలో ఒకరితో రెండోవాడికి మాటల్లేవు. ముగ్గురూ పరస్పరవిరుద్ధంగా, సోషలిజాన్ని మూడువిధాల వర్ణించారు.

(వెనకనుంచి 'కామ్రేడ్ నే చెప్పింది అర్థంచేసుకో లేదు' అని ఒకరూ, 'సరిగ్గా మళ్లీ చెప్పనా ?' అని మరొకరూ కేకలేస్తారు.)

ప్ర—వూరుకోండి, ఇహ మీరు మాట్లాడకూడదు. ....కనక ఈ సమావేశానికి నే నొక్క సూచన చేద్దా మనుకుంటున్నాను. ఈ చర్చ ఇక్కడితో కట్టిపెట్టేద్దాం. ఎవరికి ఎక్కువ ధైర్యసాహసా లున్నాయో చర్చించి వోటుకి పెట్టి తెలుసుకోగలమా? అది శాసనసభల్లో ఆడుకునే ఆట. మన మేం శాసనసభల్లో సభ్యులమా ? కాదు. దొంగలం, బందిపోటు దొంగలం. దారులు కాసి, బళ్లు అడ్డం కొట్టి ధనం దోచుకునే బందిపోటు దొంగలం. మన ధైర్యసాహసాలు మన దొంగతనాల్లో చూపించాలి, అవునా?

అయ్యరు—ఆమ. నిజందా!

ప్ర—మనం దొంగతనం మాత్రం ఎందుకు చేస్తున్నాము? కేవలం స్వలాభానికా ? కాదు కాదు. ముమ్మాటికీ కాదు. లోకంలో ధనవిభజన బాగా లేదు. బీదలు కష్టపడి పనిచేస్తే, ధనవంతులు ఆసొమ్ము హరించి హాయిగా అనుభవిస్తున్నారు. కనక ధనం ఇంతకంటె న్యాయంగా పంచిపెట్టడానికే మనం బందిపోటు దొంగతనం ప్రారంభించాము. పైగా మన మేం సామాన్యదొంగలమా ? మానవ సేవా సంఘం అన్న పేరుతో మన కంపెనీ రిజిస్టరు చేయించాము. ప్రతి సంవత్సరం వాటాదార్లకి డివిడెండులూ, లాభాలూ పంచిపెడుతాము. రాజకీయసిద్ధాంతాలూ, వేదాంతాలూ చర్చించడం మన పని కాదు, దొంగకొట్టడం మన పని.

(చప్పట్లు. 'హియర్ హియర్' అని వెనకనించి ధ్వని)

—నాది ఒక్క చిన్న విన్నపం వుండింది. మనం దారికాచేదానికి ముందు బగమంతుడికి ప్రార్థన చెయ్యవలె అని. లేదంటే ఆండవనికి దా కోపం వొచ్చిందా అంటే నిండా మోసం.

సోషలిస్టు—భగమంతుడు లేడు గిగమంతుడులేడు. మార్క్సు ఏమన్నాడంటే....

అయ్య—రామా రామా! బగమంతుడు లేడంటుడే ? వీడుదా యెట్టుపుట్టెనో ? ఆండవనే! ఎన్న అపరాధం ! ఎన్న అపరాధం ! (అని లెంపలేసుకుంటూ) క్షమించు ఆండవనే,

రొంబకోపమొచ్చి అళ్ళందరినీ క్షమించలేకపోతే నన్ను ఒక్కణ్ణిదా క్షమించు బిగమంతుడా!

(పైన ఈలవేసిన చప్పుడు. దొంగలందరూ లేచి అటూ యిటూ పరుగెడుతారు)

ప్ర—(దూరదర్శినిపెట్టి రోడ్డువైపుకి చూస్తూ ఒక దొంగతో) రోడ్డుమీద మేకులు జల్లించు. టైరు పగలకపోతే అప్పుడు జాగర్తగా తుపాకిపేల్చి టైరు బద్దలు కొట్టాలి. అనవసర గలభా కూడదు.

(దొంగ వెళ్ళిపోతాడు)

అయ్య — సామీ! నాకుకూడా ఒక్కమాటు యిస్తురూ, నేనుకూడా చూస్తను.

ప్ర—నీ కెంత ధైర్యముందో చూపించడానికా ఏమిటి ఇక్కడ దిగబడ్డావు?

అయ్య—మీకు సేవ చేసేందుకుదా దిగడితిని సామీ!

ప్ర—నా కేం సేవ చెయ్యక్కర్లేదు. అక్కడికి వెళ్ళి చూసిరా! మరేం భయం లేదులే. కారులో యిద్దరే వున్నట్టున్నారు. డ్రైవరు, యజమానీని!

అయ్య—ఏం సామీ. వారు వొచ్చి దుడ్డుయిస్తు రేమో. కాఫీ తయారుపెట్టివొద్దునా?

ప్ర—కాఫీ చెయ్యమన్నప్పుడల్లా నువ్వు అరకప్పు కాజేస్తున్నావుట. ఈమాటు నిన్ను మళ్ళీ కాఫీదగ్గిరకి వెళ్ళనివ్వను జాగర్త. మరెవరినైనా చెయ్యమంటాను.

అయ్య—ఏమి సార్. తెలిసినవాండ్లే అట్లు చెబుతురే. తెలుంగువాడు కాఫీ నల్ల తయారుచేస్తుడా?- వాడు ఇంకా ఎక్కువ తాగేస్తుడు. అవళదా! నామీదదా అందరూ నేరాలు చెప్పేస్తురు. అరవవాడు అంటేనే లోకువ!

(విశ్వం, సింహాచలం, ఒకదొంగ ప్రవేశిస్తారు)

అయ్య—ఈ రెండుపేరుదానా దొరికింది?

విశ్వం — (ప్రసాదుని చూపిస్తూ) మీనాయకుడన్నావు-ఈయనేనా?

అయ్య—ఆమా సార్. ఆమ. వీరుదా మానాయకుడు.

ప్రసా—(గంభీరంగా) నన్ను నేనే పరిచయంచేసుకుంటాను. నాపేరు సత్యవీరప్రసాద్. మానవసేవాసంఘ అధ్యక్షుణ్ణి. బందిపోటుదొంగని. వృత్తి ధనికుల్ని దోచుకు బ్రతకడం.

విశ్వం — నాపేరు విశ్వేశ్వర్రావు. పెద్దమనిషిని. వృత్తి బీదల్ని దోచుకు బ్రతకడం. మనం మనం స్నేహితులమే. (అని షేక్‌హాండ్ ఇచ్చుకుంటారు)

అయ్య—రొంబ తమాషాగా మాట్లాడుతురే మీరు!

విశ్వం—నాస్నేహితుడు, నా కారుడ్రైవరు. (అని సింహాచలాన్ని చూపిస్తాడు)

దొంగ — ఇందులో ఏది నిజం? స్నేహితుడా, కారుడ్రైవరా? స్నేహితుడయితే విడిపించుకోడానికి డబ్బిచ్చుకోవాలి. జీతం పుచ్చుకునే డ్రైవరయితే అవసరం లేదు. అన లీకొండల్లో స్వేచ్ఛగా తిరగొచ్చును.

సిం—యీలయితే తిరిగీ యిటోమారు కారు పట్టించాలేం?

అయ్య—నువ్వుకూడా రొంబ తెలివయినవాడు. మీ రెండుపేరు చాలా తెలివయినవాండ్లు.

ప్ర — ఆకలేస్తోందేమో? ఏమన్నా తినడానికి కావాలా? పల్లేరుకాయల పులుసూ, ఉడకబెట్టిన బ్రహ్మ జెముడుమట్టలూ వున్నాయి. అవి మా కిక్కడ నిత్యభోజనం.

విశ్వం—అక్కర్లేదు. భోజనమయింది.

అయ్య—పోనీ! కొంచెం కాఫీ యిస్తునా సార్!

సిం— ఇక్కడకూడా నువ్వు వోటలు పెట్టేశావా ఏమిటి? దొంగలు దోచుకున్న సొమ్మంతా కాఫీపేరు సెప్పి నువ్వు కొట్టేస్తున్నావా?

ప్ర—ఇక్కడ ముఠాలో ఎవరూ కాఫీ తాగకూడదని నియమం. మాఅక్కౌంట్లు సరిచూసిపెట్టడం ఇతని అసలు పని. కాని అలవాటుచొప్పున అందరికీ కాఫీ యిస్తానంటాడు.... (విశ్వంతో) వ్యవహారం రేపు మాట్లాడుకుందామా? మీరు ఆఫీసువేళ దాటిపోయినతరవాత వొచ్చారు. కాని తొందరప నేదన్నా వుండి విడిపించేసుకోడానికి ఎంత సొమ్మివ్వాలో ఇప్పుడే తేల్చుకుందామంటే అలాగే కానిద్దాము. పట్టుబడినవాళ్ల సౌకర్యాలు మేము కనిపెట్టి చూస్తూనేవుంటాము వీలయినంతవరకూ.

విశ్వం — ఇప్పుడు మరేం మించిపోలేదు. రేపే చూసుకుందాము. నేను భాగ్యవంతుణ్ణి. మరీ గొంతెమ్మ కోరికలు కోరకుండావుంటే మీరు అడిగినంతా ఇవ్వగలను.

ప్ర—మీవంటి మనిషిని నే ఇదివర కెక్కడా చూడలేదు. సాధారణంగా పట్టుబడినవాళ్లందరూ ఏమీ డబ్బులేని బీదవాళ్లమని ఏడిచి నానాగొడవా చేస్తారు.

విశ్వం—డబ్బు ఏమీ లేని బీదవాళ్లు మోటారుకార్లు కొనుక్కుని షికార్లు తిరగరుగా!

ప్ర—అదే మేమనేదీని!

విశ్వం—మాకు కావలసిన సౌకర్యాలన్నీ చెయ్యండి. మీ కేమీ తక్కువజరగదు.

సింహా—పల్లేరుకాయల పులుసూ, బ్రహ్మచెముడు మట్టలూ మాకొద్దు. మరో పసందయిన భోజనం దొరక దేమిటి ?

ప్ర—సిగరెట్లూ, బ్రాందీతోసహా ఏది పడితే అదే దొరుకుతుంది డబ్బిస్తానంటే. అరువుమాత్రం లేదు.

సింహా—అలా సెప్పాలి !

విశ్వం—మీ రిక్కడ అంతా సోషలిస్టులేనా ఏమిటి ?

ప్ర—అబ్బే అదేం కాదే ? దేశంలో ఉత్పత్తయిన భాగ్యం సరిగా పంపకంకావడం లేదని మా అందరికీ వుద్దేశా లున్నాయనుకోండి, దొంగతనం ఘరానావృత్తిగా సాగించు కోవాలంటే గౌరవమైన అభిప్రాయా లుండాలి. మనం ఏపని చేసినా దేశక్షేమానికో, లోకకళ్యాణానికో చేసినట్టు మనసుకి సమాధానం చెప్పుకోవాలి. అందరికీ చెప్పాలి. అంతేగాని, మా కేం ? మాలో అన్ని రకాల వాళ్లూ వున్నారు : కమ్యూనిస్టులు, కాంగ్రెస్‌వాళ్లు, నాస్తికులు, భగవద్భక్తులు, గృహస్థులు, బైరాగులు. ఇక్కడ సంపూర్ణభావస్వాతంత్ర్య ముంది. ప్రతివాడికీ వేపకాయంత వెఱ్ఱిమాత్రం వుందనుకోండి. అది మిమ్మల్నేమీ బాధించదు.

విశ్వం—అబ్బే! అందు కనలేదు. ఆమాట కొస్తే నేనూ ఓరకమైన సోషలిస్టునే.

ప్ర—అవునవును. భాగ్యవంతుల్లో చాలామంది సోషలిస్టులు, అదో ఫాషను.

సింహా—సోషలిజమ్ మీలో కూడా పాకిందంటే, ఇహ దానికి బాగుపడే దినా లొచ్చా యన్నమాట !

ప్ర—నిజమే, వేదాంతులూ, నిజాయితీ మనుష్యులే నమ్మే సిద్ధాంతాలు అట్టే వ్యాపించవు. ఏదన్నా సిద్ధాంతానికి బలంరావాలంటే అది ముఖ్యంగా దొంగల్లో వ్యాపించాలి.

విశ్వం—తెలియ కడుగుతాను. దొంగలంటే సామాన్యప్రజలకంటే తక్కువ నిజాయితీ మనుష్యులనా ?

ప్ర—అది కాదు. బందిపోటు దొంగతనం సామాన్య వ్యాపారం కాదు. అసామాన్యవృత్తి. కనక దీంట్లోకి సామాన్యమానవులు రాలేరు. అసామాన్యవృత్తులకి సాధారణంగా రెండురకాల మనుషులు చేరుకుంటారు. సంఘంలో ఎందుకూ మారని కుంకలు ఒకరకం. సంఘానికి అతీతులు రెండో రకం. మేము సంఘంలో మురికీ, మీగడాను. మురికి అధమ రకం, మీగడ ఉత్తమరకం.

సింహా—జాగర్తండోయ్. అమురికో దేవడైనా ఈ మాటింటే గొప్పతగువొచ్చిపడేను !

ప్ర—మరేం భయంలేదు. ఎవరిమటుకు వాళ్లే మీగడా, మిగతావాళ్లంతా మురికీ అనుకుంటారు. ఆమాటకొస్తే మిగతా వాళ్లని మురికివెధవలని తిడితే మరీనయం. మరీ సంతోషిస్తారు.

విశ్వం—లోకజ్ఞానం చాలా వుంది మీకు. ఒక్క ప్రశ్న వేస్తాను. ఏమీ అనుకోరుగదా :

ప్ర—మీయిష్టమొచ్చిన ప్రశ్న వెయ్యండి. మరేం ఫరవాలేదు.

విశ్వం—మీ అంత తెలివయినవాడు ఈవృత్తిలో ప్రవేశించి ఈ మేకల్ని కాసుకుంటూ కూచోడ మెందుకు ? మీకంటె తక్కువ తెలివయినవాళ్లు అనేకమంది సంఘంలోనే వుండి ఆర్జించుకుంటూ, మూడుపూట్లా భోజనం చేస్తూవుంటే మీ కీపల్లేరుకాయలపులుసూ, ఉడకబెట్టిన బ్రహ్మచెముడు మట్టలూ ఖర్మమేం ?

ప్ర—నేను మాత్రం చెయ్యలేదూ ? అందరికంటె ముందు నేనే అన్నీ రుచిచూసేవాడిని. పదిమంది యిళ్లలో వంటచెయ్యడంవల్ల అన్ని రకాల మనుష్యులూ తెలిసొచ్చారు. అందుకనే నా కింత లోకజ్ఞానం.

విశ్వం—నువ్వు వంటబ్రాహ్మడివా అసలు ?

ప్ర—అవును. ఈ బందిపోటు నాయకుడు ఒకప్పుడు వంటబ్రాహ్మడు. (అకస్మాత్తుగా) నేను నాజీవితకథచెప్పనా ?

సింహా—సిటికలో సెప్పెయ్యాలి. శాంతాడంతోటి సెప్పకు :

విశ్వం—నీకేం విందామని కుతూహలం లేందే ? నీ కిష్టంలేకపోతే నిద్రపో.... కథమాత్రం కుదించకండి.

ప్ర—నే ప్రేమించిన స్త్రీ....

విశ్వం—సరి !

సింహా—ప్రేముందీ.అటయితే వింటాను. నీ వూసేదో చెప్పుకుంటావని భయపడ్డాను.

ప్ర—నాప్రేమగాథే నాజీవితగాథ ! అది తెగి ఇక్కడి కొచ్చి పడ్డాను. నే ప్రేమించిన స్త్రీ....

సింహా—సినీమా కథ ఏదన్నానా ఏటయ్యా ?

ప్ర — సినీమానాజూకుతనంతో నాకేంపని ? నే ప్రేమించినదానిది ఉక్కుముక్కలాటి వొళ్లు! జ్వరమన చీద లేదు ఎప్పుడూ. నలుగురి పని ఒక్కర్తే ఆడుకుంటూ

పాడుకుంటూ చేసేది. మాంచి తెలివయినది. నోరుమాత్రం కొంచెం దురుసు. ఎంతటివాడినయినా హడలగొట్టెయ్య గలదు. తిట్టాలంటే ఇహ చూసుకోండి ఆభాష. తిట్టిన తిట్టు తిట్టకుండా మూడుగంటలు తిట్టగలదు! నిమిషంలో మనసు మార్చుకునేది. ఆ కోపం, ఆ ప్రేమ, ఆ కరవడం, ఆ మనసుమార్చుకోడం సరిగ్గా ఆడది ఎలా వుండాలో అలా వుండేది. ఒక్కమాటు దాన్ని చూసిన తరవాత ఇహ ప్రపంచంలో మరెవరిమీదా మనసుపోదు.

విశ్వం—ఎవరు? ఏం చేస్తూవుండేది?

ప్ర—దాసీపని చేస్తూవుండేది.

విశ్వం — బాగుంది. కొత్తరకం కావ్యనాయిక. తరవాత? నిన్ను పెళ్లిచేసుకోనందా?

ప్ర—పెళ్లిచేసుకుంటే నే నిక్క డెందుకుంటాను? బ్రాహ్మణ్ణి పెళ్లిచేసుకోనంది.

విశ్వం—ఏం? దాసీది బ్రాహ్మణ్ణి పెళ్లాన్ననడమేం?

ప్ర—వంటబ్రాహ్మడు శుభ్రంగా వుండడని! కొల్లాయగుడ్డ కట్టుకుని వంటచేసి వొడ్డిస్తేనేగాని యింటివారు వూరుకోరు. ఆ కొల్లాయగుడ్డ ఎంత మురికిగా వుంటే అంత ఆచారం. ఇది అంట్లు తోమేటప్పుడయినా చాలా నీటుగా వుండేది. నన్ను చూసి అసహ్యించుకునేది. వంటయిపోయిన తరవాత మంచిబట్టలు కట్టుకుని వెళ్లినా నా మొదటి రూపు మరిచిపోయేది కాదు. దానికోసం వంటపని అసలు మాను కున్నా లాభం లేకపోయింది. చచ్చిపోతానన్నా. కావలిస్తే మందు తెచ్చిపెడతా నంది. చంపుతా నన్నాను. దానితో వెఱ్ఱి లెత్తుకొచ్చింది. నేను చంపుతున్నట్టు పీడకలలు రావడం మొదలెట్టాయి. నే నావూళ్లో వుంటేనే దానికి నిద్రపట్టడం పోయింది. నే నెంతో ప్రేమించిన ఆడది నామూలాన్న నిద్ర లేక చిక్కి శల్యమైపోడం చూసి భయపడ్డాను. ఈ దేశ మొచ్చేశాను. దొంగలతో స్నేహమయింది. బుర్రున్న బ్రాహ్మణ్ణికనక కొద్దిరోజుల్లో నాయకుణ్ణయాను. పెద్ద కంపెనీ పెట్టాను. కావలసినంత లాభాలు. ఎంతో బలగం. కాని దాన్ని మాత్రం మరిచిపోలేకుండా వున్నాను. ఈ అడవుల్లో ప్రతి చెట్టుమీదా దాని పేరు చెక్కాను. ఆ పేరే జపంచేసు కుంటాను. సింహాచలం! సింహాచలం!

సిం—(ఉలిక్కిపడి) సింహాచలమా?

ప్ర—అవును. దాని పేరు అప్పల నరససింహాచలం!

సిం—ఏయ్. అది మా అప్ప పేరు.

ప్ర—అన్నట్టు. ఓ తమ్ముడు మంచి కారుడ్రైవరని చెప్పేది. నువ్వేకాబోలు. నీ పేరూ సింహాచలమేకాదూ?

సిం—ఆ!

ప్ర—అందరి తమ్ముళ్లలోకీ నువ్వంటేనే చాలా యిష్ట మని చెప్పింది.

సిం—ఏయ్. నువ్వేం బ్రాహ్మడివయితే అయావు దొంగలనాయకుడి వయితే అయావు, అదీ గిదీ అంటు న్నావు, జాగర్త. నోరుమిగిల్తే ముక్కు చితక్కొట్టేస్తాను.

ప్ర—నా ముక్కు చితక్కొట్టనిస్తానుకాని ఇలా చిత క్కొట్టానని మీ అక్కయ్యతో గొప్ప చెప్పుకుంటావూ? అది ఏదోవిధంగా నన్ను జ్ఞాపకముంచుకుంటే చాలు. నా కంతకంటె ఏమీ అక్కర్లేదు.

విశ్వం—చూశావా సింహాచలం? మీ అక్కయ్యంటే ఎంత ఇష్టమో, ఇక నేమీ అనకూడదు.

సిం—ఇష్టం కాదు; పిరికి!

ప్ర—(తాచుపాములా లేచి) పిరికితనమా? ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసునా? గరిటతిప్పిన భీముడి వంశం నాది! పిప్పిచేసేస్తాను.

సిం—నీలాటోళ్లని లక్షమందిని చూ సీ శా ను. తూర్పాడు బాపనోడికా భయపడతాడు, జాగర్త.

విశ్వం—నిన్ను చూస్తే సిగ్గేస్తోంది సింహాచలం! నీక్కూడా కులాభిమానమే? పోనీ, ప్రసాదుని కొట్టినా దొంగలముఠా అందరినీ కొట్టలేవుకదా!

ప్ర—అదీ యింతే. కులాసాగా కబుర్లు చెబుతూనే వుండేది. తటుక్కున కోప మొచ్చేసేది. అప్పుడు ఇహ వెనకా ముందూ చూడ్డంలేదు. అంచేతే దాన్ని చూస్తే నా కంత యిష్టం. ఆప్రేమే న న్నిలా అధోగతిపాలు చేసింది. లేకపోతే నే నీపాటికి ఓ హోటలు పెట్టి ప్రసాద్ యిడ్లెన్లు, దోసెలూ దేశమంతా పేరుతెచ్చుకోలేక పోయానా? ఎన్ని ఇడ్డెన్లకన్నా పిండి అది ఒక్కర్తే రుబ్బే సునే? అహఁ. నాపెళ్లయినతరవాత ఇహ పిండి రుబ్బ నిస్తానాకాదు!

విశ్వం—(ఆవలిస్తూ) నే నొక్క సలహా చెప్పనా?

ప్ర—ఊఁ.

విశ్వం—ఒక్క ఆడదానికోసం ఇలా నీభవిష్యత్తంతా చెడగొట్టేసుకోడం ఏమీ తగదు.

ప్ర—నాకు తెలుసు. కాని తెలి సేం లాభం? నే నేం చెయ్యగలను? అప్పుడప్పుడు రాత్రులు నాకు నిద్దర

పట్టకపోతే పద్యాలు రాసేవాణ్ణి. చదివి వినిపించనా ? నా కష్టే కవిత్వం రాదు. కాని ఆ విరహబాధలో కవిత్వం దానంతట అది అలా పుట్టుకొచ్చేది. చదవమంటారా ?

"అప్పలనరసమ్మా నీ
కెప్పుడు నామీద దయ వుడుతుందో ?"

ఏమందమయిన పేరు ? ఈపేరుతో ఎవరైనా కవిత్వం రాసెయ్యోచ్చు. నాగొప్పేముంది. ఈపేరే ఎన్ని రకాల మార్చొచ్చునో చూడండి :

"అప్పలమ్మా, నామీద దయాలుంచుమా
అప్పలమ్మా, నామీద.
అలసి అలసి.
విసిగి విసిగి.
అలసి విసిగిపోయినా.
అప్పలమ్మా, నామీద దయాలుంచుమా !"

ఇంకోటి చదవనా ?

"సింహాచలం, నువు నన్ను పెళ్లాడితే, నే నీభర్తను కానా ? సింహాచలం, నే నిను పెళ్లాడితే నువు నాభార్యవు కావా ? నువు నాదానివి కావా ? నే నీవాడిని కానా ?"

అప్ప—ఇది గుండెల్లోనించొచ్చిన కవిత్వం, గుండెల్లో నరాల్లోనించొచ్చిన కవిత్వం. ఈకవిత్వం వింటే అది కరిగి నీరైపోదూ ? నామీద జాలిపుట్టదూ ?

(ఎవరూ మాట్లాడరు. సిం॥, వి॥ నిద్దరోతున్నారు.)

మామూలే ! నాకేమో దివ్యగానం, మిగిలినవాళ్లందరికీ వెఱ్ఱిమొఱ్ఱికవిత్వం ! ఛీ. ఛీ. నే వొఠ్ఠి వెధవని. నా ప్రేమ చంపుకోలేక ఇలా ఏడుస్తున్నాను.

(ఆవలిస్తూ) అప్పలమ్మా ! నరసమ్మా ! అప్పల నరసమ్మా ! సింహాచలం....(అని నిద్రపోతాడు.)

*     *     *

(తెల్లవారుఝాము. వెనకనించి 'మోటారుకారు, మోటారుకారు' అన్న ధ్వని. గడబిడ. ముగ్గురూ ఆవలిస్తూ లేచి కూచుని వొళ్లు విరుచుకుంటూ వుంటారు.)

విశ్వం—ఎప్పుడు నిద్దరట్టిందో తెలీదు. అప్పుడే తెల్లారిపోతోందే ?

(పైన తుపాకి పేలిన చప్పుడు.)

ప్ర—తుపాకీతో ఆడొద్దని ఎన్ని మాట్లు చెప్పినా వినరు. ఈమాటు మెడ విరగ్గొట్టేస్తాను.

(ఒక దొంగ, అయ్యరూ వగర్చుకుంటూ లోపలికి పరుగెత్తుకొస్తారు.)

ప్ర—(దొంగతో) నువ్వేనా తుపాకి పేల్చింది ?

దొం—నే కాదు. వాళ్లే ముందు పేల్చారు.

అయ్యా—రెండు మొగమనిషి, మూడు ఆండవాండ్లు.

ప్ర—ఇక్కడి కెందుకు తీసుకురాలేదు ? భయమేసిందా ?

దొంగ—వాళ్లని చూసి కాదు. వెనక రెండు కార్ల నిండా పోలీసులు తోడున్నారు.

విశ్వం—ఓహో, తోడుకా వది ! కొండలన్నీ గాలించి దొంగల్ని పట్టుకోడానికి సిపాయీల జట్టు బయలుదేరుతోందని మమ్మల్ని వుండిపొమ్మన్నారు. అదేకాబోలు, మేం వినకుండా వొచ్చేశాము.

దొంగ—బాబురే ! మన్ని పట్టుకోడానికి సిపాయిలే ! పారిపోయి కొండల్లో దాగుందాం !

ప్ర—వేళ మించిపోయింది. ఇహ లాభం లేదు. పైగా కొండల సంగతి నీ కేం తెలుసు ! ఒక్క ముక్క అనమన్నా రాదయ్యె, రెండో రోజుకి పట్టుబడతావు !

అయ్యా—నేనుదా ముందరనే చెబితినే-నాయనా బగమంతుణ్ణి తలచురా అని ! బగమంతుడా ? ఎన్న కష్టం తెచ్చి పెట్టితివిరా ! నేను దినాము ప్రేయర్ చేస్తినే ? నన్నైనా రచ్చించు ఆండవనే !

ప్ర—మీరెవరూ గాభరాపడకండి. (వి॥తో) కామ్రేడ్ మమ్మల్ని సిపాయిలకి అప్పగించరుకదూ !

సిం—ఎవరినోస్ కామ్రేడ్ అంటున్నది ? నే నేం కామ్రేడ్‌ని కాను.

ప్ర—నిన్న మాకు మీరు లోకువ. బీదల్ని దోచుకు బతికే దొంగ ధనికుల్ని దోచుకుబతికే దొంగచేతిలో పడ్డాడు. గౌరవంగా చూశాము. ఇప్పుడు మీకు మేము లోకువ.

విశ్వం—నే నెవరిమీదా ఫిర్యాదు చెయ్యను ! ఓరాత్రి ఇక్కడ కులాసాగా గడిపాను. నా కేం విచారం లేదు.

సిం—నా కవ్వన్నీ తెలీవు, నాయిష్టం, తెలిసిందా ?

ప్ర—అలానే కానీ ! నన్ను పట్టుకుంటే నేరం ఒప్పేసుకుంటాను. ఎందుకు దొంగ నవ్వాలసొచ్చిందో కూడా చెప్పేస్తాను. నాపెట్టె వెతికితే మీ అప్పఫొటో, నే రాసిన ఉత్తరాలూ పద్యాలూ, అన్నీ కనిపిస్తాయి. నీపేరూ, నీఅప్పపేరూ పోలీసుకోర్టుల్లో, పేపర్లలో పదిమందినోళ్లల్లోనూ పడిపోతుంది కాసుకో.

సిం—(హడిలిపోయి) పేపర్లో పడితే భయం లేదు కాని, దొంగముండావాడిని మాఅప్ప ఎరుగునని పేరు

పైకొస్తే....నన్నిలా బెదిరించి నోరు కట్టేస్తున్నందుకు చూడు ఏం చేస్తానో ?

ప్ర—ముందర నీనోరు కట్టడిందికదా ! తరవాత సంగతి తరవాత ఆలోచించుకుందాం.

(లోపలినించి కౌముది, కరుణాకరం, ఉష, చయ నులుగారూ లోపలి కొస్తారు)

కౌము—(తిన్నగా విశ్వందగ్గిరకి వెళ్లి) విశ్వమే !

విశ్వం—ఆ. నేనే దొరికిపోయాను.

కరు—నే చెప్పలే, విశ్వేశ్వర్రావుగారేనని? మా కారు టైరు పంక్చరయిపోయింది. ఇదేమిటో, ఈరోడ్డునిండా మేకులే !

కౌము—మాతో ఎవరితోటీ చెప్పకుండా ఒంటరిగా యిలా ఎందుకొచ్చేశావు ?

కరు—నేనే పందెం గెలిచాను. (కౌముదితో) మనం పూటీ వెళ్లగానే మీరందరికీ టీపార్టీ ఇవ్వాలం. (విశ్వంతో) మీరు పూటీ చేరేలోగా మిమ్మల్ని కలుసుకో లేమని పందెం వేశారండి. నా కారుసంగతి ఆవిడకేం తెలుసు? గంటకి అరవైమైళ్లపై వెళుతుంది.

విశ్వం—ఇది పూటీరోడ్డు కాదే ?

కరు—అయితే యేం ? కౌముదిగారు ప్రతి పెట్రోలు బంకుదగ్గిరా మీ ఆచోకీ కనుక్కుంటేనే ! వీరు గొప్ప సి. ఐ. డి. గా పనికొస్తారండోయ్.

విశ్వం—ప్రకృతి తరుముతోంది. ఇహ నాపనయి పోయింది.

(అకస్మాత్తుగా అరవిందం లోపలికొస్తాడు.)

అర—అమ్మయ్య ! నువ్వు కులాసాగా వున్నావా ? నిన్నేమో దొంగలెవరో పట్టుకున్నా రనుకున్నా.

చయ—('ప్ర' కేసి తీక్షణంగా చూసి) వీరిని ఇదివర కెక్కడో చూసినట్టు జ్ఞాపకమొస్తోంది.

అర—నేనూ చూశాను. నాకూ చాలా బాగా గుర్తుంది.

ప్ర—(ఉషతో) మీకు నన్ను చూసిన గుర్తు లేదూ?

ఉష—వుందికాని పేర్లు నాకు జ్ఞాపకముండవు !

ప్ర—అయితే నన్ను నేనే పరిచయంచేసుకుంటాను. అందరం గోవిందంగారింట్లో కలుసుకున్నాము.

చయ—ఓహో, ఆలా చెప్పండి ! ఏదైనా పనిమీ దొచ్చి వారంపదిరోజు లున్నారుకాబోలు.

ప్ర—వారం ప ది రో జు లే ం ? నాలుగయిదునెల లున్నాను. వారింట్లో వంట చేశాను.

చయ—ఓరి నువ్వు వంటవాడివా ?

ప్ర—నాకంతా కళ్లకట్టినట్టుంది. కౌముది పది మందిచేతా బతిమాలించుకుంటేనేకాని ఎప్పుడూ తినేది కాదు. ఉష చడీ చప్పుడూ లేకుండా తిని వెళ్లిపోయేది. తినలేదని ఇంటిల్లిపాదీ గాభరాపడేవారు. ఇహ చయనులుగారికి కావాలి గాని మొహమాటం. వొద్దువొద్దంటూనే, ఎంత పెడుతూ వుంటే అంతా తినేసేవారు.

చయ—(కోపంతో)కట్టిపెట్టు నీ సంభాషణ.

ప్ర—నాకేం ? మీకు జ్ఞాపకం రాలేదంటే జ్ఞాపకం చేశాను. ముందు పలకరించింది మీతా, నేనా ? ఇక్కడ మీరెంతో నేనూ అంతే ! ఇహ మాటలొద్దు.

విశ్వం — నువ్వా నీకారూ ఎక్కడినించి కొట్టు కొచ్చారు కరుణం ! నువ్వా ఇంకా ప్రకృతిశక్తిని వొదుల్చుకోలేకపోయావూ ? నన్ను ఇంకా తిప్పితిప్పి కొడుతోందీ ?

ఉష—(మాట తప్పిస్తూ)అదుగో శిపాయి లొస్తు న్నారు !

అయ్య—సిపాయిలే ? అందవనే! పూడుస్తునా ?

ప్ర—కదిలావంటే నిన్ను పూడుస్తా ఇక్కడ.జాగర్త!

సోష—విప్లవం రావాలంటేవినలేదు. ఇప్పుడు జరుగు తోంది శాస్తి. కాపిటలిస్టుప్రభుత్వం మనమీద కసితీర్చు కుంటోంది.

అయ్య— బిగమంతుడా! ఎన్నమనిషి. ఇప్పుడు కూడా పాలిటిక్సే మాట్లాడుతుడే ? బిగమంతుణ్ణి ద్యానం చెయ్యిమీ !

ప్ర—పాలిటిక్సే మాట్లాడండి ! అదే పెద్దమనిషి తరహా !

(ఒక ఆఫీసరు లోపలికొస్తాడు. సలామ్ పెట్టి)

ఆఫీ—నీళ్లందరూ ఎవరండి ? మేం దొంగలకోసం గాలిస్తున్నాము.

విశ్వం—ఈకొండల్లో నాకు దారి చూపించడానికి నే తోడుతెచ్చుకున్నాను. దొంగలు కారు !

(ఆఫీసరు తిరిగి సలామ్ పెట్టి వెళ్లిపోతాడు. ప్రసాద్ సింహాచలాన్ని చూసి చిరునవ్వు నవ్వుతాడు.)

[సశేషము]

# నాటకములు: పద్యములు



= శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి =

ఇపుడు దృశ్యకావ్యము లన్నిటికి నాటక మను సంజ్ఞయే తఱచుగా వాడుకలో నున్నది కావున నిందు దానినే వాడుదను.

విజాతీయుల సహవాసమువల్ల వారి మతాచార సంప్రదాయములు కొన్నికొన్ని హైందవుల కబ్బుచున్నట్లే, ఆంగ్లభాషాసంసర్గవిశేషమువల్ల దాని సంప్రదాయములు కొన్ని మన భాషలకు సంక్రమించుచున్న వనుట విదితము. అది స్వాభావికమే, తప్పదు. ఇపుడు తక్కిన లక్షణముల మాట యటుంచి, నాటకముల కావశ్యక మనుకొనుచున్న యొక మార్పును గూర్చి యించుక పరామర్శింతము.

“నాటకమందు పద్యము లుండరాదు” అని రూపకరచన కొక క్రొత్తలక్షణము తలచూపినది. ఇది పదములు, లేక పాటలకు ఉపలక్షణము. ఇవి రాగములతో పాడుట యాచారము * కావున సంగీతము కూడ దన్న యభిప్రాయ మిం దిమిడియున్న దనుట స్పష్టము. ఈ మతము నేఁటిది కాదు. ఇది యుదయించి సుమారు ముప్పదియేం డ్లయినది. కాని, ఆనాఁడు పద్యసంగీతములు ప్రేక్షకరంజకము లగుట కనిపెట్టుచున్న నటులు వాటిని విడువలేదు. అది యెఱిఁగిన రూపకరచయిత లామతము నెక్కువగా నాదరింపలేదు. ఆయినా, కొంద ఱాసమయమున వచననాటకములు రచియించుచుండుటయు, వాటిలో నొకటి రెండు ప్రదర్శింపఁబడుచుండుటయు లేకపోలేదు. అందు గణింపఁదగినది ‘కన్యాశుల్కము’. పాత్రౌచిత్యమును చక్కఁగాఁ పాటించిన యది చదువరులను, చూపరుల నాకర్షించినమాట నిజము. కాని, ఆనాఁటి వే మఱికొన్ని వచననాటకములు సామాజికులను రంజింపఁజేయలేదు సరిగదా, పాఠకుల కైన నింపు పుట్టించలేదు. ఇట్లనుట పద్యాదులతోడి నాటకములు రెండువిధముల రంజకము లైన వని కాని, అగుచున్న వని కాని చెప్పుటకాదు. అట్టి వెన్నో విఫల మైనమాట విద్యావంతు లెఱుఁగనిది కాదు. వాణీవిలాస నాట్యమండలివారి యొకటిరెండు వచననాటకప్రదర్శనము లిపుడు సభ్యరంజకములై సఫలము లగుచున్నమాటయు నాటకకళాభిజ్ఞులకు తెలియనిది కాదు. దీనినిబట్టి, నాటకమును, తత్ప్రదర్శనమును సహృదయహృదయంగమము లగుటకు వస్తుపాత్రరసౌచిత్యములు కారణము గాని పద్యసంగీతముల కలిమియు, వాని లేమియు హేతువులు కా వని తెలియుచుండఁగా, వాటిని తీసివేయవలె నన్న వాద మెందుకు పుట్టవలెను?

“కథాదుల యౌచితి ముఖ్యమే యైనను, రంగస్థలమునందు పద్యసంగీతములతోడి సంభాషణము పాత్రోచితమును, స్వభావసిద్ధమును కాకపోవుటచే నది యింపు పుట్టింప”దని:—సరే కాని, వేటి ననుకరించి మన మీ మార్పు కోరుచున్నామో, ఆ యాంగ్ల నాటకములలో పద్యములు లేవా? పాత్రముల సహజసంభాషణము కంటె ఆ పద్యరూప సంభాషణము విలక్షణముగా నుండదా? షేక్స్పియరుమహాకవి పద్యరూపసంభాషణమందలి యౌచిత్యానౌచిత్యము లెఱుఁగఁడా? అతని. నాటకములు ప్రదర్శనరమ్యములు, కావా? మఱియు, తెలుఁగును పోషించిన సంస్కృతప్రాకృతములలోని రూపకములలో పద్యము లున్నవి గదా! నాటకకళాభిజ్ఞు లైన భాసకాళిదాసాదులును,

శాజశేఖరాదులును పద్యరూపపాత్రసంభాషణము సామాజికరంజకము కాదని తలఁచినచో వారు పద్యములు రచించి యుందురా? కావున, రూపకములందు పద్యము లుండరా దన్నవాదము సమర్థము కాఁజాలదు. ఇఁక నో, పద్యభావము తెలియకుండునట్లు నిరర్థకము లైన పదముల విఱుపులతో పద్యమధ్యపద్యాంతము లందు రాగము సాఁగదీసి పాడుట కూడ దందురా, అది యంగీకరింపఁ దగినదే. అంకములు పద్యశతకములో యనునట్లు సందర్భశుద్ధియు, భావపుష్టియు లేని పద్యములతో నాటకము నిండించుట తగ దందురా, ఆ యభిప్రాయమును గ్రహింపఁ దగినదే. అంతే కాని శ్రుతిరమ్యమును, భావానుగతము నై యౌచిత్యమర్యాద నతిక్రమింపని పద్యమును, సంగీతమును సామాజికుల కుత్సాహము పుట్టింపవని మాత్రము భావింపరాదు. అవి రంగప్రసాధనవిధులలో చేరినవే.

సంస్కృతనాటకముల ననువదించుటయు, వాటి ననుకరించి యనుసరించి రూపకములు వ్రాయుటయు తెలుఁగునకు సుమా రేఁబదియేండ్లనాఁడు బయలుదేరినది గాని, నన్నయభారత మువయించిన దాదిగా సుమా రాఱుశతాబ్దులలో మనవారు రూపకరచనమే యెఱుఁగరు. తరువాత నేవో యొకటిరెండు నాటకములు పుట్టినట్లు వినవచ్చిన నేమి? అవి కనరావు. పిదప ౧౬౨౦ ప్రాంతమునందు తెలుఁగురాజులు పాండ్యాదిమండలము లేలుచున్నపుడు దృశ్యకావ్యనిర్మాణ మారంభ మైనది. అది నాట్యశాస్త్రదశరూపకాదిలక్షణముల ననుగమించినది కాదు. స్వతంత్రము. వీథిపందిరియే నాట్యరంగముగా నటులు ప్రదర్శించిన యా దృశ్యకావ్యములు యక్షగానకావ్యము లని మనవారు వ్యవహరించుచున్నారు. అవి యిపుడు తంజాపూరు పుస్తకభాండాగారమున వందలకొలఁదిగా నున్నవి. మన దేశములో చిరకాలముగా ప్రదర్శింపఁబడుచు ప్రేక్షకుల నాకర్షించుచు వచ్చిన భామకలాపము, గొల్లవేషము, ప్రహ్లాదచరిత్ర మొదలయిన వాజాతిలో చేరినవే. భారత రామాయణాదికథలను ప్రేక్షకరంజనముగా వీథిపందిటిలోని తెరమీఁద ప్రదర్శించెడి 'తోలుబొమ్మలాట' తెలుఁగువారికి చిరపరిచితమే. అది నేఁటి టాకీసినీమాను పోలవచ్చును. ఈ చెప్పినవాటిలోని పద్యములు, పాటలు నింత దనుక జనరంజకము లగుచు వచ్చిన వని మన మెఱుఁగమా? నేఁటి తక్కిన నవనాగరికతాలక్షణములవలె నాటకమున పద్యాదు లుండరా దన్న నూతనలక్షణము వెలసినది గాని, యీ వాదమున సారస్య మేమీ లేదు. పద్య సంగీతసహితము కానీ, తద్రహితము కానీ! యేది సహృదయరంజక మగునో, అదే గణింపఁదగిన నాటకమనుకొన్నచో విప్రతిపత్తియే లేదు. ఎవరికి తోఁచిన పద్ధతిని వారు నాటకములు రచింతురు. అం దేది సభ్యరంజక మగునో!! దాని యదృష్టము. పదపద్యసంగీతప్రియులు వచననాటకములు వద్దనుచున్నారా? ఇఁక వీ రెందుకు వాటిని నిషేధింపవలెను? కావున పద్యనిషేధవాదము హృద్యము కా దనక తప్పదు. ఇఁక:—

పాత్రసంభాషణము పద్యములవల్ల నసహజమై యసముచితము కాకున్న దనెడి మతము నింతవఱకే సోదాహరణముగా నొకింత చర్చించియున్నాము. ఈ సందర్భమున మఱిరెండు మాటలు:—

కథ సత్యమో కల్పితమో! అది పురాతనమో అధునాతనమో! అందలి స్త్రీపురుషుల వేషములు వేసుకొని నటులు నాట్యరంగమున కావించు కృత్యమేమి? వారి యవస్థల ననుకరించుట. అంతే కదా! 'అవస్థానుకృతి నాట్య' మన్నంతమాత్రమున వారి చేష్టలను మాటలను, ఎట్లు జరిగెనో, లేక యెట్లు జరిగియుండు నని మన మూహింతుమో, అట్లే నటులు చూపుట యనుకరణ మనియు, అదే నాట్య మనియు భావింపరాదు. అట్లైని, యా నాటకకర్త కవి కాఁడు, ఆనాటకము కావ్యమును కాదు. కణ్వుఁడు శకుంతల నత్తవారియింటికి పంపునపు డే విధముగా మాటలాడియుండు నని లోకానుభవమునుబట్టి మనము తలంతుమో, అట్లే శాకుంతలనాటకమున నున్న దనఁగలమా? నిజముగా నట్లే యున్నచో, కాళిదాసు ప్రతిభాశాలి యగు మహాకవి యను పే రొందునా? ఆ నాటక మింత కాలము విద్వద్రంజకమై నిలచునా? కణ్వుఁడు పద్య

# సౌందర్యమును కుటుంబములో నిలబెట్టుట

"మా అమ్మ నీకు ఫోటోలో కనబడుచున్నంత సౌందర్యవతిగాయుండేది. గాని యేఫోటోలు అయినను ఆమె చర్మలావణ్యమును చూపలేవుకదా" అని ఆ తల్లి చెప్పుచున్నది. ఆ తల్లి కూడా చర్మసౌందర్యమును అంత అద్భుతముగా నిలబెట్టుకున్నది: తన కుమార్తె కూడా అల్లా చేయవలెనని ఆమె కోరిక. తన కుటుంబపు సౌందర్యమును కాపాడుకొనే రహస్యమును, పియర్సు సబ్బును నిర్మలమైననటితో వాడే విధానమును, తన కుమార్తెకు శ్రద్ధగా బోధించినది ఈ బోధన సౌందర్యమును కుటుంబములో తరతరాల నిలచి వుండేటట్లు చేస్తుంది.

ఇండియాలో నలభై సంవత్సరములనుంచి అందమైన స్త్రీలు ప్రత్యేకముగా పియర్సునే వాడుచున్నారు. దీని పరిమళము, మృదువైన నురుగు దీనికి సబ్బులలో ప్రాముఖ్యత నిచ్చినవి.




# పియర్సు సబ్బు

శాశ్వతముగా సౌందర్యమును కాపాడుటకు

TG. 40-172 TL

A. & F. PEARS, ISLEWORTH, ENGLAND

# నీవు తినేదంతా బలమునిస్తుందా?






ప్రతి గృహిణి ఏ ఆహారపదార్థము ఎంత శక్తి నిచ్చునవో తెలిసికొనవలెను. డాల్డా పాకశాస్త్రమను పుస్తకము (ఇంగ్లీషులో అచ్చు వేయబడినది) 150 ఇండియన్ వివిధ తినుబండారములు తయారుచేయు పద్ధతులతో కూడినది. మిక్కిలివుపయోగ కరమైన విషయములు గలవు. 4 అణాల బిళ్లలు Dept. D110 P. O. Box 353, Bombay, వంపుడు.



ఔను—ఆహారము బలమువిచ్చును! గాని అన్ని ఆహార పదార్థములు ఒకే విధముగా పుష్టినివ్వవు. కొన్ని బాగా బలము నివ్వగలవు. కొన్ని చాల కొద్దిగా మాత్రమే యివ్వగలవని చెప్పాలి—ఈ కారణంచేతనే ఆరోగ్యంచెడటం సంభవిస్తుంది. సామాన్యముగా బాగా యిష్టమైన ఆహారములు యేమాత్రము బలము నివ్వలేకపోవుటచే వాటిమీద ఆధార పడే వారు పనిపాటలు చేయుటవలనగాని, ఆటలాడుటవలనగాని, అలసట చెందకుండా వుండలేక పోతున్నారు. ఐతే అన్ని ఆహారములు విటమిన్లతోనిండిన డాల్డాతోవండుటవలన మిక్కిలి బలము నివ్వగలవు. డాల్డా ప్రకృతిసిద్ధమైన ఆహారపదార్థములతో కూడినదై మంచి బలమును చేకూర్చి, బలమునివ్వలేని యితర ఆహారముల కొరతను తీర్చగలదు. దీనితో వండినయెడల అన్ని పదార్థములు ఎక్కువ బలము నివ్వగలవు.

## విటమిన్లతోనిండిన డాల్డా బలమునకు

HVM. 35-23-40 TL.

THE HINDUSTAN VANASPATI MANUFACTURING CO., LTD.

ముతోనే పూల మొక్కల యనుమతి ప్రార్థించెనా? దుష్యంతునికి పద్యరూప సందేశము శిష్యులచేత పంపెనా? అట్లే వా రాతనికి చెప్పిరా? లేదు. అయితే, ఆ ఘట్టమును నటులు నటించునపుడు సామాజికులలో నొకఁడైన 'నిదేమిటి? ఈ సంభావణము సహజముగా లేదు. స్వభావవిరుద్ధ, మనుచిత'మని నిరసించె ననఁగలమా? ఇట్లే సీతారామ ద్రౌపదీ ధర్మజాదుల చేఁతలను, మాటలను పురస్కరించుకొని, నాటకకవు లాయాసందర్భములందు రచించిన పద్యము లెట్లు సముచితములు కావో సప్రమాణముగా నిరూపించి, యపుడు నేఁటి నాటకకవులకు పద్యనిషేధ ముపదేశించిన బాగుండును.

ఉత్తరరామచరిత్రలో శ్రీరాముఁడు సీతను తలఁచుకొని విలపించినట్లు రెండుమూఁడుచోట్ల పద్యము లున్నవి. నటులు వాటి భావ మభినయించుచు పఠించునపుడు తన్మయత్వము చెంది సామాజికులు కంట నీరు పెట్టుదురు గాని, "అయ్యో! భవభూతి శిఖరిణీవృత్తములో విలాపము వర్ణించి రసభంగము కావించె" నని యతనిని తిట్టుదురా? దృశ్యకావ్యకళాపారీణు లగు కవిసత్తములు—

"కవిచతురాననప్రతిభఁ
గల్పిత మైన విచిత్రసృష్టికిం
దవిలిన దేశకాలసుర
దానవమానవవృత్త మెల్ల ని
క్కువ మనునట్లుగా నెదుటఁ
గూరిచి చూపఁ జిత్తముల్ సుఖా
ర్ణవమున నోలలార్చు కృతి
రాజము రూపకమే తలంపఁగన్."

అన్నట్లు, సామాజికులు తన్మయులై యానందించుటకు రసోచితము, పాత్రోచితము, సందర్భోచితము నగు రీతిని మాటలు, పద్యములు కూర్చుచు తమ కృతి ప్రదర్శనరమ్య మగుట కుద్యమించుచు వచ్చిరి. ఇపుడా యాచారము తగ దన్న కవీశ్వరులు సభారంజక మగు పద్ధతిని పద్యరహితముగానే నాటకములు నిర్మింప యత్నింతురుగాక. ఈ రెండుపద్ధతులకును రూపకసారస్వతమున నెంతో యవకాశ మున్న మాట సత్యము. అట్టియెడ నొకదాని నొకటి నిరసింపఁ బని యేమి? అది తగ దనుటయే యీ వ్యాసము నుద్దేశము.

## సవరణలు

గతమాసపు భారతిలో 'మధుర నేలిన తెలుగునాయకరాజులు' అనే వ్యాసములో 291 పుట 8-వ పంక్తి (రెండవకాలము)లో 'అక్కనమాదనల'కు బదులు 'లక్కనమాదన'లని చదువుకొనవలెను.

—దిగవల్లి వేంకటశివరావు.

కడచిన ఫాల్గుణమాసపు 'భారతి'లో 252-వ పుటలో రెండవకలమున 16-వ పంక్తిలో "చలితదశమాధిపతి" యనుటకు "చలిత బృహస్పతి" అనియు, 17-వ పంక్తిలో "జన్మదశమాధిపతి" యనుటకు "జన్మబృహస్పతి" అనియు సవరించుకోవలసి యున్నది. పాఠకమహాశయులకీ తొందర కల్గించినందుకై చింతిల్లుచున్నాను

—రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు.




## కీ. శే. కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు

పంతులుగారిని గుఱించి నాకు తెలిసినది కొంచెము. నేను వారికి సమకాలికుడను కాను. అనగా వయస్సులో వారికి కొంచెము అటు నిటుగా నుండుట. నేను వారి పేరు వినునాటికే వారు నాయకులు, దాతలు, దేశోద్ధారకులు. తరువాత నేను పోయి యెవరినైనను ఆశ్రయించుట యనునది చాల తక్కువ. మొట్టమొదట మిత్రులు శ్రీ కోలవెన్ను రామకోటేశ్వరరావుగారిని అడిగితిని: నే నేదైనను భారతికి వ్రాయుచుందును- పంతులుగా రేమైన నిచ్చెదరేమో అడిగిపెట్టవలెనని. రామకోటేశ్వరరావుగారు అడిగిరి. పంతులుగారు సరే యనిరట. నేను తరువాత నెప్పుడైనను మదరాసుకు పోయినప్పుడు వ్రాసినవానికి నీయవలసినది యేదైన నున్నచో పంతులుగారి దర్శనము చేసి యడిగెడువాడను. వారు వెంటనే యిచ్చెడివారు. ఏకవీర, కళింగరాజ్యము ఇవి రెండును మొదట భారతీ ముఖమున ప్రచురింపబడినవి. నా కప్పు డేదో డబ్బు కావలసి పంతులుగారి కడకు పోయి "యీ గ్రంథములు మీ భారతిలో ప్రకటించి, నాకు ప్రస్తుతమింత డబ్బు కావలయును- ఇప్పించు"డని యడుగుచుంటిని. వారు మఱుమాటాడక అట్లే యిచ్చుచుండిరి. నా కాశ్చర్యముగా నుండెడిది: అందఱికి నిట్లే యిత్తురా? నాయందు వీరికి ప్రత్యేకాభిమాన ముండవలసిన యవసర మేమియు లేదే యని. నిజానకు నాయం దేమియు వారికి ప్రత్యేకాభిమానము లేదు. అంతియేకాక భారతిలో ప్రకటింపబడిన నా పద్యములను వారివద్ద నిందించినవారినికూడా నే నెరుగుదును. ఆ నిందించిన వారు సామాన్యులు కారు. ప్రసిద్ధులైన పండితులు. ఇది యెందుకు చెప్పితి ననగా—నేను డబ్బడుగుటయు, వా రిచ్చుటయు వారి సహజౌదార్యగుణమొక్కటియే కారణముగా నాకు కనిపించినది.

వారి యౌదార్యము నే నొకసారి పరీక్షసేయవలయు ననుకొంటిని. నా వంటివా డట్టి పని చేయగూడదు గాని గొప్పవాళ్లను కొద్దివాళ్లు తమ యంతరము, పెరయంతరము తెలియకుండ పరీక్షచేయుట, విమర్శించుట మన దేశములో సహజమైన గుణము కనుక ఆ గాలివాటమున చేసితి కాబోలు. ఆ పరీక్ష యిది. పంతులుగారు తమ కుమార్తెవివాహము జగజ్జేగీయమానమైన వైభవముతో బెజవాడలో జరిపిరి. నేను పోలేదు. ఒకపద్యము చదువలేదు. పద్యము చదివిన ప్రతికవికి ఒక శేలువ, ఒక వెండిగిన్నె, పది రూపాయలు ఇచ్చుచుండి రని చెప్పిరి. అప్పుడు నే నొక పల్లెటూరిలో నుంటిని. ఆయూరిలో పదిమందిని పిలిచి, పదిమందికి పది యయిదులు ఏబది పద్యములు వ్రాసి పెట్టితిని. అందులో ఒకరిద్దరు గణా లున్నచో యతులు లేకుండ, యతులు కూడనున్నచో మతులులేకుండ పద్యములు వ్రాయగలవారే. వారిని బెజవాడకు పంపించితిని. మూడవదినమునకల్లా ఆ పదిమందియు పది శేలువలు, పది వెండిగిన్నెలు, పది పదులు వంద రూపాయలు పుచ్చుకొని యింటికి చక్కా వచ్చిరి. నా కాశ్చర్యము వేసెను. అందులో నలుగురు పద్యము చూచి చదువలేరు. "ఏమిరా! చదివితిరిరా" యని యడుగగా వాళ్లునవ్వి "కాగితం చేతికిచ్చాం! బహుమతి తెచ్చుకొన్నాం!" అన్నారు. ఆహా! ఔదార్యము! పండితుడగునో కాదో- పండితుడనని వచ్చినాడు. వానిని నీ వగుదువా, కాదా యని రసాభా



## దేశోద్ధారక, విశ్వదాత
## కీ. శే. కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుంగార్లు

ప్రియజనకులైన శ్రీ పంతులుగారి సప్తమవర్ధంతి (చైత్రశుద్ధద్వాదశి) సందర్భమున వారి పవిత్రాత్మకు భారతి భక్తితాత్పర్యములతో నివాళిపట్టుచున్నది.

సముచేయు దాత యేమి దాత? అట్లు చేయవలయు నను నూహయు లేని పంతులుగా రెట్టి దాత!

తరువాత వారిని గురించి నాకు రెండే విషయములు తెలియును. ఒక రోజున పంతులుగారు మదరాసు పోవుటకు బెజవాడలో రైలెక్కుచున్నారు. నేను వారి వెనుకనే కొంచెము దూరముగా నడచుచు పోవుచుంటిని. ఎడమచేతిలో అయిదులు, పదులు రూపాయల కట్టల నోట్లున్నవి. దారివెంట గేటు మొదలు రైలు కదలువరకు రైల్వేయుద్యోగస్థులు, మరి యెవ్వరో యితరులు వారి దగ్గరకు వెళ్లుటయు, నమస్కారము చేయుటయు, ఆయన కుడిచేతితో చేతికి వచ్చినన్ని అయిదో, పదియో, పాతికో యిచ్చుచుండుటయు! నా కది చూచినప్పుడు కన్నులు బైరులు క్రమ్మెను. ఇది యేమి దాతృత్వము! కర్ణుడు, రాయని బాచడు మొదలైనవారు మాత్ర మిట్లు చేసియుండిరా యని యనిపించెను.

రెండవది యిది. నేను గుంటూరులో నుద్యోగము మాని బెజవాడకు రాకమునుపు, ఆరేండ్లు బందరులో నుండి నా పుస్తకము లేవో యచ్చువేయించుచు అది జీవికగా నుంటిని. ఒకప్పుడు మదరాసు పోయితిని. చిరంజీవి శంభుప్రసాదు నాకు శిష్యుడు. శంభుప్రసాదును చూడవలయునని పంతులుగా రింటికి వెళ్లితిని. అతనితో మాట్లాడి తిరిగివచ్చుచుండగా పంతులుగారు వారి యింటి ముంగిట ఎడమ చేతివైపుగా శిలావిగ్రహము లున్నచోట ఒక తీవపందిరిలో కూర్చుండుట వారి కలవాటు. అక్కడ కూర్చుండి నన్ను పిలచిరి. నేను పోయి నమస్కారము చేసితిని. "ఏమండీ! మీరు మీ పుస్తకములు ప్రకటించుచున్నారటగదా? నన్ను వచ్చి యేమియు నడుగలేదేమి"యని యడిగిరి. నే నేమియు మాటాడలేదు. మధ్యాహ్నము ఆఫీసుకు రమ్మనిరి. నేను పోయి కనిపించితిని. వెంటనే వందరూపాయల చెక్కు వ్రాసి యిచ్చిరి.

నేను ఎదుటివారి యౌదార్యము భరించుకొనలేను. ఇట్టి యవ్యాజౌదార్యమునకు నెట్లు ఋణవిముక్తి చేయవలయునో తెలియక నా 'త్రిశూల'మను నాటకమును వారి కంకితము చేసితిని. అది వారి తుది రోజులలో జరిగెను.

ఇంతకు మించి పంతులుగారినిగురించి నా కేమియు తెలియదు.

నేను వట్టి కవిని. సూర్యుని తేజస్సే చూడగలను. ప్రకృతిశాస్త్రపరిశోధకులైనచో భూతఅద్దములద్వారా సూర్యబింబములో కొండలు చూతురో! నదులు చూతురో!! నేను సూర్యునియందలి ప్రాణదాతృత్వమైన దీప్తిమాత్రమే చూచితిని.

విశ్వనాథ సత్యనారాయణ.

* * *

## శుష్కప్రియాలు

మా నాగేశ్వరరావు పంతులుగారు 'తగని-గర్విష్ఠి'; 'పరమలుబ్ధుడు'

—ఇవే నాకు పంతులుగారిలో నచ్చిన ఉత్తమ-సుగుణాలు.

అంతటి గుణ-లుబ్ధుణ్ణి నా చిన్నతనంలో నేను చూడటం అదే తొలిసారి. తెలుగుతనాన్ని, తెలుగువారిని తలుచుకుంటూ పలవరింతగా అనుక్షణమూ పులకరించిపోయే ఆ గర్వానికి ఒక హద్దూ పద్దూ అంటూ ఉంటేనా?

పంతులుగారికి చీటికీ-మాటికీ కోపం రాదేమా అని నాకు కోపం వచ్చేది. అమ్మయ్య! ఇన్నాళ్లకు, ఆయన పుట్టి-బుద్ధెరిగిన తరువాత కోపమంటూ రాబోతూన్నది గదా, ఇక తరించాడు, అని మనం ఎంతో ముచ్చటపడుతూ అందుకోసం పడిగాపులు పడిఉంటే, ఇంతా చేసి, తీరా ఆయనకు నవ్వొచ్చేది...అదేం పాపమో!

ప్చ్! యీ రవంత భాగ్యానికి కూడా పంతులుగారు నోచుకోలేదు.

ఆయనకు కీర్తికాంక్ష లేదంటారా? ఓం... ఉడ్డోలంగా ఉంది: ఎందుకు ఉండదూ?— దానికి

వారసులము యింతమందిమి ఉన్నామని ఆయనకు తెలియదు గనుకనా ?

నిజంగా మనం అసాధ్యులం. మన గడ్డమీద కళ్లు తెరిచిన తతిమ్మా బంగారు-తండ్రులకు మల్లేనే, సారె చీరె పెట్టి ఏ దేశానికో పంపించి, అక్కడ కూర్చుని కోటికి వేయిపడగలెత్తి కూర్చోనీకుండా, వీళ్లైనంత చేరువలో నిలుపుకుని పట్ట-పగ్గాల్లో ఉంచి 'యీ నాలుగురాళ్లతోనే సంతృప్తిపడండి' అన్నాం. ఆ ఘనుడు ఉన్నవాడు ఉన్నట్టుండక, ఆ యిరకాటం లోనే విశ్వదాతగా వెలశాడంటే, అది మన లోపమా ? అనంతమైన విశ్వానికీ, అందులో ఆవగింజ పాలు లేని జన్మ-భూమికీ తేడా కనిపెట్టలేని వట్టి అర్భకుడు పంతులుగారు.

పంతులుగారిలో ఎన్ని లోపాలు ఉన్నాయో అందరికీ తెలిసిన సంగతే కదా !

ఎవరన్నా బాధపడుతూంటే, ఆ బాధ తమదిగా హమేషా భావించడం అదో లోపం.

ఎవరన్నా బాధపడతారేమోనని, తాము ఎప్పుడూ బాధపడుతూండటం...ఇదో లోపం.

లోకంలో, ఎదుటివారిలో, కొండలపెట్టున ఎన్ని లోపాలు కనపడుతూన్నా, లీలగానైనా వాటిని చూడలేని దృష్టి-మాంద్యం...అన్నింటికన్నా ఘట్టి లోపం. అయినా, ఫరవాలేదు, ఉదారహృదయులమైన మనం, తెలుసువారం, వాటి నన్నింటినీ మన్నించాము ; ఎలాగో సరిపెట్టుకుంటూ వచ్చాము.

నిజానికి, పంతులుగారికి 'పుట్టు-గతులు' లేవు. మనకు ఏ మాత్రం ఆచోకీ తెలిసినా అందుకు ఒప్పుకోమని, రెండోకంటివాడికి తెలియకుండా, ఒకుపుగా, పునరావృత్తిరహితమైన పదమును కాజేశారు. పోనిద్దురూ, యింతా చేసి, అదే ఆయన దాచుకున్న సొమ్ము !

నాగేశ్వరరావుపంతులుగారి ప నే చాలా మెరుగు, మొత్తానికి ! ఆయన యింటిపేరూ, ఆయన పేరూ ఏరి-కోరి పెట్టుకున్న దేవర, దక్కిస్తూ, ముక్తీ-మోక్షమూ లేకుండా, గంగబడ్డున రాయిలాగా పడిఉన్నాడు...శివ-శి

మల్లాది రామకృష్ణశాస్త్రి.

# ఎవరి కెరుక?

= శ్రీ పుట్టా సూర్యనారాయణమూర్తిచౌదరి =

జగతి నెన్నెన్నియో హీనజన్మ లెత్తి
చివర కేను సీతాకోకచిలుక నైతి
వెనుక నంద రసహ్యించుకొనిరిగాని
పిదప నన్నందరును గౌరవించుచుండ్రి.
మిలమిలలు నింపు నాదు రెక్కలను గాంచి
కుసుమకుసుమాన మధువు త్రాగుటనుజూచి
సుందరంబుగ నే చరించుట దలంచి
యే నదృష్టవంతుడ ననియెదరుగాని.
బిడియమే లేక తీవతీవకును జేరి
పొట్టకూటికి పూవుపూవును తడుముచు
ప్రాణముల నఱచేతను బట్టుకొనుచు
నిమిషనిమిషమ్మునకును వేషముల మార్చి
నిలుకడే లేని బ్రతుకుబాటల చరింప
నిపుడు నే బడు వేదన లెవరి కెరుక !!!

# కలగూరగంప

## ఆదర్శగ్రామమైన సేవాగ్రాం

సుమారు తొమ్మిది సంవత్సరాల క్రిందట మహాత్ముడు సబర్మతీ ఆశ్రమాన్ని విడిచినప్పుడు (కీ॥ శే॥) జమ్నాలాల్ బజాజ్ ఆయన్ని వార్ధాకు ఆహ్వానించాడు. అతని ఆహ్వానాన్ని స్వీకరించాడు బాపూజీ. అక్కడికి దగ్గరలో వున్న మగన్‌వాడి గ్రామంలోని అఖిలభారత గ్రామపరిశ్రమసంఘం అతని దృష్టిని గ్రామోద్ధారణకు పురికొల్పింది. మిగతా జీవితం గ్రామ ప్రజలతోనే గడిపి, వారి అభివృద్ధికోసం పాటుపడమని అతని అంతరాత్మ బోధించింది.

తరువాత వార్ధాకు నాలుగుమైళ్ల దూరములో వున్న 'సెగాన్' గ్రామం మహాత్ముణ్ణి ఆకర్షించింది. అదృష్టవశాత్తూ ఆ గ్రామస్థలమంతా (కీ॥ శే॥) జమ్నాలాల్ బజాజ్ అధీనంలో వుండడంవల్ల ఆయన ఆ స్థలమంతా సంతోషముతో బాపూజీకి అర్పించాడు. ఆ గ్రామాన్ని పూర్తిగా ప్రజల సేవకోసమే వినియోగించడానికి నిశ్చయించి, దానికి 'సెగాన్' అన్న పేరును మార్చి "సేవాగ్రాం" అని పెట్టాడు బాపూజీ. కొద్దిసంవత్సరాలలోనే ఆ ప్రదేశంలో అనేక కుటీరాలు వెలిశాయి. సేవాగ్రాం ఇప్పుడు, పూర్వము మహాఋషుల ఆశ్రమాలకిమల్లే, ప్రశాంతంగా వుంటుంది. ఒకప్పుడు ఈ గ్రామానికి కాలిబాటకూడ లేదు. శ్రీ హసన్‌గారు వార్ధాడిస్ట్రిక్టుబోర్డు అధ్యక్షుడుగా నున్నప్పుడు వార్ధానుంచి సేవాగ్రాంకు ఒక చక్కటి రోడ్డు వేయించి పుణ్యంకట్టుకున్నారు.

సేవాగ్రాం పవిత్రతమూలంగా వార్ధా ఒక పుణ్యక్షేత్ర మయింది. ప్రపంచంలో అనేకమంది నిత్యం అక్కడకు వస్తూనేవుంటారు. క్రమంగా, సేవాగ్రాంలో, భారతభాగ్యోదయానికి వేర్వేరువిధాల పాటుపడుతూన్న హిందుస్థానీతాలిమీసంఘం, గ్రామపరిశ్రమసంఘం, గాంధీసేవాసంఘం, మహిళాశ్రమం మొదలైనవి లేచాయి. గురుదేవుని శాంతినికేతనం, అడయారులకు మల్లే సేవాగ్రాంలో అలంకారాలూ, ఆడంబరాలూ ఏమీ లేవు. అతిప్రశాంతంగా, అతినిర్మలంగా వుంటుంది. అక్కడ జాతి మత భేదాలకు తావులేదు.

సేవాగ్రాంను ఆదర్శగ్రామంగాను, స్వశక్తివంతంగాను చేయడానికి మహాత్ముడు అన్ని విధాలా ప్రయత్నాలు చేస్తూనేవున్నాడు. శిక్ష, భోజనం, నివాసం మొదలైన విషయాల్లో మహాత్ముడి వుద్దేశాలు అక్కడ అమలులో వున్నాయి. ఆశ్రమాన్ని శుభ్రపరిచే బాధ్యత ఆశ్రమవాసులదే. అందుకే మరుగుదొడ్లు బాగుచేయడం, పీకుల్ని వూడ్చడం మొదలైన పనులన్నీ ఆశ్రమప్రజలే, కార్యక్రమంప్రకారం, తెల్లవారిందిమొదలు రాత్రయిందాకా చేస్తారు.

ప్రశాంతమైన ప్రకృతి వాతావరణంలో పెరగడం ఉత్తమమని మహాత్ముని ఉద్దేశ్యం. అందుకు తగినట్టే సేవాగ్రాం నిర్మించబడింది. బాపూజీ నివసిస్తూన్నది ఒక చిన్న మట్టిగోడల కుటీరం. అదే బాపూజీ కార్యాలయం. రోజూ వచ్చే వందలకొలది వుత్తరాలను పూర్వం మహాదేవదేశాయి విప్పుతునేవాడు. కాని అత నిప్పుడు లేడు. ఈ ప్రపంచాన్ని శాశ్వతంగా విడిచిపెట్టాడు. ప్రస్తుతం శ్రీ ప్యారీలాల్, శ్రీమతి కుర్షీద్‌బెన్ కలసి ఆ పనిని చూచుకుంటున్నారు.

దర్శనానికి వచ్చినవారితో, చాపమీద కూర్చుని

నూలు వడుకుతూనే బాపూజీ మాట్లాడుతాడు. రాత్రిళ్లు బాపూ ఆరుబయట హాయిగా నిద్రిస్తాడు. సోమవారం నాడు ఎవరితోనూ మాటాడడు. విశ్రాంతికోసం కాదు- ఆ రోజు వ్రాతపనిలో నిమగ్నుడై వుంటాడు.



సేవాగ్రాంలో గాంధీజీ

సేవాగ్రాంలో ఒక కుష్ఠురోగికూడ వున్నాడు. ఆ రోగి ఒక సంస్కృతపండితుడు; పేరు శ్రీ పర్చూరు శాస్త్రిగారు (**Shri Parchure Sastri**). ఆయనంటే మహాత్మునికి ఒకవిధమైన ప్రేమ. కుష్ఠురోగి అవడం చేత ఆయన్ని ఎవ్వరూ ఆదరించలేదు. అందుచేత కొన్నాళ్లకు ఆయనకు జీవితంమీద విరక్తి పుట్టి, జీవితాంతమువఱకు నిరాహారదీక్ష చేయడానికి నిశ్చయించుకున్నారు. అప్పుడు దిక్కులేని ఆయన్ని గాంధీ ప్రేమతో చేరదీసి, తన సర్సునూనె (**Sarsu**) మందువల్ల కొంత బాగుచేశాడు. ఇప్పుడాయన నిరాహారదీక్షాప్రయత్నాన్ని మానుకున్నారు. గాంధీజీ ఆయన్ని వేరే ఒక కుటీరంలో వుంచాడు. ఆయనఆరోగ్యవిషయంపై మహాత్ముడు రోజూ రెండుగంటల కాలం వ్యయపరుస్తాడు. సర్దార్ వల్ల

భాయి పటేల్, రాజేన్‌బాబు, ఆచార్య నరేంద్రదేవ్ మొదలైన దేశనాయకులు, తమ కెప్పుడైనా వళ్లల్లో అస్వస్థతగా నున్నప్పుడు, చికిత్సకోసం, విశ్రాంతి కోసం సేవాగ్రాంకు వస్తూంటారు, ఇలా బాపూజీ ఒక వైద్యుడే కాక, న్యాయాధిపతి కూడ సేవాగ్రాంలో. అక్కడ ఏ తగవు వచ్చినా బాపూజీ తీర్పు ప్రమాణంగా తీసుకుంటారు.

చిమూరుగాథలో నిరాహారదీక్ష వహించిన ప్రొఫెసర్ భన్సాలీగారి నివాసం సేవాగ్రాంలోనే. అతనికి గాంధీజీ అంటే అమితభక్తి. సేవాగ్రాంలో బాలబాలికలకు విద్యాదానం చేస్తూ కాలం గడుపుతున్నారు. ఒకప్పుడీయన వుత్త వేపాకులనే ఆహారంగా స్వీకరించేవారు. అతనితో మాట్లాడుతూంటే అదోమాదిరి ఆనందం కలుగుతుంది.

ఏడులక్షల భారతగ్రామాలలో వున్న నిత్యజీవనం ఒక్క సేవాగ్రాం ఆశ్రమాల్లో ప్రతిఫలిస్తూంది. అందుచేతనే నిరాడంబరమైన ఈ సేవాగ్రాం ప్రపంచ దృష్టిని ఆకర్షించింది. (స్వేచ్ఛానువాదం)

జి. వి. యల్. యన్. స్వామి.

---

## కీ|| శే|| కె. యస్. గుప్తగారు

కేంద్రశాసనసభలో గంజాం, విశాఖపట్టణ మండలాల నియోజకవర్గము తరపున కాంగ్రెసు సభ్యుడైన కొల్లూరి సూర్యనారాయణ గుప్తగారు మార్చి ౨౯-వ తేదీనాడు అసెంబ్లీ సభలో మాట్లాడుచు మాట్లాడుచునే హఠాత్తుగా అసువులుబాసిరి.

అప్పటికి గుప్తగారికి ౫౬ ఏండ్లు. ఆ దినము పగలువరకు ఉల్లాసాగానే ఉన్నారు. ఆ క్రితము రాత్రి ప్రపంచ విషయములను గురించి మాట్లాడుచు ఆనందముగానే ఉన్నారు. ఆనాడు సభలో ఉపన్యసింప లేచినారు. ప్రభుత్వ చర్యలను ఖండించుచు మాట్లాడుచున్నారు. ప్రజలు తిండిలేక, బట్టలులేక, మందులులేక బాధపడుచున్న సంగతిని తీవ్రముగా చెప్పుచువచ్చినారు. ఇంతలోనే, ఎక్కడినుండి ఊడిపడ్డదో, గుండెజబ్బువచ్చి దాపరించినది. మాటల మధ్యలోనే ఆపి, "అధ్యక్షమహాశయా, నాకు ఒంటిలో సుస్తీగా ఉన్నది'' అని చెప్పి కూలబడిపోయినారు.



కీ|| శే|| కె. ఎస్. గుప్తగారు

వెంటనే ప్రథమ చికిత్స జరిగినదిగాని, లాభములేకపోయినది. ఆయనలోనుండి హంస ఎప్పుడు సందు చూచుకొని లేచిపోయినదో లేచిపోయినది. వట్టి కళేబరము మాత్రము మరుసటిరోజున విమానమెక్కి పుట్టినింటికి చేరుకొన్నది.

వానరాకడ, ప్రాణముపోకడ ఎవరికిని తెలియదందురు. ఇందుకేనేమో! ఏ క్షణానికి, ఎవరికి ఎక్కడ వ్రాసియున్నదో ఎవరెరుగుదురు!

భారతదేశములోని బీదలబాధలు నివారింప కంకణము కట్టుకొన్న గుప్తగారు ఇంత అకస్మాత్తుగా తనువుచాలించుట విచారకరము.

---

## 'ఇంటిపేరంటే—?'

గతమాసపు 'భారతి'లో పై శీర్షికతో ఇంటి పేర్ల పుట్టుపూర్వోత్తరాలనుగురించి విమర్శిస్తూ శ్రీ మేరు సోమయాజుల వరహాలుగారు 'వ్యాయామవిశేషాలు' అనే ఉపశీర్షిక క్రింద దాట్లవారినీ, కప్పగెంతుల వారినీ ఉదాహరించారు.

కప్పగెంతులవారనేది వ్యాయామ సూచకం కాదు. ఆ పదం 'కప్పగొంతుల'వారి భ్రష్టరూపం! ఆ కుటుంబంలోని పూర్వీకులు ఘనాంతస్వాధ్యాయులయి కప్పలు అరచునట్లు పనసలు చెప్పటచేత ఆ పేరుకలిగింది. ఆ 'కప్పగొంతుల' పదం ఆనోటా ఆ నోటా పడి రూపుచెడి 'కప్పగెంతుల' అయినది. ఇలా ఎన్నో యిళ్లపేర్లు తారుమారయాయి. అలాంటి వాటి యథార్థస్థితిని పరిశోధిస్తేనేగాని యింటిపేర్ల తత్త్వం నిశ్చయింపబడదని మనవి.

బులుసు వేంకటరమణయ్య.

## సుమిత్ర మాగధి

౧౯౪౪ ఆగస్టు భారతియందు "సుమిత్ర యే రాజుకూఁతురు?" అను శీర్షికతో నే నొక చిన్న వ్యాసము రచియించితి.

అందు, వాల్మీకి రామాయణమున కౌసల్యాకైకేయులు, కోసలకేకయాత్మజలుగాఁ జెప్పఁబడిరనియు, సుమిత్ర యే దేశపు రాజుకూఁతురో చెప్పఁబడలే దనియు, వాల్మీకీతరకవికృత రామాయణములయందు సహితము సుమిత్రాజనకుని నామము చెప్పఁబడలేదనియు, పింగళిసూరనార్యకృతరాఘవపాండవీయమున మగధతనయ యని యీ క్రింది పద్యమునఁ గానవచ్చుచున్న దనియు విరచించితిని:

రాఘవపాండవీయము ౧ ఆ. ౭ ప:-

సీ. "ధృతిఁ గుంతిమద్రభూపతుల......

జగతిఁ గోసలకేకయమగధుల తన
యుల వరించిన యాజ్ఞలో మెలఁగఁజేసె."

అందే మగధతనయ (మాగధి) యనుటకు "సూరన కే గ్రంథమునం దాధారము కలదో విజ్ఞులు పరిశీలింపవలసియున్నది." యని వ్రాసితిని.

ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బారావుగారి వాల్మీకిరామాయణమందరవ్యాఖ్యానమున నీ క్రింది శ్లోకములు పద్మపురాణమునుండి గ్రహింపఁబడి యున్నవి:

శ్లో. "కోసలస్య నృపస్యాథ
తనయాంచ శుచిస్మితామ్,
కౌసల్యాంనామ కన్యాం తా
ముపయేమే స పార్థివః,
మాగధస్య నృపస్యాథ
పుత్రీ సర్వాంగశోభనా
సుమిత్రానామ నామ్నాచ
ద్వితీయా తస్య భామినీ
తృతీయా కేకయస్యాథ
నృపతే ర్దుహితా తథా
భార్యాభూత్ పద్మపత్రాక్షీ
కైకేయీనామ నామతః."

పై శ్లోకము మూలమున సుమిత్ర మాగధ (మగధ) తనయ యనుట స్పష్టమగుచున్నది. మన సూరనగారికి పద్మపురాణమే యాధారమైయుండునని యూహింపవలసియున్నది.

రావూరి దొరసామి



# విమర్శనము



## "Deliverance"

రచన : శరత్ చంద్ర; ఆంగ్లానువాదం : దిలీప్ కుమార్ రాయ్ ; అరవిందులు అనువాదం సరిచూశారు. రవీంద్రులు తొలిపలుకు వ్రాశారు.

ప్రకాశకులు : నలందాపబ్లికేషన్స్, N. M. త్రిపాఠి లిమిటెడ్, ప్రిన్సెస్ స్ట్రీటు, బొంబాయి 2. వెల రూ. 3-8-0.

తొలిపలుకుల్లో అరవిందులు వ్రాసిన మాటలలో ఎంతో సత్యమున్నది. శరత్ గొప్ప మేధావి, అతనిది అతివిశాలమైన హృదయం; అతినిశితమైన చూపు. మితిలేని సానుభూతి. మానవుల దుఃఖాన్నీ, వేదననీ, హృదయం కరిగించేట్లుగా చిత్రించటంలో శరత్ అందెవేసిన చెయ్యి. మనుష్యుల స్వభావాలలో వుండే మలుపులూ, మెలికెలూ కళ్లకు కట్టించి పాత్రలమీద పాఠకులకి చెప్పలేని మక్కువ కలిగించగలడు. ఆ పాత్రల సుఖదుఃఖాలు తనవే అయినట్లుగా పాఠకుని హృదయం ముందున్న కథకోసం గబగబ పరిగెత్తుతుంది.

ఈ నవలలో శరత్ ఒక కుటుంబాన్ని చిత్రించాడు. నవల మొదలయేసరికి ఆ కుటుంబంలో గిరీశ్, హరీశ్, వాళ్ల పినతండ్రికొడుకు రమేశ్, వాళ్ల భార్యలు సిద్ధేశ్వరీ, నయనతారా, శైలా, వాళ్ల పిల్లలూ అంతా సుఖంగా కలిసివుంటారు. వంటింటికి పెద్ద సిద్ధేశ్వరి. ఇంటికి పెద్ద ఆమె భర్త గిరీశ్. పిల్లలని అదుపులో వుంచటం, ఇనప్పెట్టె తాళం చెవులు కొంగున కట్టుకుని డబ్బు వాడుతూ వుండటం శైలపని. గిరీశ్, హరీశ్ ప్లీడర్లు. రమేశ్ మాత్రం ఉద్యోగ మేమీ లేకుండా ఇంట్లో కూర్చొని పత్రికలకి వ్రాసి దేశాన్ని బాగు చెయ్యాలనుకుంటూ వుంటాడు. నయనతార నవ నాగరికత కలవడిన నారి. ఆమె భర్త హరీశ్ కూడ

అంతవరకూ అరమరలు లేని కుటుంబంలో మెల్లమెల్లగా భేదాలు తల ఎత్తుతయ్. నయనతార కొడుకు బూట్లు తొడుక్కుని వంటింట్లోకి వస్తాడు. శైల ఆ అబ్బాయిని బైటికి పోయి బూట్లు విప్పి రమ్మంటుంది. విప్పకుండా అక్కడే నిలబడతాడు. ఇంతలో సిద్ధేశ్వరికొడుకు ఆ దోవన పోతూ, బూట్లు విప్పనని మొండికివేసిన కుర్రాడిని చెంపమీద కొడతాడు. ఇంకేముంది, ఇల్లంతా గందరగోళం. శైల కొట్టించిందనీ, తాము అక్కడ వుండటం శైలకి ఇష్టం లేదనీ, వెంటనే ఇంకో ఇంటికి వెళ్లిపోతామనీ నయనతార గొడవచెయ్యటం మొదలుపెడుతుంది.

ఎల్లాగయినాసరే కుటుంబంలో చీలికరాకుండా చూడవలెననే తాపత్రయం సిద్ధేశ్వరికి. శైలదే తప్పనీ, ఏమైనా సరే వెళ్లటానికి వీలులేదనీ నయనతారను బ్రతిమాలి ఒప్పిస్తుంది.

అప్పటిదాకా శైలమీద సిద్ధేశ్వరికి ఎంతో గురి. శైలను తానే పెంచి పెద్దదాన్ని చేసి మరిదికిచ్చి పెళ్లిచేసింది. అందువలన శైల అంటే ఎంతో మక్కువ. మెల్లిమెల్లిగా నయనతార సిద్ధేశ్వరిని లోబరుచుకుంటుంది. శైలమీద ఏవగింపు కలిగిస్తుంది. ఎవరు ఎటు తిప్పితే అటు తిరుగుతుంది సిద్ధేశ్వరి. కొన్నాళ్లకి శైల తన ఇనప్పెట్టెలోంచి డబ్బు దొంగిలిస్తున్నదేమోనని అనుమానపడుతుంది. పరాయివాళ్లు నా ఇంట్లో చెడతింటుంటే నే నూరుకుంటానా? ఎన్నాళ్లని రమేశ్ అన్నగారి నెత్తిన కూచోటం? అని శైలను ముల్లుకుళ్ళలాటి మాటలతో పొడుస్తూ

వుంటుంది. అయినప్పటికీ శైలని ఇల్లా బాధిస్తున్నానే అన్న పరితాపం కూడా సిద్ధేశ్వరిలో వుంది. శైలని ఏదో విధంగా పలకరించాలని చూస్తుంది. శైలని నిందతో అయినా పలకరించాలని చూస్తుంది. శైల అన్నిటినీ ఓర్పుతో సహిస్తుంది.

చివరికి కుటుంబంలో చీలిక రానే వచ్చింది. ఈసారి శైలా పిల్లలూ, భర్త రమేశ్ ఇల్లు వదిలి వెళ్లిపోతారు. పల్లెటూళ్లో వాళ్లకున్న ఇంట్లో వుంటారు. వాళ్లు వెళ్లిపోయిన రాత్రి సిద్ధేశ్వరి పడ్డ తహతహకి మితిలేదు. శైలకొడుకు లిద్దరూ తలొకవైపునా తన పక్కలో నిద్రపోయేవాళ్లు. ఆ రాత్రి శూన్యంగా వున్న పక్కని చూసేసరికి సిద్ధేశ్వరికి పట్టలేని దుఃఖం వస్తుంది. వాళ్లు నాపిల్లలు, వెంటపెట్టుకుపోవటానికి శైల కేమీ అధికారం లేదని భర్తదగ్గరికీ, మరదిదగ్గరికీ వెళ్లి, వెంటనే పిల్లల్ని తెచ్చి దిగవిడువవలసిందని లాయరునోటీ సిమ్మంటుంది. ఈ సంఘటనలో సిద్ధేశ్వరిలో వున్న మాతృత్వంతో కదిలించివేశాడు శరత్.

చివరికి గిరీశ్ తమ్ముడు వుంటున్న పల్లెటూరు వెళ్లవలసిన పని వొస్తుంది. అప్పటికి హరీశ్ కుట్రవల్ల, నయనతారవిషంవల్ల రమేశ్ మీద కోర్టులో దావా జరుగుతూవుంటుంది. ఈ వ్యవహారం నడిపేందుకు డబ్బు ఎక్కడిది రమేశ్ కి ? అదంతా శైల నీ ఇనప పెట్టెలోంచి తస్కరించిన డబ్బే అని నయనతార సిద్ధేశ్వరిమనస్సు విరిచినా, సిద్ధేశ్వరి భర్త వెళ్లేప్పుడు రమేశ్ పిల్లల నిద్దర్నీ చూసిరమ్మనీ, వెంట తీసుకురమ్మనీ చెపుతుంది. గిరీశ్ ది వింతస్వభావం. ఏదీ అతని మనసుకి పట్టదు. వెళ్లేవెళ్లటంతోనే తమ్ముణ్ణి తిట్టి, "ఓకేనో, ఓ పాతాల్" అని పిల్లలని పిలుస్తూ ఇంట్లోకి వెళ్తాడు. పిల్లలు వచ్చి పెద్దనాన్నని చుట్టేసుకుంటారు. అంతవరకూ దీనంగా దేవుడిని వేడుకుంటున్న శైల వచ్చి బావగారికి నమస్కారం చేస్తుంది. ఏమీ మనసుకి పట్టని గిరీశ్ కి వొంటిని ఒక్క నగ అయినా లేకుండా దీనంగా కనిపించిన శైలని చూడగానే గుండె చివుక్కుమన్నది. వెంటనే




పల్లెటూరిలో తనకున్న ఆస్తి అంతా రమేశ్ పేర వ్రాసేసి ఇంటికి వస్తాడు.

ఇంటికి రాగానే తమ పథకం పాడయినందుకు హరీశ్, నయనతారా గిరీశని నా నా మా ట లూ అంటారు. కాని సిద్ధేశ్వరి భర్త చేసిన పనికి ఉప్పొంగిపోతుంది.

ఇదీ కథ. ఈ కొస్తకథలో స్త్రీహృదయం లోతులు తడివిచూపించాడు శరత్. కృత్రిమమైన పన్నాగాలు చేసే నయనతారా, చెప్పుడుమాటలు విని ఎవరు ఎటు తిప్పితే అటు తిరిగే సిద్ధేశ్వరీ, ఆమె మాతృత్వమూ, కరుణా, శైలపాత్రలో చిత్రించిన చాకచక్యమూ, ధీరత్వమూ, తాలిమీ చదివినతరవాత కూడా మరుపురావు. ఏమీ పట్టించుకోని గిరీశ్ పాత్ర ఎంతో కులాసాగా చిత్రించాడు శరత్.

అనువాదం మొదట కొంచెం గడ్డుగా వున్నా,

పోనుపోను సాఫీగా సాగిపోయింది. పుస్తకం మొదలు పెడితే ముగించేదాకా తోచదు.

ముందుముందు రాయ్‌గారు శరత్ రచనలన్నీ ఆంగ్లంలోకి అనువదిస్తారని ఆశిస్తున్నాను. విశ్వసాహిత్యంలో గొప్ప నవలారచయితలతో తులతూగే శక్తి శరత్‌కున్నది. ఆ శక్తిని లోకానికంతకీ చాటటానికి ఇటువంటి ఆంగ్లానువాదాలు ఇంకెన్నో కావాలి.

---

## Telugu Literature

(ఆంధ్ర సాహిత్యము) రచయిత : ప్రొఫెసర్ పి. టి. రాజు, యం. ఏ., పి. ఎచ్ డి, శాస్త్రి, ఆంధ్ర యూనివర్సిటీ, గుంటూరు. ప్రచురణ : ది పి. ఇ. ఎన్. ఆలిండియా సెంటర్, ఆర్యసంఘ, మలబార్ హిల్, బొంబాయి. దొరికే చోటు : ది ఇంటర్నేషనల్ బుక్ హౌస్ లిమిటెడ్, ఆష్‌లేన్, ఫోర్టు, బొంబాయి. పుటలు ౨౮+౧౫౮ వెల ౨-౮-౦.

పి. ఇ. యన్. అనే పొడి అక్షరాలకు ఇంగ్లీషులో కవులు, వ్యాసకర్తలు, నవలాకారులు అని తాత్పర్యం. మొత్తంమీద వివిధరీతుల సాహిత్యపరులైనవారి బృందమే ఇంటర్నేషనల్ పి. ఇ. యన్. అనే సంస్థగా ఏర్పడింది. ౧౯౨౧ లో లండనులో స్థాపన అయిందిమొదలు ఇది జగద్విఖ్యాతంగా వర్థిల్లుతూ వచ్చింది. నానాదేశాల్లోనూ ఈ సంస్థశాఖలున్నవి. మన భారతీయశాఖను ౧౯౩౩ లో శ్రీమతి సోఫియా వాడియా స్థాపించింది. వివిధదేశభాషలందలి సారస్వతానికీ మంజూషగా ఉండాలని వీరి వాంఛ. అందువలన ఆ యా భాషాసాహిత్యాలను గురించి రాజభాష ఇంగ్లీషులో పుస్తకాలు ప్రచురించి ఇతరుల రసాస్వాదనకు తోడ్పడుతూ ఉన్నారు. ఈ విధంగా వీరు ఇంతవరకూ అస్సాం, వంగ సాహిత్యాలను గురించీ, భారతీయులు రచించిన ఆంగ్లసారస్వతాన్ని గురించీ పుస్తకాలు ప్రచురించారు. ఇపుడు తెలుగుసాహిత్యాన్ని గురించిన ఈ గ్రంథం ప్రచురణ అయింది. ఇందులో ప్రాచీనసాహిత్యము, నవ్యసాహిత్యము, అనువాదమాల అనే మూడు భాగాలున్నవి. సంపాదకురాలు శ్రీమతి సోఫియా వాడియాగారి పీఠిక, కట్టమంచి రామలింగారెడ్డిగారి ఉపోద్ఘాతము, గ్రంథకర్త మున్నుడీ వున్నవి. గ్రంథం చివర ఇంగ్లీషులో గల గ్రంథాల జాబితా ఆంధ్ర సాహిత్య పరిజ్ఞానానికని సూచికగా చేర్చారు.

భారతీయ సంస్కృతికి, సంస్కృత సాహిత్యానికీ ఆంధ్రులు ప్రశస్తమైన కృషిచేశారు. తెలుగు భాష పసిఫిక్ ఖండంలో వ్యాపించి ఫిలిప్పీను దీవుల దాకా పాకింది. ఫిలిప్పీన్ భాషలో ఎన్నెన్నో తెలుగుమాటలున్నవి.

దక్షిణాదిన తెలుగుప్రభావం కన్నడ సాహిత్యంలో హెచ్చుగా ప్రతిఫలిస్తూ ఉంది. తెలుగు సాహిత్యం ప్రథమదశలో సంస్కృత పండితులైన రచయితల ప్రాభవం హెచ్చుగా గోచరిస్తున్నా, కాలక్రమేణ దేశీయమైన నానుడితో కలిసిపోయి విశిష్ట సారస్వతంగా పరిఢవిల్లింది.

ఆంధ్రభారతంతో ప్రారంభమై ౧౮౭౫ వరకు వర్థిల్లినది ప్రాచీన సాహిత్యమనవచ్చును. ఆంధ్రభారతానికి పూర్వం తెలుగుసాహిత్యం ఉన్నదనుకున్నా దక్కినదిలేదు.

ఇది సమగ్రమైన ఆంధ్రసాహిత్య చరిత్రం కాదు. పరిమితమైన ధోరణిలో వ్రాశారు ఈ పుస్తకం. ఇతర రాష్ట్రాలవారికి, దేశాలవారికి సూక్ష్మంగా తెలుగు సాహిత్యపు పోకడలు తెలియజేయడమే ఈ పుస్తకం ఉద్దేశం. ప్రాచీనసాహిత్యాన్ని భారత కవులు, రామాయణ కవులు, ప్రబంధకవులు, శతక కవులు 'అని నాలుగు అధ్యాయాలుగా విభజించి వ్రాశారు. ఉన్న మితిలో మొత్తంమీద ఈ ఖండం సమగ్రంగా ఉంది. రెండో ఖండంలో నవ్యాంధ్ర సాహిత్యం గూర్చి వ్రాశారు. ఇక్కడ నే గ్రంథకర్త వ్రాసినది అసమగ్రంగాను, కొంత అనాలోచితంగానూ కనబడుతుంది. భమిడిపాటి కామేశ్వర

రావుగారు ఇటీవల హాస్యరచయితగా పేరొందారనీ, ఈ మధ్యనే శ్రీరంగం శ్రీనివాసరావుగారు ప్రభవరచనతో ప్రాముఖ్యత చెందారనీ వ్రాసినవి చూడగా అక్కడక్కడ వీరి విషయగ్రహణ పదేళ్లు వెనకబాటుగా ఉందా అనిపిస్తుంది. ప్రసిద్ధులైన వారిని కొందరిని ప్రస్తావించనేలేదు. దానికి 'లోకోభిన్నరుచిః' అనే సమాధానం కుదరదు. సాహిత్యచరిత్ర వ్రాసే వానికి జనాభిప్రాయపు ఆకళింతకూడా అవసరమే అవుతుంది. అవధానయుగంగా ఒకదశాబ్దం తెలుగు సాహిత్యంలో విజృంభించింది. అదికూడా ఉపేక్షించ తగ్గదికాదు. పలువురు చదివిన పుస్తకమని చెప్పినదాని కన్న గ్రంథవిషయం ఏ కొంచెమో తెలిపితే బాగుండేది. గెలెట్టీ, బ్రౌన్ ప్రభృతులు చిన్న ఇంగ్లీషు - తెలుగు నిఘంటువులు వెలువరించారని వ్రాసినది చూడగాను, ఇంకా ఇలాటి వ్రాతలను బట్టి వీ రాయీగ్రంథాలనుగూర్చి ఎక్కువగా తప్పవిని కిడినిబట్టి వ్రాసినట్లు కనబడుతుంది.

పేర్కొనవలసినవారిని పేర్కొలేదు సరికదా, పేర్కొన్నవారిని గురించైనా సమంజస ప్రస్తావన లేదు. అనువాదమూల ఏర్చి కూర్చినది బాగున్నది. ప్రాచీన సాహిత్యమందలి రసవంతపు ఘట్టాలను ఇంగ్లీషు కవనంలోకి దింపారు. అసలు గ్రంథంలో లాగానే ఇక్కడ కూడా నవ్యాంధ్రకవనానికి గాని, గద్యానికిగాని సరితగ్గ ప్రస్తావనలేదు. అయినా అసలు గ్రంథభాగం కన్న ఈ అనువాదమాలవల్లనే ఇతరులకు మన సాహిత్యవస్తువు, రసమూ ఎక్కువగా బోధ అవుతుంది.

పరాయివారికి ఈ గ్రంథం తెలుగు సాహిత్య గ్రహణకు ఉపకరిస్తుంది కాని ఉపకరించవలసినంతగా ఉపకరించదు. రెండో కూర్పులో రెండో ఖండం విశేషించి తిరిగి వ్రాయవలసి ఉంటుంది.

తెలుగురాని వారికి ఆంధ్ర సాహిత్యపరిచయం ఈ విధంగా కలిగించినందుకు పి. ఇ. యన్. భారతీయశాఖవారు అభినందనీయులు. 'సురుచి.'

## సూర్యప్రభ - జన్మదినసంచిక

సంపాదకులు : జంపన చంద్రశేఖరరావు, డి. అప్పారావుగార్లు. కార్యాలయము : ౨౩ గోవిందప్ప నాయనివీధి, జి. టి. మద్రాసు. వెల ౧ రూపాయ.

శ్రీ రాయప్రోలు సుబ్బరావు, విశ్వనాథ సత్యనారాయణ, కాటూరి వేంకటేశ్వరరావు, దువ్వూరి రామిరెడ్డిగార్లు మొదలైన సిద్ధహస్తుల రచనలతో ఈ సంచిక సరిక్రొత్తరూపము దాల్చియున్నది.

---

## ఢంకాసంవత్సరాదిసంచిక

ప్రత్యేకవ్యాసములు, ప్రత్యేక చిత్రములతో, వందకుపైబడిన పుటలతో ఇనుమిక్కిలి రూపండియున్నది. వెల ఒక రూపాయ. కార్యస్థానము : ౬, సుంకురామచెట్టి వీథి, జి. టి. మదరాసు.

---

# గ్రంథస్వీకారము

## సేవాంజలి

పార్థివ ఉగాదినాడు ఘనపురం స్టేషను (నైజాము) సారస్వతసేవాసమితివారు సమర్పించిన వివిధరచనాసంపుటి. వెల రూపాయిపావలా.

## మహాకవి - మహాపురుషుడు
## గురజాడ అప్పారావు

రచన : సెట్టి ఈశ్వరరావుగారు. ప్రకాశకులు : ప్రజాశక్తికార్యాలయము, బెజవాడ. వెల ౧౦ అణాలు.

## చుక్కాని

రచయిత : మంచళ్ల సుదర్శనాచార్యులుగారు, 'గ్రీన్‌గేట్సు,' సైఫాబాదు, హైదరాబాదు (దక్కను) వెల రూ. ౨-౮-౦.

## సంయుక్త

పద్యనాటిక. రచయిత : వేమూరి వెంకటరామనాథంగారు. ప్రాప్తిస్థానము : ఓరియంటల్ పబ్లిషింగ్ కంపెనీ, గుంటూరు. వెల ౧౦ అణాలు.

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, Madras. Editor:— S. Sambhu Prasad.




చక్కని రుచి, ఘుమ ఘుమలాడే
సువాసన, నేత్ర పర్వంగావుండే
రంగు, తక్కువధర, ఏటి అన్నింటి

నిబట్టి లిప్టన్స్

మిగతా వాటిని తలదన్ని అత్యు
చ్చుకున్నది.




# లిప్టన్స్ టీగర్ల్

మృదు మధురమైన ఇండియన్ డస్ట్ టీ

LTK 846



# 2 రంగాలకు ఉపయోగం

యుద్ధకాలంలో పౌరునికి, యోధునికి—యిద్దరికీ కష్టజీవనమే. సెలవరోజులు తక్కువ; పనికష్టతరమైనది; విరామసమయము మహా అరుదు. అందువల్ల ఆ విరామసమయాన్ని సక్రమంగా వినియోగించాలి. ఒకపుస్తకమో పత్రికనో చదువుకోవడము,—చక్కగా తయారుచేసిన—సేదదీర్చే టీ సేవించడము—యింతకన్నా మించిన మంచి మార్గం యేమున్నది?

టీ మిమ్ములను ఉత్సాహపరుస్తుంది; ఆనాటి చికాకులను మరపింపజేస్తుంది. టీ యెటువంటి ప్రమాదమూ కలుగజేయకుండా ఉషారు యిస్తుంది. టీ, వేడిగావున్నప్పుడు చలవచేస్తుంది, చలిగావున్నప్పుడు వేడినిస్తుంది. టీని మీ ఆప్తమిత్రముగా తలవండి; మీ విరామ సమయాన్ని దాని సాంగత్యములో హాయిగా గడపండి.



